

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**
**KAKINADA.**

## 48 వ వార్షిక సభా సంచిక



దేశభాషలందు తెలుగు లెస్స.


సంపుటము ౪౮ — సంచిక ౧-౨

Vol 48 — Part 1-2

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

స్థాపకులు

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు,)

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**
**KAKINADA.**

## 48వ వార్షిక సంచిక

సంపుటము 48 | వికారి చైత్ర-ఆషాఢములు | సంచిక ౧-౨

---

## విషయసూచిక


Telugu Institute Library
.cc No
J927



---

# స్వవిషయము

శ్రీ పీఠికాపురాధీశ్వరుల ప్రాపున ఆంధ్రభాష కమూల్యమైన సేవ యొనర్చుచుఁ దనయస్తిత్వమును గోల్పోవకుండ నిలువరించుకొని యున్న యీసంస్థకు నేఁటికి నలువదియేడేండ్లు గడచినవి. నలువదియెనిమదవయేట నడుగు వెట్టిన యీ భాషాపోషకసంస్థ, యుదారాశయుల ప్రోత్సాహమునఁ బంచసవసకల్యాణ మహోత్సవములు జరిగించుకొనునట్టి సౌభాగ్యసంపన్న యయినది. సాధారణముగ నీపఠికీపరిషద్వార్షికోత్సవములు రెండుదినములు మాత్రమే జరుపుట యొక పరిపాటిగా వచ్చినది. అత్యుదారులు అమితోత్సాహవంతులు సారస్వతారాధకులు నైన శ్రీ దంటు భాస్కరరావుగారు ఆంధ్రసాహిత్యపరిషత్ప్రధాన కార్యదర్శులుగా నుండుటకారణమున నీయేటి వార్షికసభలు పంచదివస పరిమితములై విజయవంతముగఁ గొనసాగినవి. ఈ పటికి జరుగు నుత్సవములకంటె నెన్నియోవిషయములందు నాంధ్రభాషాభిమానముగల సహృదయుల హృదయముల కమితానందముఁ గూర్చు సన్నివేశములు సమకూర్పఁబడినవి. ఆంధ్రదేశము నాలుగుచెరఁగులందుఁ బ్రసిద్ధులైన కవిపండిత విమర్శకు లందఱు నీ యుత్సవములందుఁ బాల్గొని తమ తమ ప్రతిభావ్యుత్పత్తులను సభ్యుల కెఱిఁగించి యానందము గలిగించినారు.

ఆంధ్రప్రదేశ విద్యాశాఖామాత్యులు గౌ॥ శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావుగారు వార్షిక సభాధ్యక్షులుగను ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నీలం సంజీవరెడ్డిగారు వార్షికోత్సవ సభాప్రారంభకులుగను విచ్చేయుట యొక భవ్యసన్నివేశము. ఆంధ్రప్రదేశాస్థానకవులు ఆంధ్రసాహిత్య పరిషదధ్యక్షులు కవిసార్వభౌములు నగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు కడువృద్ధులయ్యును అమితోత్సాహముతో నీ యుత్సవ కార్యక్రమము లన్నిటను బాల్గొని దిగ్విజయముగ నాగించుట మఱియొక యద్భుతసన్నివేశము. ఈ సభానమా

వేశములు జూను నెల 9వ తేదిని ప్రారంభించి 13వ తేది తుదివఱకు నిర్విరామముగాఁ గొనసాగినవి. మూఁడవనాఁడు భువనవిజయ సభా ప్రదర్శనము పండితకవిసమ్మేళనమున ప్రేక్షక హృదయాకర్షకముగాఁ నిర్వహింపఁబడినది. ఆనాఁటి రాత్రి విశుద్ధ గ్రాంథికాంధ్రభాషాపద ప్రయోగముతో, కంఠాభరణ నాటకము పండిత పామరామోద పాత్ర ముగాఁ బ్రదర్శింపఁబడినది. నాల్గవనాఁటి రాత్రి గొల్లకలాపము శాస్త్ర సంప్రదాయానుగతముగ ప్రేక్షకుల కామోద మేర్పడునట్లు వినిపించుట జరిగినది. అయిదవనాఁడు స్త్రీలకు ప్రత్యేకసభ నేర్పాటుచేసి వారి విద్వత్త్వావిశేషములు లోకమున కెఱిఁగించుట, వారికిఁ గూడ నిట్టి పండిత కవి సమావేశములలోఁ బాల్గొను నుత్సాహము నొదవింపఁజేయుట జరిగినది. ఆనాఁటి మధ్యాహ్నము పద్యరచనమునందును ఉపన్యాసములందును పోటీలలోఁ బాల్గొనినవారలలోఁ బ్రథములుగా గణింపఁబడిన వారికి స్వర్ణ రజతపదకములు బహూకరించుట, నిఘంటు కార్యనిర్మాణమునం దీవఱకుఁ బనిచేసిన పండితులకు 5, 6 సంపుటములు బహూకరించుటయు జరిగినది. ఈ వార్షికోత్సవములలోఁ బాల్గొనిన పండితులకు కవులకు ఉపన్యాసకులకు నూతనవస్త్రప్రదానము ఆహూతులై వచ్చిన విద్వాంసులకు మార్గవ్యయము లిచ్చుటయును జరిగినది. ఈ విధముగ నయిదు రోజులు పరిషత్సభలు దిగ్విజయముగ జరుగుటకు శ్రీ భాస్కరరావుగారి సాహసౌదార్యసముత్సాహములే ప్రధాన కారణములు. ఈ సభలు నిర్వహించుటకయిన వ్యయమంతయు శ్రీ భాస్కరరావుగారే భరించినారు.

వార్షికోత్సవ సభా కార్యక్రమము పూరాధ్యాపక బ్రహ్మశ్రీ కొల్లూరి శ్రీరామమూర్తి అవధానులుగారి వేదపఠనముతో నారంభమైనది. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారి గీర్వాణ వాణీస్తవము శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారి ఆంధ్రవాణీస్తవము జరిగిన

వెనుక బ్రహ్మశ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు నుపన్యసించిరి. పరిషదధ్యక్షులు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు పరిషదధ్యక్ష ప్రవచనమును పద్యకావ్యముగా సంతరించి పఠించి, పరిషదభ్యున్నతిని వక్కాణించినారు. కార్యదర్శి నివేదికలో సాహిత్యపరిషత్తు ప్రస్తుతము నిర్వహించుచున్న పనులు, నిర్వహింపవలసిన కార్యములు నిరూపితములైనవి. పరిషద్వార్షిక సభాధ్యక్షపీఠమునుండి విద్యాశాఖామాత్యులు గౌ॥ శ్రీ పట్టాభి రామారావుగారు ఆంధ్రసాహిత్య పరిషత్తీవఱకు నిర్వహించిన కార్యముల నభినందించుచు, ఈ సంస్థ యిఁకమీఁద నెఱపవలసిన కార్యములను గూర్చి తమ యమూల్యమైన యాశయములను వెలువఱచినారు. తరువాత ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నీలం సంజీవరెడ్డిగారు తమ సభాప్రారంభోపన్యాసములో ఆంధ్రసాహిత్య పరిషత్తింతవఱకు జరిపిన భాషావిషయక కృషి నభినందించుచు, ఇట్టి సంస్థలు తమ తమ కర్తవ్యములను సక్రమముగ నిర్వహించుచు కృషి జరిగించిననాఁడే భాషకును తన్మూలముగ దేశమునకును అభ్యుదయము కలుగు ననియు, ఈ సంస్థ కొనసాగించు భాషాభ్యుదయ కార్యమునకు ప్రభుత్వము శక్యమైనంత తోడ్పాటు కలిగింప సంసిద్ధముగ నున్నదనియుఁ దెలిపినారు. పరిషత్కార్య నిర్వాహకవర్గము వారి కృతజ్ఞతాసమర్పణముతో నాసభ సమాప్తమైనది.

ఆనాఁటి మధ్యాహ్నసభ కధ్యక్షులుగా బ్రహ్మశ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు రావలసియుండిరి. వారు రాని కారణమునఁ శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు ఎమ్ ఎల్. ఏ గారు అధ్యక్షస్థానము నలంకరించి యాసభ నిర్వహించిరి. శ్రీ ఓలేటి సూర్యనారాయణ శాస్త్రిగారు, శ్రీ దామెర రాజగోపాలరావుగారు పద్యపఠనము గావించిరి. బ్రహ్మశ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రిగారు, శ్రీ చిలుకూరి

పాపయ్యశాస్త్రిగారు, శ్రీ దాసరి లక్ష్మణకవిగారు నుపన్యసించిరి. నాఁటి రాత్రి కలికిశోరదళము-మేడపాడునారు గుమ్మితకత, భగవద్గీత-మహా భారత యుద్ధము గానముచేసి వినిపించిరి.

10వ తేది ఉదయము బ్రహ్మశ్రీ ఆకొండి వెంకటశాస్త్రిగారు అధ్యక్షత వహించిరి. శ్రీ అనంతపంతుల రామలింగస్వామిగారు, శ్రీ విశ్వ నాథ నరసింహముగారు, తమ కావ్యములనుండి పద్యపఠనము గావించిరి. శ్రీ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు, శ్రీ వంతరం రామకృష్ణా రావుగారు, శ్రీ ఎరసూరి మల్లికార్జునశాస్త్రిగారు, శ్రీ మానాప్రగడ శేష శాయిగారు, రామకృష్ణ శ్రీనాథ సూరన పోతనల కవితావిషయము లను గూర్చి యుపన్యసించిరి నాఁటి మధ్యాహ్నము శ్రీ వడ్డాది సీతా రామాంజనేయ కవిగారు, అల్లమరాజు సోమకవిగారు, కాంభట్ల విశ్వ నాథ శాస్త్రిగారు పద్యపఠనము గావించిరి. శ్రీ చతుర్వేదుల సత్య నారాయణ శాస్త్రిగారు, శ్రీ కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు శ్రీ ఓలేటి సుబ్బారాయశాస్త్రిగారు, శ్రీ బండారు తమ్మయ్యగారు, శ్రీ నై. వెంకటరమణగారు నుపన్యాసములు గావించిరి.

రాత్రి శ్రీ వేదనభట్ల వేంకటరమణయ్య భాగవతార్ గారు హరి కథా కాలక్షేపము గావించిరి.

11వ తేది ఉదయము శ్రీ కంటి జోగిసోమయాజులుగారు అధ్య క్షత వహించిరి. శ్రీ మధునాపంతుల సూరయ్యశాస్త్రిగారు, శ్రీ ఓలేటి శ్రీరామచంద్రమూర్తిగారు, శ్రీ టి. భాస్కరరావుగారు పద్యపఠ నము గావించిరి. శ్రీ కేశిరాజు వేంకట నరసింహ అప్పారావుగారు శ్రీ శృంగారం కృష్ణమాచార్యులుగారు శ్రీ నరసింహ దేవరఉమా మహేశ్వరశాస్త్రిగారు శ్రీ యస్. టి. పి. రాఘవాచార్యులుగారు శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు నుపన్యాసములు గావించిరి. నాఁటి మధ్యాహ్నము శ్రీ కంటి జోగిసోమయాజులు గారి అధ్యక్షతను భువనవిజయసభ జరిగినది. శ్రీ మానాప్రగడ శేషశాయి

గారు అష్టదిగ్గజములను తిమ్మరుసును శ్రీకృష్ణదేవరాయలను సభా ప్రవేశము గావించుట కాహ్వానించు పద్యములు మధురముగాఁ జదివిరి. ఈ సభలోఁ బాల్గొనినవారు.

శ్రీకృష్ణదేవరాయలు—శ్రీరాజా సాగి సూర్యనారాయణరాజుగారు ఎమ్, ఎల్, ఏ.

తిమ్మరుసు—శ్రీ హోతా వెంకటరామశాస్త్రిగారు.

పెద్దన—శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

నంది తిమ్మన్న—శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు.

రామరాజభూషణుఁడు—శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు

రామకృష్ణుఁడు—శ్రీ ద్విభాషి. సోమనాథశాస్త్రిగారు

ధూర్జటి—శ్రీ ద్విభాష్యం వేంకటరావుగారు

రామభద్రుఁడు—శ్రీ ఫువ్వాడ శేషగిరిరావుగారు

పింగళి సూరన్న—శ్రీ వేదుల వెంకటరావుగారు

మాదయగారి మల్లన — శ్రీ పాలెపు వెంకటరత్నముగారు.

ఈ కవులందఱకు ప్రత్యేక సమస్య లీయఁబడినది. ఆసమస్యాపూరణ పద్యములు వినిపించిన తరువాత తత్తత్కవుల కావ్యములనుండి రసవత్తర ఘట్టములు చదివి వినిపించుట జరిగినది. ఈ సభలో పాల్గొనిన పండిత కవులందఱు: దమ తమ పాత్రనిర్వాహణమును ప్రేక్షక హృదయాకర్షకముగఁ గావించిరి. మధ్యాహ్నము నాలుగు గంటలకుఁ బ్రారంభమైన సభ రాత్రి 8 గంటలకు ముగిసినది. ఈ సభాసన్నివేశము భాషాభిమానుల హృదయము నెంతేని యాకర్షించినది.

నాఁటి రాత్రి యంగ్‌మెన్స్ హాపీక్లబ్ సభ్యులు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు రచించిన కంఠాభరణనాటకమును కడుద క్షతతోఁ బ్రదర్శించియున్నారు. ఈ నాటకమునఁ బాల్గొనిన పాత్రధారులందఱును వారి పాత్రలను సక్రమముగ నభినయించి, ప్రేక్షకులైన

పండిత పామరు లందఱయామోదమును జూఱగొనినారు. వ్యావహారికపదప్రయోగము లేకుండినను, సాంఘికనాటకమే యైనను సలక్షణ గ్రాంథికభాషాపదప్రయోగములతో ప్రేక్షకుల హృదయమునకు రక్తి కలిగించు ననువిషయమున కీప్రదర్శనమే నిదర్శనము. ఈ నాటకమునకు జీవభూతమైన సుబ్బిసెట్టిపాత్రను నిర్వహించుటలో శ్రీ గండికోట జోగినాథంగారు ప్రదర్శించినకౌశలము ప్రశంసనీయము.

12వ తేదిని శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు అధ్యక్షత నిర్వహించిరి. శ్రీ హోతా వెంకటరామశాస్త్రిగారు, శ్రీ బులుసు చినవెంకటేశ్వర్లుగారు, శ్రీ బళ్ల రామచంద్రరాజుగారు, పద్యపఠనము గావించిరి. శ్రీ బులుసు వెంకటేశ్వర్లుగారు, శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు, శ్రీ సామవేదము శ్రీరామమూర్తిగారు ఉపన్యాసములు గావించిరి. మధ్యాహ్నము శ్రీ అత్తిలి గోపాలకృష్ణమాచార్యులుగారు శ్రీ రేజేటి సీతారామస్వామిగారు, శ్రీ జ్ఞానానందకవిగారు తమ కృతులనుండి పద్యపఠనము గావించిరి. శ్రీ దివాకర్ల రామమూర్తిగారు శ్రీ చట్టి రామారావు పంతులుగారు శ్రీ ద్వివేది సత్యకవిగారు నుపన్యసించిరి. రాత్రి శ్రీమతి అన్నాబత్తుల వేంకటరత్నము-ముమ్మిడివరవాస్తవ్యురాలు నర్తకి గొల్లకలాపము వినిపించి పండితుల యాదరమునకుఁ బాత్రురాలయినది. 13వ తేది అయిదవనాఁడు ఉదయము పరిషదధ్యక్షుల యాధ్యక్ష్యమున స్త్రీలకు ప్రత్యేకసభ ప్రారంభమైనది. శ్రీమతి కల్లూరి విశాలాక్షమ్మగారు, శ్రీమతి వేముగంటి పాపాయమ్మగారు శ్రీమతి వారణాసి సుభద్రమ్మగారు, శ్రీమతి కుమారి పి. అనంతలక్ష్మిగారు శ్రీమతి కొల్లూరి సుభద్రమ్మగారు నుపన్యాసములు గావించిరి. సభానంతరమున నిఘంటు నిర్మాణమునఁ బాల్గొనినపండితులకు శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు 5, 6 సంపుటములబహూకారము జరిగినది. నాఁటి మధ్యాహ్నము పద్యరచనయందును ఉపన్యాసములొనఁగుటయందును పోటీలోఁ

బొల్గొనిన వారికి స్వర్ణ రజతపదకముల బహూకారము నొసఁగఁబడినది. పద్యరచనలో ప్రథములుగా వచ్చిన శ్రీ దువ్వూరి లక్ష్మీ నృసింహభాస్కరంగారికి స్వర్ణపదకమును, ఉపన్యాసము పోటీలలో ప్రథములుగా వచ్చిన శ్రీ విశ్వనాథనరసింహముగారికి చి॥ వి. వెంకటరామమూర్తికి స్వర్ణరజత పదకముల ప్రదానము జరిగినది. పిమ్మట సభినందనసమర్పణములతో మహోత్సవములు ముగిసినవి.

ఈ విధముగ పంచదివసములు రేయుంబవల్లు సారస్వతమహోత్సవములు విజయవంతరముగాఁ గొనసాగి ఆంధ్రసారస్వతాభిమానుల కుత్తేజనము గలిగించినవి. ఈ వార్షికసభానన్ని వేశకార్యక్రమములలోఁ బడియుండుటచే పరిషత్పత్రిక నం॥ ౪౫ సం. ౧-౨ లు వెలువడుట కాలస్యమైనది. ఇఁకమీఁద సంచికలను సకాలములో నందఁజేయఁగలమని ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికా పాఠకులకు మనవిచేసికొనుచున్నాము. ఆంధ్రసాహిత్యపరిషదార్థికస్థితి కార్యదర్శి నివేదికలోఁ దెలుపఁబడియేయున్నది. ప్రస్తుతము శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణమునఁ గొఱవడియున్న భాగము నెట్లయిన పూర్తిచేసి ఆంధ్ర పాఠకలోకమున కందిచ్చుట పరిషత్తునకు ప్రధానకర్తవ్యము. అది ముగిసిన పరిషత్తు ప్రధానాశయములలో నొకయాశయము పూర్తి యగును. ఆ వెనుక నాంధ్రభాషకు సజాతీయభాషలతోడి సంబంధము వైషమ్యమును దెలుపుచు సమగ్రమైన యొకవ్యాకరణము నిర్మించుటకీపరిషత్తు తప్పక యత్నము గావించును. ఆంధ్రభాషాభివృద్ధికి వలయు నవకాశములు గలిగించుటయే యీ పరిషత్తునకుఁ బ్రధానలక్ష్యము. దానికి ప్రభుత్వము ప్రజలు చేయూఁత యొసఁగినఁగాని ఆంధ్రభాషకు, తన్మూలమున దేశమునకు సమూల్యమైన సేవ జరుగనేరదు.

నలక్షణపదప్రయోగము చేసిన ప్రాచీనకవుల గ్రంథములందలి లక్ష్యములనాధారముగఁ గొని సజాతీయేతరభాషాపదసంబంధబాంధవము

లెక్కింగించుచు ఆంధ్రభాష కొక సమగ్రనిఘంటువు నిర్మించుట పరిషత్తు ప్రధానలక్ష్యముగా గ్రహించినది. ఇం దేమేని లోపము లుండిన, నట్టిహానిని సహృదయులయిన భాషామర్మజ్ఞులు సౌహార్దముతోఁ దెలిపిన స్వీకరించుటకు పరిషత్తు సర్వథా యున్ముఖమై యున్నదని మనవి చేయుచున్నాము.

ఇట్లు వినివేదించు

చిలుకూరి పాపయ్యశాస్త్రి

గౌరవ సంపాదకుఁడు

---

శ్రీ ర స్తు.

# ఆంధ్రసాహిత్య పరిషత్తు 48 వ వార్షికోత్సవము

## పరిషదధ్యక్షప్రవచనము

---

తే. ఆంధ్రసాహిత్యపరిషదాఖ్యాక మైన
దివ్యసంస్థ యియ్యది యాంధ్రదేశమును స
ముద్ధరించెడునట్టిదై యుద్భవించెఁ
బీఠికాపురరాజేంద్రు పేర్మివలన.

వ. శ్రీపీఠికాపురమహారాజా వేంకటకుమారమహీపతి సూర్యరాయల ధనసాహాయ్యము, దివాన్ శ్రీ మొక్కపాటి సుబ్బరాయమహీసురుని ప్రోత్సాహము, శ్రీజయంతి రామయ్యపంతులుగారి నిర్వాహకత్వముం గారణంబులుగా నీమహాసంస్థ సంభవించినది.

తే. ఇద్ది సామాన్యపుస్తకగృహము లట్టి
దనఁగ నొప్పదు పరిషదాఖ్యం దలిర్పఁ
బండితులు నిండియుండుటవలన నిరత
మఖిలవిద్యల కాస్థాన మగుచు నుండు.

శా. సాహిత్యంబున మేటులెల్లఁ బరిషత్స్థానంబున న్నిల్వనై
సౌహార్దంబున నెల్లశాస్త్రముల చర్చ ల్సేయు చాంధ్రంబునన్
బాహుళ్యంబున నైనసంశయములం బాపంగనై తన్మహా
మాహాత్మ్యంబు జగత్ప్రసిద్ధ మయి క్రమ్మం జేసె రా జర్మిలిన్.

ఉ. లక్షలు వెచ్చమున్ జలిపి లక్షణలక్షిత మౌనిఘంటువున్
రక్షితపండితేంద్రుఁ డయి రాజమహేంద్రుఁడు నిల్పి దానిఁ బ్రి
త్యక్షసరస్వతీప్రకృతి యన్ పరిషత్తున కిచ్చి ధన్యుఁడై
లక్షణలక్షితుం డగు చిలాతలమండితుఁడై తలిర్చెడున్.

తే. మఱియుఁ బరిషత్తునకు లోకమాన్యుఁ డగుచు
గొన్నివే లిచ్చి సూర్యరా వెన్న దాని
వలన నగువృద్ధిఁ దత్పరిపాలనంబు
చేసికొనుచుండునట్లుగాఁ జేసె నెలమి.

శా. దానంజేసి యటిట్టుగాఁగఁ బరిషత్కార్యంబు సాగింపనై
కానవ్వచ్చుచు నుండెఁ బార్థునిక్రుపం గల్గెన్ నదస్యాలయం
బానందం బగుఁ గాని చాలదు మహాన్నత్యంబు నంధింపఁగా
నీనాటం గలత్థామసంగతుల ని ట్లీక్షింపఁగా నొప్పెడున్.

మ. మును ము న్నల్లజయంతిరామకవి సంపూర్ణాధికారంబునన్
గొని సంస్థ నడిపించెఁ గొన్నినాఁపు లొక్కొండయ్యుఁ బెక్కుర్బలెన్
విని నే నొక్కరుమెడ ఘనుం డయినవానిం జేరి సాహిత్యసం
స్థ నిరాఘాటముగాఁగ లోకమున నాంధ్రీజ్యోతిగా నొప్పెడున్.

చ. తెలుఁగుల నిందుఁ జేసినది తీర్పయి పారలమెంటు నాఁగ నై
వెలసెడునట్లు చేయుఁ డని వేఁడితి వేయితెలుంగుల; న్వినం
గలిగెను గాని కార్య మది కానిద యయ్యె; ననంతరంబ నే
నలన్నృపశేఖరాజ్ఞమెయి నందితి నిట్లు నభాధిపత్యమున్.

ఆ. గుర్తికన్ను మూసికొనియున్న నే మది
తెలిచియున్న నేమి తెలియవచ్చు?
అట్లు నన్ను నంటు నయ్యాధిపత్యము
నేనొనర్చునట్టి దేమి యగునొ!

వ. అని చిత్తంబున హత్తియుండ బుద్ధిన్ నిలువరించియు.

మ. కరుణాసాగరుఁ డర్థికల్పకము లోకఖ్యాతదాతృత్వ నం
భరితాత్ముం డతిశాంతమూర్తి సుకృతస్వాంతుండు దాంతుండు భూ
సురవంశాగ్రణి రాజకీయకుశలశ్లోకుండు శ్రీ దంటు భా
స్కరరాయం డొకరుం డటం చెఱిఁగితిన్ స్వాంతంబు శాంతంబుగన్.

ద్విపద. అని వానియింటికి నాప్తులం గూడి
చని సర్వవృత్తాంతసరణి నెఱుంగఁ
జేసి పూపరిషత్తుఁ జేకొని నీవు
భాసురంబుగఁ జేయుభారంబు పూను
మోనుగుణాకర! యోభాస్కరాఖ్య!
మోనులెత్తును నీదుపుణ్యంబు యశము.

చ. అన విని భాస్కరుండు కరుణాకరచిత్తసమాత్తవృత్తియై
యను; నను నింతగాఁ బొగడ నక్కఱ యుండదు; దేవకార్య మా
ఘనతరసంస్థ; భారమును గైకొనఁజాలనివాఁడ, నైన మీా
రనునుడు లాలకింపఁ బెఱ లాడఁగ నోపనివాఁడ నైతిఁబో.

ఆ. నేను కార్యదర్శిగా నుండి మీాతోడు
నీడ యగుచు నుందు నాఁడునాఁడు
నముపఁ దగినవాని నదుపుచుఁ దదభివృ
ద్ధులకు మిపులయత్నముల నొనర్తు.

మంజరి. అని వచ్చి యానాఁడె యాంధ్రసాహిత్య
పరిషత్తునం గార్యవాహకసభకు
కార్యదర్శిపదంబు గైకొని దాని
వ్యవహార మంతయు వరుస నాలించి
సలుపంగ నగుకార్యసముదయ మెల్ల
వరుసగా సాధించి వార్షికసభకుఁ
దనసొమ్ము రెండువే ల్తక్కుగాకుండ
వ్యయము గావించి కార్యము నిర్వహించె
దంటు భాస్కరరాయధరణీసురుండు.

చ. అభినవభోజరా జనెడునాహ్వాయముం గొనె భాస్కరాఖ్యుఁ డా
శుభగుఁడు సత్కవీశ్వరుల శోభనపుంగళ కిచ్చుఁ గాని యే
విభవము లేనివారలకు వేఁడినయేని యొసంగబోవఁ డీ
ప్రభు వెపు డెట్టివానికిని వారక యిచ్చెడు నిచ్చ మచ్చనన్.

సీ. అలదధీచిం దాత యందురు హరి వచ్చి
యెమ్ముక వేఁడిన నింత డొంకె
శిబిచక్రవర్తినిఁ జేరి యెఱచి వేఁడ
జేగ కింతిడ డబుడిబ్బులాడె
దేవేంద్రుఁ డేతెంచి దేహి యన్నక శక్తి
గైకొని కవచంబు కర్ణుఁ డిచ్చె
మూఁడడుగులనేల వేఁడ నిచ్చెదనని
వటునకు బలి యిడ నటునిటు పడె

గీ. ఎంతలెంతల దాతృత్వ మిట్టులుండె
సత్య మాడెద దంటుభాస్కరుఁడు వేఁడు
గాని యేవేళఁ గాని యేదేని గాని
యడిగినంతనె యిచ్చు లే దనఁగఁ బోఁడు.

చ. సుగుణములెల్లఁ బ్రోగువడి చూపఱకున్నదు లుల్లసిల్ల నీ
జగమున భాస్కరుం డనఁగ జన్మము నొందెనొ లేక తల్లి దా
సుగుణము లుగ్గునం గలిపి సొంపుగఁ బోసెనొ ప్రాజ్ఞులోనఁ గా
కగణితసద్గుణంబు లిటు లారయ నాతని కేల కల్గెడిన్.

వ. అమ్మహాపురుషుండు.

తే. ఆంధ్రసాహిత్యపరిషత్తునందుఁ గలుగు
భక్తిపెంపున నా దంటుభాస్కరుండు
వార్షికోత్సవము వికారవంత మైన
దాని నవికారముగఁ జేయుమానసమున.

మ. వసుధం గల్గినపండితోత్తముల నాహ్వానంబు గావించి యొం
చి సదస్యుల్ వివిధప్రసంగములు శాస్త్రీయంబులం జేయుచున్
మిసిమిం గల్గఁ బొనర్చు చేనుదినముల్ మేల్గల్గ సంధించి యాం
ధ్రసభన్ సభ్యపదంబునం గొని తలిర్పం జేసె నాతం డహో!

ఉ. పండితమండలిం బిలువఁబంచుఁ టొకానొక యెత్తు మంత్రిమా
త్రాండులఁ బిల్చి తెచ్చి సభఁ గ్రాలఁగఁ జేయు టొకెత్తుగా నిటన్
దండితనంబు చూపెనిని దంటుకలీసుని భాస్కరాఖ్యునిన్
నిండుమనంబునం బొగడ నేర్తురె నేర్పరులైనవారునున్.

చ. క్షితిపయి నామమాత్రమున శేషముగా నయియుండె నాంధ్రసా
హితిపరిషత్తు దాని బ్రిదు కెంచుచు నీలముఁ దెచ్చి కట్టె దం
టతనము లేర్పడన్ ఘనుఁ డిటం బచరించెడు కార్యదర్శి మేల్
రతనములందు నీలము వరం బిడఁజాలినదం చెఱుంగుటల్.

క. నీలము మణిగణమందున్
గ్రాలున్ సంజీవి యొకఁడు రాడ్రత్నంబై
పోలించి తెచ్చి పరిష
ద్వాలిక బ్రదికింపఁజేసె భాస్కరుఁ డెన్నన్.

మ. సముదాచారము శాంతచిత్తము దురాశాశూన్యభావంబు బు
ద్ధి మహత్త్వప్రతిపాదితాంధ్ర ధరణీదేశంబునం గల్గి నీ
లము సంజీవిసుహాశయుందు విలసల్లక్ష్మీకటాక్షాంచిత
క్రియుఁడై మంత్రివరేణ్యుఁడై ప్రజల సంరక్షించు నెల్లప్పుడున్.

ఉ. నీలవరప్రభావమున నే యభిరాముఁడు పట్టభద్రుఁడై
క్రాలుచు నెల్లవిద్యలను గావఁగఁ బ్రోవఁగ నైనమంత్రియై
మేలు ఘటిల్లఁ జేయఁగల మేటియు మేయరునైన పూరుషుం
డీలలి మాకుఁగూర్చుటకు నేర్పడు నెంతయు భాగధేయముల్.

కం. మాపరిష త్తాంధ్రముఁ దగ
రూ పంది తలిర్చునట్లు ప్రోది యొనర్పన్
భూపాలున కెఱిఁగించెద
హోపురుషవరేణ్యా! చేయు మువకృతి మాకున్.

కం. గ్రామ్యాభిమాన మెప్పుడు
సౌమ్యము గాఁబోదు వారి సంపర్కంబున్
రమ్యము గా దని పలికెద
మాన్యముగ్రాంథికము వెలుఁగుమార్గమునందున్.

ఆ. ఓనమాలు రానియుద్ధతు లద్దానిఁ
బ్రేముడించుచుండ్రు భే షటంచు
మాతృభాష కి ట్లమర్యాద గూర్చుట
మనకుఁ దగునటయ్య మంత్రివర్య!

శా. విద్యామంత్రులు వీర్యవంతు లగుచు న్విఖ్యాతినిం గోరుచున్
విద్యాకల్పములం దనుత్తమములై వెల్గొందు నవ్వానికిన్
హృద్యచ్ఛిత్తముచేసి తత్కృతులకు న్వ్రేలిచ్చియు న్మెచ్చియున్
సద్యస్కాలఫలంబు నొందుటకునై సాగింత్రు కార్యంబులన్.

ఉ. నన్నయభట్టుకాలమున నాల్గుకెలంకుల నాల్గురీతులై
యున్న తెలుంగుబాస నొకయొద్దున నిల్పఁగ నెంచి శాసనం
బున్నిలకొల్పి దాని కనుభోగముగా రచియించె భారతం
బన్నయశాలిమార్గము సహా తెగతెంపులు సేయ నర్హమే?

మత్త. ఆదిభాషకు నెట్టినేమక మట్లె భాషలకెల్ల నాఁ
డాదిగా నగు నేమకం బది యూనటంచును సత్కవుల్
వాదు లాడ కసత్కవిత్వమువంకఁ బోవుచు నున్నవా
రీదినంబులఁ బుట్టె దుర్గతు లిట్లు గ్రామ్యముఖంబులై.

శా. హిందీ పారసి యింగిలీషు నరవం బిత్యాది భాషాచయం
బందుఁ గ్రామ్యము వ్యావహారికము నా నాఖ్యాకముల్ శబ్దముల్
పొందింపం గనియుంటి మే పృభువ! మాపూర్వార్థ్యముఁ మీరటి యీ
చందం బాంధ్రమునందు సంకరగతుల్ సంధింపఁగా న్యాయమే?

తరళ. తెలుఁగుజాతికిఁ దెల్లుమాటలు దెల్లగా దెలియంగ నా
దెలిసికోఁ బనిలేదు శాస్త్రము దిద్దినట్లు కవిత్వముల్
సులభరీతి నొనర్పవచ్చును సూనృతంబులు వల్కుచుఁ
గలుగఁబో దిటువంటికష్టము గాన గ్రామ్యమె రమ్యమా.

తే. అనుచు "నో తెల్లి యెల్లకే" యనుచు నుడుల
నల్లిబిల్లిగఁ జేసిన బొల్లికవుల
బూతుకూతల నిటు పాఠ్యపుస్తకములు
చేయఁ దలపోయకయ్య విద్యాయితాత్మ!

మత్త. కల్లబొల్లికవిత్వ మల్లగఁగల్గి కబ్బ మటంచు నీ
కాళ్ళపైఁ బడవేయ నీ వదికాదు నాక బళీ యటం
చెల్లవేళల మెచ్చి వేల్ధన మిచ్చుచుండె నెకాడమీ
చెల్ల దియ్యది యంచుఁ జెప్పట చెడ్డగా దని యెంచుదుఁ.

తే. మంత్రివరులార! ఘనులార! మాన్యులార!
వినుఁడు మాయాంధ్రపరిషత్తు విద్వదగ్ర
సరులతోఁ గూడియున్నది చాలి దాని
నుడులబడి మీయెకాడమీ నడువనొప్పు.

చ. తెలుఁగుల మీ రొసర్చెడు కృతిప్రముఖాదులు మాయెకాడమిఁ
గలిగినపండితోత్తరులు గాంచి వచించినమీద వానికిఁ
విలువగలట్టివై తనరి వెల్గెడునట్లు పొనర్ప శాసనం
బులు పొనరింపఁ జేయుటకు బూనుద మీరును మేము మీఁదటఁ.

శా. ఏదో పుస్తక మెవ్వరో తెలిసి కా దెట్లెట్లొ తెల్గించి వి
ద్యాదైవం బని తెల్పుచున్ దమకు జోహార్సేయ నద్దానికిన్
రైదుల్ వేలు బహూకృతుల్ సలుపుటల్ హాస్యాస్పదం బౌనటుల్
కాదంచు స్వచియింప నొప్పునని వ్యాఖ్యానంబు గావించెదన్.

ఉ. ఈపరిషత్తు పుట్టినపుడే యిది భాషకుఁ బార్లమెంటుగా
నై పరిపూర్ణతం గొనెదునట్లు పౌసర్వ జయంతిరామయ
శ్రీపదుతోడఁ జెప్పితిని; చెప్పిన లాభము లేని దయ్యె నో
భూపతులార! మీ రిపుడు పూర్ణకృపం గనుఁ డంచుఁ గోరుదున్.

స్వస్తి సమస్తమంగళాని భవంతు.

కాకినాడ,
9-6-'59.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ఆస్థానకవి



రిపబ్లిక్ పవర్ ప్రింటింగ్ వర్క్సు, కాకినాడ, 1959.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

## కార్యదర్శి నివేదిక.

### దంటు భాస్కరరావు, బి. ఏ.,

---

ఆంధ్రి సాహిత్య పరిషత్తు 1911 వ. సంవత్సరము మే నెల 12 వ. తేదిని చెన్నపురమునందు ప్రతిష్ఠింపబడినది. ఈ నాటి కీపరిషత్తునకు, 48 యేండ్లు నిండినది. శ్రీ జయంతి రామయ్య పంతులు గారు, శ్రీ శ్రీ శ్రీ పీఠికా పురాధీశ్వరులు, చెన్నపురి యందలి పెద్దలతో నాలోచించి, ఆంధ్రి భాషోద్ధరణకై మనము తగిన పని చేయవలయునని, ఒక మహాసభ కావించిరి. అందు శ్రీ కందుకూరి వారు, వేదమువారు, వావిలికొలనువారు, కొమరాజువారు, వేపా వారు, మరికొందరు జమీందారులు, మహారాజులు, మున్నగువారు పాల్గొనిరి. శ్రీ పిఠాపురము మహారాజావారు, దానికగ్రాసనాధిపత్యము వహించిరి.

ఆంధ్రిభాషకొక సమగ్రనిఘంటువు నిర్మించుట దానిలోని ముఖ్య తీర్మానము. దాని వ్యయమంతయు, తామే భరించుటకు శ్రీ రాజావారిప్రతిజ్ఞ. నాటినుండి నేటివరకు క్రమముగా, పరిష త్తాంధ్రిదేశము నందలి కవిపండిత విమర్శకా మోదమును బడయుచు, పీఠికాపురాధీశ్వరుల యాదరాభిమానములతో దినదినాభివృద్ధి నొందుచున్నది.

1935 వ. సంవత్సరమున నీపరిషత్తునకు, శ్రీ జయపురాధీశ్వరుల అధ్యక్షతను, రజతోత్సవము కాకినాడలో జరిగినది. 1946 వ. సంవత్సరమున శ్రీ ప్రిభల సుందరరామయ్యగారి ధర్మపత్నియు, శ్రీ జయంతి రామయ్యపంతులుగారి సోదరియునగు, వెంకటసుబ్బమ్మ గారు గొప్ప విరాళమునొసంగి తమ భర్తగారి పేర, పరిషత్తునకీభవనము నిర్మించియిచ్చిరి. వారి పేరిటనే యీభవనము, "ప్రిభల సుందర రామ భవనము" అని పేర్కొనబడుచున్నది. దీనితో పరిషత్తునకు ఒక శాశ్వతత్వమేర్పడినది. మరియు నీమహాసతి తన మరణ శాసన మందు, ఈభవనము మీాది భాగమున, తన పేరిట నొక అంతరువు నిర్మించుటకు రు 6,000/- లిచ్చుట కేర్పాటు కావించిరి. కోర్టు ద్వారా మరణ శాసన మమలుజరుపుటకు మా కార్యదర్శులకు అధికారమురాగానే ఆధనము పరిషత్తునకురాబట్టి, శ్రీ వెంకట సుబ్బమ్మ గారి యాశయము సిద్ధించునట్లు చేయగలము.

ఈ భవననిర్మాణము పూర్తియగుటకు కొంతధనము అప్పు చేయవలసి వచ్చినది. ఆ సందర్భమున శ్రీ మాంధాత వెంకటరావు గారివద్ద రు 3,000/- లు అప్పుతెచ్చిరి. ఈ అప్పు 1953 సంవత్సరములో మార్చి నెల చివఱకు తీర్చివేయుటయైనది. ఇదిగాక శ్రీ ప్రతివాది భయంకరం పార్థసారథిగారు, భవననిర్మాణమునకై పెట్టుబడిపెట్టిన సొమ్ము వడ్డీతో సహా రు 4,606-5-4 లు పరిషత్తునకు ఋణముగా మిగిలినది. తరువాత 30-1-1954 సం॥న జరిగిన, వార్షిక మహాసభలో పరిషత్కార్య నిర్వాహకవర్గ సమక్షమునను, అధ్యక్షుల సమక్షమునను, శ్రీ పార్థసారథిగారు తమ మాతృదేవతయగు, శ్రీమతి లక్ష్మమ్మగారిపేర, పరిషత్తువలన తమకు రావలసిన బాకీమొత్తము

రు 4606-5-4 లు పరిషత్తునకు విరాళముగా నొసంగితినని వారు ప్రకటించుటచే పరిషత్తున కీఋణవిముక్తికూడ జరిగినది. శ్రీ పార్థ సారధిగారి ఔదార్యమునకు ఆనాటి మహాసభ మహదానందము చూపినట్లు నాటికార్యదర్శి నివేదికలో ప్రచురించియున్నారు. ఈ విష యమునుగూర్చి శ్రీ పార్థసారధిగారిని ప్రశంసించుచు 23-3-1958 వ. సం॥రం పరిషత్కార్య నిర్వాహకవర్గమువారు ఆమోదించుచు తీర్మా నించుటయైనది.

ప్రస్తుతము పరిషత్కార్యములన్నియు, వెనుకటివలెనే చురు కుగాజరుగుచున్నవి. పరిషత్పత్రిక 2 నెలలకొకసారి వెలువడుచున్నది.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువునుగూర్చి లోగడ పార్థసారధి గారుచేసిన ప్రయత్నమున కనుబంధముగా కొంతకృషిచేసి శ్రీ గిడుగు సీతాపతిరావుగారియొద్దనుండి నిఘంటువు 5-6 సంపుటముల తాలూకు ముద్రించిన ఫారములన్నియు, చెన్నపురమునుండి పరిషత్తునకు తేబడినవి.

శ్రీ సీతాపతిరావుగారు, రాష్ట్రప్రభుత్వము, కేంద్రప్రభుత్వముల నుండి నిఘంటు పూర్తి ముద్రణమునకై రు 13 వేల రూపాయిలు గ్రాంటుగా సంపాదించి బహుశ్రమతో తత్కార్యములను నెఱవేర్చిరి. ఆంధ్ర సాహిత్య పరిషదాదాయమునుండి గూడ రు 3,250/- లు శ్రీ పార్థసారధిగారి ద్వారా సీతాపతిగారి కందఁజేయఁబడినవి. 7 వ. సంపుట ముద్రణము 40 ఫారములవఱకే యైనది. మిగిలినదాని ముద్ర ణము గూడ శ్రీ శ్రీ సీతాపతిరావుగారు పూర్తిచేయుటకు దగిన శ్రద్ధ

చూపుచు, తత్ప్రయత్నము లొనరించుచున్నారు. అచిరకాలములో నిదికూడ పూర్తికాగలదు.

ఈ పరిషద్గ్రంథాలయమున 7000 సంస్కృతాంధ్ర గ్రంథములున్నవి. సుమారు 6000 తాళపత్రగ్రంథములున్నవి. ఇం దముద్రితములు 500 గ్రంథములు. చరిత్రగ్రంథములు, సాహిత్య విషయముల పరిశోధన కమూల్యమైన శాసనములున్నవి. ఇవిగాక ఈనడుమ శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు, తమ యొద్దనున్న పుస్తక సంచయమునంతయు పరిషత్తున కొసంగియున్నారు. అట్లే శ్రీ వార్తకవి నారాయణరావు గారు గూడ మఱికొన్ని గ్రంథములు సమర్పించిరి. శ్రీ పులవర్తి పాపయ్యశాస్త్రిగారి తాలూకు 48 తాటాకు గ్రంథములు మా సహాయ కార్యదర్శిగారు సంపాదించి పరిషత్తున కిచ్చిరి. వీరికి మా ధన్యవాదములు. ఇంతవఱకు పరిషత్పత్రికా మూలమున ముద్రించిన ప్రాచీన గ్రంథములు డెబ్బదికి మించియున్నవి. ఏటేట నవ్యకవుల రచనలు తఱచుగనే రెవ్యూకొఱకు వచ్చుచున్నవి. ఇవిగాక ప్రాతక్రొత్తల పత్రికా సంపుటములు, ముద్రిత పరిషద్గ్రంథములు, నూతన నిఘంటు సంపుటములును భద్రముగా దాచి యుంచుటకు పరిషత్తునకు అధమము పది, పన్నెండు బీరువాలు కావలసియున్నవి.

ఆంధ్ర ధాతుమాల, ఉషాపరిణయము, కవిజనాశ్రయము, జైమినిభారతము, నరసింహ పురాణము, సూత్రాంధ్ర వ్యాకరణము, రసాభరణము, లక్షణ సారసంగ్రహము, లౌకికన్యాయ వివరణము, శతక సముచ్చయము మున్నగు గ్రంథరాజములు పునర్ముద్రితములు కావలసియున్నది. ఇవిగాక ఈ గడచిన వత్సర ముత్తమాధునిక, కవుల

అన్యోక్తి ముక్తావళి, మహాశ్వేత, హిందూదేశ శిల్పచిత్రములు, మున్నగు గ్రంథములను పరిషత్తు ముద్రింపగలిగినది. "చారుచంద్రోదయము" అను చెన్నమరాజు శేషయార్య కవికృత కావ్యము, ప్రచురింపవలసియున్నది. దాని తాళపత్రప్రతి తగిన పండితుల కొసంగి వ్రాయింపనలెను.

లోగడ పరిషత్కార్యనిర్వహణమునకై నెల 1కి రు 60/- ల వేతనముపై నొక మేనేజరును భాండాగార సహాయమునకై, యిరువురు బంట్రౌతులును నుండెడివారు. ధనాభావముచే నీస్థానములన్నియు ప్రస్తుతము నిలుపుచేయవలసివచ్చినది. ఏతత్కార్యకలాపమంతయు చిరకాలమునుండి గుమాస్తాగా పనిచేయుచున్న కూనపులి వేంకటరమణయ్యగారే నిర్వహించుచున్నారు. ఈయేడు శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు (తణుకు) పరిషత్తునకు యావజ్జీవ సభ్యత్వపు చందాగా రూ 116 లొసంగిరి.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు 5-6 సంపుటముల నిర్మాణ కార్యక్రమమందు పాల్గొనిన పండితులకు పూర్వ సంప్రదాయానుసారము ఆ సంపుటములను మాత్రమే వారి వారికి బహూకరింపఁదలఁచి యా కార్యక్రమ మీా వార్షికోత్సవములతో జతపఱచితిమి. పై కార్యకలాపముల నిర్వహించుటకును, గ్రంథప్రచురణకును పరిషత్తునకు ధనమవసరము. మూలధనపు వడ్డీలతోడను, గ్రంథ విక్రయమువలనను, పత్రిక చందాలవల్లను, ఈ పనులు సాగునవికావు. రాజపోషణము లీనాడు లేవుగదా. ప్రజాదరణము, ప్రభుత్వాదరణమును ముఖ్యముగా దీనికెంతేని కావలసియున్నది.

మఱియు పోయినవి పోఁగా భాండాగారముననున్న పుస్తకములు కలగాపులగముగానున్నవి. అట్టి గ్రంధములను వేనికి వానిని విడదీసి క్రొత్తపట్టిక తయారుచేసి యిచ్చుటలో ఒక యేడాది పైగానుండి అయాచితముగా, బహు శ్రమపడుచున్న శ్రీ వెదురుమూడి వేంకటరామమూర్తి, బులుసు వేంకటసూర్యకుమారు అను బి. కాం. విద్యార్థుల శ్రద్ధాభక్తులను పరిషత్తు గమనించినది. వారిని 'చిరంజీవ' అని ఆశీర్వదించుచున్నది.

యావదాంధ్రులు నిట్టి సంస్థపై శ్రద్ధ చూపించుటయేగాక, ముఖ్యముగా కాకినాడలోని శ్రీమంతులు, డాక్టరులు, న్యాయవాదులు, వర్తకశిఖామణులు, కవులు, పండితులు, ఇటువంటి సంస్థ కార్థికముగా తోడ్పడవలసియున్నది.

1953-54 సం॥లో సాటి హైదరాబాదురాష్ట్రము ఆంధ్రసారస్వత పరిషత్తుయొక్క సర్వతోముఖాభివృద్ధికి 33 వేల రూప్యముల ధన మొసంగియుండుట పత్రికాముఖమున వినియున్నాము. ఉమ్మడి రాష్ట్రములో క్రొత్తగ నెలకొల్పఁబడిన సారస్వత పరిషత్తునకు ప్రభుత్వమింత యవలంబన మొసఁగగా, ఆంధ్రభాషను పోషించుకొనుటకై ప్రత్యేక రాష్ట్రమును బడసిన మన ప్రభుత్వము రమారమి అర్ధశతాబ్దమునుండి నిరంతర భాషాసేవ చేయుచున్న యీ పరిషత్తు నెంతయేని యభిమానించవలసియున్నది. ఈ విషయము మన ప్రభుత్వ ప్రధానులు ఇతోధికమైన ఔదార్య దృష్టితో పరిగణింతురుగాక.

ఈ పరిషదాశయములలో నేటికింకను బూర్తిగావలసినవి కొన్ని గలవు. అందు ప్రధానములైనవి.

1. తెలుగుభాషకు సజాతీయేతర భాషలతోగల సాదృశ్యమును సాకల్యముగా నిరూపించుచు నొక సమగ్రాంధ్ర వ్యాకరణము ప్రచురించుట.

2. పరిషత్తునందున్న ముప్పది భారతతాళ పత్రప్రతులతో ముద్రిత భారతమును పోల్చిచూచి పాఠభేదములు సేకరించి ప్రచురించుట. ఈపని కొంతవఱకేమైనది.

3. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువున నుదాహరణ పద్యములను దొలగించి పదపదార్థ భాషాభాగవివేచనా మాత్రముగా కుదించి ముద్రించి ప్రకటించుట.

4. పారిభాషిక కోశమొండు సిద్ధపరచుట.

5. ఆంధ్రదేశ చరిత్రమును ఆంధ్రవాఙ్మయ చరిత్రమును నిర్దుష్టముగ రచించి ప్రచురించుట.

6. కనీసము సం॥ 1కి ఆరు అముద్రిత గ్రంథములనైనను ప్రచురించు టవసరము.

ఈ పరిషత్తునకు సం 1కి రు 10,000 వేలరూపాయలు గ్రాంటు శ్రీ ప్రభుత్వమిచ్చుచున్నచో పైపనులన్నియు సాకల్యముగ

నిర్వహింప బడగలవని మనవిచేయుచున్నాను. విశ్వవిద్యాలయములస్థాయిలో పరిశోధన సాగించుటకు ఈపరిషత్తు ఆంధ్ర ప్రదేశమునందలి ప్రధాన కేంద్రములలో నొకటిగా పనిచేయ వలసియున్నది.

ఆంధ్ర దేశమునందలి విద్వాంసులు, భాషాపోషకులు, శ్రీమంతులునూ, ఆంధ్రకవిపండితులును, పరిషత్సభ్యులై మాకు తోడ్పడవలెనని కోరుచున్నాము. పరిషత్కార్య నిర్వాహక వర్గమువారికి, నితరభాషాభిమానులకునుదయతో నీసభల కధ్యక్షతల నంగీకరించి వచ్చిన పెద్దలకును మాయాహ్వానములను, మన్నించి యుత్సవములకు వేంచేసిన మహాపండిత కవివరుల కును మాకృతజ్ఞతాపూర్వక వందనములర్పించుచున్నాను.

---

వర్ధిణీ ప్రింటింగువర్క్సు, కాకినాడ.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు—కాకినాడ

### 48 వ వార్షికోత్సవము

## సభాధ్యక్షోపన్యాసము

**విద్యాశాఖామాత్యులు, గౌ॥ శ్రీ. ఎస్.బి.పి. పట్టాభిరామారావుగారు.**

ఆంధ్ర సాహిత్య పరిషత్తు 48 వ వార్షికోత్సవములందు తొలి నాటి సమావేశ సమయమున సభాధ్యక్షపదము నాకు ప్రసాదించి నన్ను గౌరవించినందులకు పరిషత్కార్య నిర్వాహకులకు కృతజ్ఞతా పూర్వక వందనములు సమర్పించుచున్నాను.

నేనీ యధ్యక్షపదవికి అర్హుడను కాను. సంస్కృతమునందుగాని ఆంధ్రమునందుగాని పండితుడను కాను. అది గాక, ఈ ఆంధ్ర సాహిత్య పరిషత్తు 1911లో శ్రీ పిఠాపురము, బొబ్బిలి, వెంకటగిరి సంస్థానములకు ప్రభువులును విద్యాపోషకులును విద్యాభిమానులును అయిన మహనీయుల ఆర్థిక సాహాయ్యముతో ఉద్భవించినది; శ్రీ జయంతి రామయ్యపంతులుగారు, కందుకూరి వీరేశలింగముపంతులుగారు వేదము వెంకటరాయశాస్త్రిగారు మొదలయిన ఆంధ్రసాహిత్యవేత్తల సహాకారముతో రూపొందినది.

నాడు మొదలు నేటి వరకును ఈ అధ్యక్షపీఠము నలంకరించిన వారు శ్రీ కిళాంబి రామానుజాచార్యులు, వేదము వెంకటరాయశాస్త్రి గారు, వడ్డాది సుబ్బారాయడుగారు, తాతా సుబ్బారాయడుశాస్త్రి గారు మొదలయిన వారు గొప్ప పండితులు, కవీశ్వరులు అని ప్రఖ్యాతి నొందినవారు. వారి ముందు నే నేమాత్రుడను. అంతే కాక ఈ యాంధ్రసాహిత్య పరిషత్తు పుట్టిన నాటికి నేను పుట్టనే లేదు. అది ఉదయించిన మరి ఆరు మాసములకు గాబోలు నేను జన్మించితిని.

అందువలనను, నా విద్యార్థి దశలోగాని ఆ పిమ్మటగాని నాకీ ఆంధ్ర సాహిత్య పరిషత్తుతో పరిచయమంతగా లేకపోవుటవలనను, ఈ పరిషత్తువారు ఏ యే ప్రయోజనములను సాధించుటకు సంకల్పించినారో తాము పూనుకొన్న కార్యములను ఎంతవరకు నెరవేర్చినారో పరిషత్పత్రికలో ప్రకటితములయిన వివరణములను బట్టి నేను తెలిసికొనవలసినదే కాని, ఇక్కడనున్న పెద్దలవలె స్వయముగా ఎరిగినవాడను కాను.

ఈ పరిషత్ ప్రతిష్ఠాపకులు శ్రీ పిఠాపురము వెంకటగిరి మహారాజులు. వారిలో పిఠాపురము మహారాజావారయిన శ్రీ రావు వెంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారు పరిషద్యావజ్జీవాధ్యక్షులు. వీరు మొదటనుండి ఈ సంస్థకు పట్టుకొమ్మగా ఉండుటచేతను, సంస్థను స్థాపించినప్పుడే కాక దాని అభివృద్ధికి కావలసినప్పుడెల్లను తగినంత ఆర్థిక సాహాయ్యము చేయుచుండిరని తెలిసికొంటిని. అంతేకాక ఈ పరిషత్తు నిర్వహించుటకు పూనుకొన్న ఘనకార్యములతో "తెలుగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగు వానిని నిరూపించుచు లక్ష్యసహితముగా నర్థమును వివరించు సర్వాంకషమగు నిఘంటు వొకటి ప్రచురించుట"యనునది మొదటిదిగా సూచింపబడినది. అది వాస్తవముగా ముఖ్యమయిన కార్యమే. ఈ నిఘంటు నిర్మాణమునకు కావలసినకర్చులు భరించి నిఘంటు నిర్మాణ కార్యాలయమును స్థాపించిన వదాన్యులు శ్రీ పిఠాపురము మహారాజావారే అని యెరుగుదును. ఈ కార్యాలయము స్థాపించిన పాతిక సంవత్సరములకు గాని మొదటి సంపుటము వెలువడలేదు. 1938 లో కాబోలు వెల్వడినది. ఈ నిఘంటువుపని పెక్కుమంది పండితులు పెక్కేండ్లు శ్రమపడినగాని నెరవేరగలది కాదని నేనూహించుకోగలను. అయినను ఈ యాలస్యము మహారాజా వారికిని, నిఘంటువు కోసము ఎదురు చూచుచుండిన వారికిని విసుగు పుట్టించినదని యంటిని. ఆ తర్వాత

ఒకటి వెనుక నొకటి 1946 వరకు కాబోలును మరి మూడు సంపుట
ములు ప్రకటితములయినవి. ఆ పిమ్మటనైనను పని చురుకుగా జరుగు
చుండుట లేదని మహారాజావారు నాతో ప్రసంగించుచుండినప్పుడు
తెలియజేయుచుండిరి. తుదకు విసుగుజెంది మరి మూడు సంవత్సరము
లకు మహారాజావారు నిఘంటు కార్యాలయమును ఎత్తివేసి తక్కిన
సంపుటముల వ్రాత ప్రతి నంతటిని చెన్నపట్టణము తరలించి అక్కడను
ఆ మిగిలిన సంపుటములను ముద్రించుటకు సంకల్పించిరి. ఈ ముద్రణ
కార్యభారము శ్రీ గిడుగు సీతాపతిగారికి అప్పగించిరి. వారీపని
1952లో కాబోలు ప్రారంభించి 1955 వరకు కొంత సాగించిరి. ఇంతలో
కాలవైపరీత్యము వలన మహారాజావారికి ఆర్థికలోపము సంభవించుట
వలన ముద్రణము పని ఆగిపోయినది. ఆగిపోయిన పని మరల సాగించు
టకు ఎప్పటికైనను తమ ఆర్థిక పరిస్థితి చక్కబడునని మహారాజావారు
ఆశించిరి గాని చక్కబడుటకు మారుగా మరింత దౌర్భాగ్యదశకు వచ్చి
నది. అప్పుడు మహారాజావారి అనుమతిపొంది ఆంధ్రప్రదేశ్ ప్రభు
త్వము వారి ఆర్థిక సాహాయ్యము కోసము యూనియన్ ప్రభుత్వము
వారి ఆర్థికసాహాయ్యము కోసము సీతాపతిగారు ఎంతగా శ్రమించిరో
నే నెరుగుదును. ఆయార్థిక సాహాయ్యము కలిగించుటలో నేనును కొంత
వరకు తోడుపడినవాడనే కనుక ఈ విషయము నాకు తెలియును. ఈ
విషయములన్నియు మీకును తెలిసినవే అయినను నేనిప్పుడు వివరించు
టకు కారణము లేకపోలేదు. పరిషత్తువారును, నిఘంటు కార్యాలయ
మందలి పండితులును ఈ పని సాధ్యమయినంతవరకు వడి వడిగా
సాగించి యుండినయెడల ఈ దురవస్థ కలుగకపోను. పది పండ్రెండు
సంవత్సరముల క్రిందటనే ఈ నిఘంటు సంపుటములు ఏడును ప్రకటితము
లయి యుండియుండును. ఇక ముందు జరుగవలసిన కార్యములయినను
వడి వడిగా సకాలములో పూర్తి చేయునట్లు పరిషత్తువారు ప్రయత్నిం

తురు గాక అని విన్నవించుచున్నాను.

ఈ నిఘంటు విషయములో మరియొక సంగతి మనవిచేయుటకు సాహసించుచున్నాను. ఈ నిఘంటువులో కేవలము ఆంధ్రసాహిత్యమందలి ప్రామాణిక కావ్యములలోని పదములు మాత్రమే కలవనియు, ఆధునిక సాహిత్యమందు నూతనముగా పుట్టిన పదములు లేవనియు వింటిని. అంతేకాక గ్రాంథ్యములో నున్నట్లు ఇతర భాషలనుండి తెలుగు భాషలోనికి ఆవశ్యకముగా వచ్చిన పదములు ఉండవని కూడా వింటిని. నేను విన్న విషయములు సత్యములే అయిన యెడల మీ నిఘంటువునకు అనుబంధముగానైనను ఈ పదములకు తావొసంగుట మంచిదని నా యభిప్రాయము. ప్రస్తుత పరిస్థితులలో ఆ పదములు లేని యెడల మీ నిఘంటువు కేవలము పూర్వకాలపు కావ్యములను చదువుకొనువారికే కాని ఈ కాలపు కావ్యములను గాని తక్కిన రచనలను గాని చదువుకొనువారికి ఉపకరింపవు.

అంతేగాక, మీ పరిషత్ప్రయోజనముల వివరణమందు మీరు నెరవేర్పదలచిన కార్యము మరియొకటి కలదు. "ఆధునిక శాస్త్రగ్రంథ రచనయందుఁ బ్రయోగించుటకై పారిభాషిక పదములను నిర్ణయించి వివరించు నొక శబ్దకోశము సిద్ధము చేయుట" ఇది చాల ముఖ్యమగు పని. మాతృభాష ద్వారా విద్యాలయములలో విద్యార్థులకు దేశ చరిత్ర, సాంఘిక విషయములు, సంస్కృతి విషయములు, భూగోళ విషయములు, కళలు మొదలయినవే కాక పదార్థ విజ్ఞాన శాస్త్రము, రసాయన శాస్త్రము మొదలయిన శాస్త్రము లన్నియును నేర్పవలసియున్నది. అందుకు తగిన గ్రంథములు వెల్వడవలసియున్నది. అందుకు పారిభాషిక పదకోశము సాధ్యమైనంత వేగముగా సిద్ధము కావలెను గదా ?

"సర్వ విషయములను గూర్చి చేయదగు గ్రంథరచనకుఁ

(ప్రోత్సాహ మొసంగుట" కూడ మీరు సంకల్పించిన కార్యములలో వివరించియున్నారు. ఈ పని కూడ మీరు సాధ్యమయినంత వేగముగా నెరవేర్తురు గాక.

ఈ సందర్భమున ప్రమోదూత నామ సంవత్సర పరిషద్వార్షిక సభకు అధ్యక్షులయిన శ్రీ చిలుకూరి పిగడ భానుమూర్తిగారి ఉపన్యాస మందలి వాక్యములు మీకు జ్ఞప్తికి తెచ్చుచున్నాను. "తత్త్వ చరిత్రాత్మక గ్రంథములు కూడ సాహిత్యాంతర్భాగము లేనా ? అని సంశయించవలదు. ఆంగ్లభాషలో అగిజో, మోర్లీ, గిబ్బన్, ప్రెస్కాటు, కార్లైలు, మకాలే, హేలమ్, హ్యూమ్ మొదలగు చరిత్రకారులు వ్రాసిన గ్రంథములు సాహిత్యవాఙ్మయభాగమున కూడ నుత్తమ వచన కావ్యములై సద్గ్రంథములై విలసిల్లుచున్నవి. అర్నోల్డు లాకు, గ్రీన్, హక్స్లీ, స్పెన్సర్ మొదలగువారి తత్త్వగ్రంథములును". అంతే గాక ఆంధ్రుల నెల్లర నేకముఖముగా కూర్చునది ఆంధ్రభాషయే. జాతి జీవనము సంస్కృతియు వాఙ్మయమున ప్రతిబింబితములగు చుండును. "ఆంధ్రజాతీయౌన్నత్యమునకు భాషాభివృద్ధియు, వాఙ్మయ సేవయు ముఖ్యమని గుర్తించి వంగీయ సాహిత్యపరిషత్తు మున్నగు సంస్థల నాదర్శముగాఁగొని శ్రీ జయంతి రామయ్యపంతులుగారు ఈ ఆంధ్ర సాహిత్య పరిషత్తును స్థాపించిరి" అని ప్రభల సుందరరామ భవన ప్రవేశ మహోత్సవ నిర్మాణ నివేదికలో మొట్ట మొదటి వాక్యముగానున్నది. వారు గుర్తించినది ఎంతవరకు నెరవేరినదో మీ పరిషత్తువారే ఆలోచింతురు గాక.

ఒక పుస్తక భాండాగారము స్థాపించి సాధించుట యందు ప్రధానముగా తెలుగు గ్రంథము లుండవలెను. వ్రాతప్రతులు కూడ నుండవలెను. అని మీరు ప్రయోజనములలో పేర్కొన్నది ఎక్క

వగా నెరవేరినందున పరిషత్తువారినభినందించుచున్నాను. దిన దినాభివృద్ధి నొందుచున్న భాండాగారమందలి ముద్రితాముద్రిత గ్రంథములకు స్థలము లేకపోవుటచేతను, పరిశోధకులకు పండితులకు గ్రంథ పరిశోధన మొనర్చుటకు ప్రశాంతము, నిర్మలము, విశాలమునగు వసతి లేకపోవుటచేతను, మిక్కిలి ఇబ్బంది కలుగుచుండెను.- అని మీరు పరితపించుచుండినపుడు శ్రీ ప్రభల వెంకటసుబ్బమ్మగారు ఈ లోటును దీర్ప సంకల్పించి తన భర్తగారైన కీర్తిశేషులు ప్రభల సుందర రామయ్య B. A, B. L. గారి పేర నిర్మింపవలసినదని కోరి కావలసిన ధనసహాయము చేయుటవలనను ఈ భవనము నిర్మితమైనది గదా అని మీతోపాటు నేనును పరమానందభరితుడనైతిని. ఈ భవన నిర్మాణము జరిగిన తర్వాత నేటి వరకు గ్రంథ పరిశోధన మెంతవరకూ జరిగినదో ఇప్పుడెట్లు జరుగుచున్నదో ఎంద రీపరిశోధన చేయుచున్నారో తెలుసుకొనుటకు కుతూహలుడనై యున్నాను.

తెలుగు భాషకును, వాఙ్మయమునకును సంబంధించిన విషయములను చర్చించు నొక పత్రికను ప్రకటించుట ముఖ్యమగు ప్రయోజనములలో నొకటిగా నెంచి "ఆంధ్రసాహిత్య పత్రిక" నేటి వరకు అవిచ్ఛిన్నముగా ప్రకటించుచున్నందులకు మిమ్ము నే నెక్కువగా కొనియాడుచున్నాను. ఈ పత్రిక ప్రతులు ఎన్ని ముద్రితములగుచున్నవో, ఎన్ని చెల్లుచున్నవో తెలుసుకొన గోరుచున్నాను.

"ఆంధ్రభాషలోని మంచి గ్రంథముల బండిత పరిష్కారము చేయించి నిర్దుష్టముగ బ్రచురించుట" కూడ నొక ప్రయోజనముగ గుర్తించి నేటికి 65 గ్రంథములను ప్రచురించినారని విని ఆనందించుచున్నాము.

మీరు నిరంతరముగ పరిషద్వార్షిక సభల నేర్పాటు చేయుచున్నారు. సభలలో తెలుగు వాఙ్మయమునకు సంబంధించిన విషయము

లను గురించి చర్చలు జరుగుచున్నవి; పండితులు, విద్యాధికులు సభలలో తమ యుపన్యాసములను చదివి వినిపించుచున్నారు. అందులో కొన్ని మీ పత్రికలలో ముద్రితములగుచున్నవి. ఇది మిక్కిలి ప్రశంసింపవలసిన విషయము. మీరింకను "ఆంధ్రదేశ ప్రాచీన చరిత్రాంశ పరిశీలనమునకు ప్రోత్సాహమొసంగి లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుగు దేశము యొక్కయుఁ బ్రజల యొక్కయు జరిత్రయొకటి రచించి ప్రకటించుట"యను ప్రయోజనమును సాధించినట్లు కనబడదు. "తెలుగు సాహిత్య విషయమునఁ బరీక్షలుగావించి పారితోషికములను, సాహిత్య పట్టములను, యోగ్యతా పత్రికలను నొసంగుట"యను ప్రయోజనమును ఎంతవఱకు సాధించినారో వినగోరుచున్నాను. "తెలుగు భాషకు సజాతీయేతర భాషలతోఁగల సాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొక వ్యాకరణము రచించి ప్రచురించుట"యను ప్రయోజనము మీరు సాధించినట్లు కనబడదు. ఇది నేడు సాధ్యమైనంత వేగముగా కావలసియున్న దని నా యభిప్రాయము.

తెలుగు వ్యాకరణమును గూర్చి నాకు తోచిన యభిప్రాయములను విన్నవించుచున్నాను. నేను పండితుఁడనుగాను; తెలుగు వ్యాకరణము— విద్యార్థిదశలో కొద్దిగా చదువుకొంటినే గాని చెప్పదగిన కృషి చేసినవాడనుగాను. అయినను ఈ విషయమునుగూర్చి ప్రసంగింప సాహసించుచున్నందులకు పెద్దలు క్షమింతురుగాక! ఇదివఱకు మీరు ప్రమాణములుగా నెంచి యాదరించిన వ్యాకరణములన్నియు ప్రాచీన కవి ప్రయోగములను ఆధారముగా పెట్టుకొని రచితములైనవే కాని భాషలోఁగల నుడికారమును పూర్తిగా గ్రహించి రచితములయినవి కావు. ఇట్టి వ్యాకరణములు పూర్వుల పద్యకావ్యములను ఆదర్శప్రాయముగా నెంచి కావ్యములను రచించు

వారికే ఉపచరించునుగాని నేడు కావలసిన బహుముఖ వచన రచనకు అంతగా ఉపచరింపవు. అంతే గాక అర్వాచీన కవి ప్రయోగములను ఆ వ్యాకరణములు లెస్సగా గ్రహించకపోవుటచేత నేటి కావ్యరచనకైనను అవి ఉపచరించుటలేదు. అదీకాక దినదినాభివృద్ధిగా పెరుగుచున్న వృక్షశాఖలనుండి పండుటాకులు నేల వ్రాలి చిగుళ్ళు పుట్టునట్లుగా ప్రాచీన కవి ప్రయోగములు నేటి భాషనుండి తొలఁగిపోయి ఆ ప్రయోగములకు మారుగా ఆంధ్రులందరినోటను నూతన ప్రయోగములు తాండవించుచున్నవి. కనుక, కేవలము గ్రామ్యములైన ప్రయోగములను విడిచి శిష్ట జన వ్యవహారమందుగల ప్రయోగములను కూడ గ్రహించి సమగ్రమైన వ్యాకరణమొకటి రచించుటకు పరిషత్తువారు పూనుకొనవలసియున్నదని నా సలహా.

ఈ సందర్భమున సైతము చెన్నాప్రగడ భానుమూర్తిగారు ప్రమోదూత సంవత్సరమునందు తమ అధ్యక్షోపన్యాసమునందు చెప్పిన ఇంకో విషయము కూడ జ్ఞప్తికి తెచ్చుచున్నాను.

కావ్యసృష్టి ఈ కాలమున సర్వతోముఖముగా సాగవలసి యున్నది. ఇట్లు సాగుసృష్టిని కొంతకాలము విశృంఖలముగా సాగనిచ్చిన పిమ్మట సాహిత్య పరిషన్మండలులు అట్టి కావ్యసృష్టికిఁ దగు నియమ నిబంధనల నేర్పాటుచేసి "వాక్యం రసాత్మకం కావ్యమ్" అను లక్షణమునుబట్టి విమర్శకు నిల్పి దానిని ప్రసిద్ధ సాహిత్యాంతర్భాగముగ నంగీకరింపవలయును. వాఙ్మయసృష్టి చాలినంత సాగిన వెనుకనుగదా వ్యాకరణలక్షణరూపమున నియమ నిబంధన లేర్పరుచుటయుఁ దదనుసారముగా విమర్శ కార్యము బయలుదేరుటయును"

ఈ ప్రసంగము శ్రీ భానుమూర్తిగారు గావించి సుమారు ముప్పది సంవత్సరము లయినది. ఈ ముప్పది సంవత్సరములలోను సర్వతోముఖముగను తెలుగు రచన విశృంఖలముగ సాగినది. ఇంకను

సాగుచున్నది. దీనిని పరిశీలించి విమర్శకు నిల్చుదానిని తేల్చి నేటి తెలుగుభాషకు వ్యాకరణ లక్షణములను పరిషత్తువారు నిరూపింతురు గాక !

ఈ సభకు నన్ను దయతో అధ్యక్షపీఠమున కూర్చుండబెట్టి గారవించినందుకు పరిషత్కార్య నిర్వాహకులకు, మిత్రుడు శ్రీ దంటు భాస్కరరావుగారికీ కృతజ్ఞతాభివందనములు మఱియొకసారి ఒనర్చుచున్నాను. నా ఉపన్యాసము అల్పజ్ఞాని వాక్యములతో ఉన్నను ఆదరానురాగములతో వినుచుండిన ఈ సభాదులకును నా కృతజ్ఞత.

---

# కల్యాణ సాహిత్యము

జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.

అంతఃకరణమును సద్వాసనావాసితము గావించుకొనుట యెల్ల సాధనములలో నుత్తమము. ఎల్లప్పుడు మంచినే వినుట, మంచినే చూచుట యంతఃకరణమునకుఁ బవిత్రతను సత్త్వగుణాభివృద్ధిని గల్గించును.

భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః భద్రం పశ్యే మాక్షభి ర్యజత్రాః.

ఇత్యాదిశ్రుతులలో నిరంతరమాంగళ్యశ్రవణదర్శనములు వాంఛింపఁబడినవి. మాంగళ్యభూయిష్ఠమైన సంస్కారము గలమనస్సులో మంగళభావములే యుదయించును. వేదసిద్ధమైన యీసంప్రదాయము నుండియే కావ్యమున కాదిమధ్యాంతములయందు మాంగళ్య ముండవలయు ననునియమ మేర్పడినది.

"మంగళాదీని మంగళమధ్యాని మంగళాన్తాని శాస్త్రాణి ప్రథన్తే" గ్రంథము మాంగళ్యప్రధానముగానుండవలయు నని దీనితాత్పర్యము.

కల్లోలితపరిస్థితులను సృజించి యందులోనే పాఠకుని క్రీడింపఁ జేయుట యితరదేశసాహిత్యములలోఁ బరిపాటి. దీనికిని భారతీయ సాహిత్యసంప్రదాయమునకును మూలమట్టమైనభేదము కలదు. వేదములకు మకుటాయమానమైన శాంతిపాఠము భారతీయసాహిత్యమునకు స్ఫూర్తిదాయకము. అడుగడుగునకును "శాంతి శ్శాంతి శ్శాంతి" యని పఠించువారు భారతీయులు. దీని కనుగుణముగా నీదేశమున ధార్మికతను, శమదమాదులను ప్రేమవాత్సల్యాదులను విశేషముగాఁ బ్రతిబింబింపఁజేయు సౌమ్యసాహిత్యము మిక్కుటముగా బయలుదేరినది.

వేదధర్మమును కాంతాసమ్మితముగా బోధించుటయే భారతీయ సాహిత్యలక్ష్యము. వేదములు ప్రభుసమ్మితముగా "సత్యం వద, ధర్మం చర" మున్నగు నేధర్మములను శాసించుచున్నవో, పురాణము లేధర్మమును మిత్రసమ్మితముగా బోధించుచున్నవో, కావ్యనాటకాది సాహిత్యగ్రంథములు వానినే వ్యంగ్యమర్యాదతో రసరీతివృత్త్యలంకార విరాజితమైనభాషలో బోధించును. ఈ యంశమును మనయాలంకారికు లిట్లు వాక్రుచ్చియున్నారు.

యద్వేదాత్ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానా చ్చిరం
య చ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్
కాంతాసమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే.

## అభారతీయసాహిత్యము.

అభారతీయలక్షణములు గలసాహిత్యము నేడు దేశములో వెల్లివిరియుచున్నది. ఎక్కడఁజూచినను విషాదపూరితగాథలు, రక్తపాతము, చౌర్యమాయాదివాతావరణము, అధార్మికానాగరకప్రేమగాథలు, అపరాధపరిశోధనలు మున్నగునవి పత్రికలలోను, చలనచిత్రములలోను, నవలలలోను, నాటకములలోను, సహస్రసంఖ్యాకములుగ బయలుదేరి పిల్లలను, స్త్రీలను, యువకులను, పెద్దలనుగూడ నాకర్షించి పాఠకులను దమకు దాసులనుగాఁ జేసికొని నీతిని గుల్ల చేయుటయే కాక సామాన్య, శాంతిప్రధాన, జీవితముపై ప్రజలకు రుచి లేకుండఁ జేసి దారుణసంఘటనలకును, రక్తపాతములకును, ఉద్రిక్తప్రేమగాథలకును తహతహలాడు తత్త్వమును ప్రజలలోఁ గల్గించుచున్నవై భారతీయతనే లోపింపఁజేయుచున్నది. విదేశములనుండి దిగుమతి యగుచున్న దారుణకథాగ్రంథముల (Tales of horror) వలన భారతీయహృదయము నకు కలుగుహానిని గుర్తించి భారతప్రభు

త్వము కొలదిసంవత్సరములక్రిందట నట్టిగ్రంథములదిగుమతిని నిషేధించినది.

గ్రంథవాతావరణము పాఠకహృదయమునందుఁ బ్రతిబింబిత మగుచుండును. మంగళమయమైన సాహిత్యమును జదివినపిమ్మట మధురస్మృతులు, మధురస్వప్నములు, మధురాలోచనలు బయలు దేరును. రక్తపాతములతో, దారుణసంఘటనలతో, నేరములతో నిండినగ్రంథమును జదివినపిమ్మట దారుణస్మరణలు, రక్తపాతదృశ్యోపేతస్వప్నములు, దారుణాలోచనలు కలుగును. ఇట్టిసాహిత్యము మానవత్వమునే లోపింపఁజేయును.

ఏవగించుకొనఁదగిన దుష్టత్వమును వినోదకరమైన హాస్యధోరణిలోఁ జిత్రించుటయు, అపసిద్ధాంతమును చమత్కారమునకై పరమాధరముగాఁ జిత్రించుటయు నప్పటి కప్పుడు పాఠకునకు గిలిగింతలు పెట్టినను క్రమముగా జీవితమును ఉత్కృష్టలక్ష్యరహితముగాను అల్పచాపల్యవాతచాలితతూలములుగాను మార్చివేయును. అట్టి సాహిత్యము కూడ నేడు పెరిగిపోవుచున్నది. గ్రంథమంతయు సదాత్తధోరణిలో నుండి యెక్కడనో యొకచోట నిట్టిహాస్యచమత్కారము లున్నను వానిని సాంప్రదాయికవిమర్శకులు సహింపలేరు. "ఆఁకలిగొన్నవారు వ్యాకరణమును భుజింతురా? దప్పికగొన్నవారు కావ్యమును ద్రాగుదురా? ధనమునే సంపాదింపుము'' అనుచోట ప్రమాదకరమైన భావము లేకపోయినను, అట్టిఛాయ కన్పట్టినమాత్రమున క్షేమేంద్రుఁడు దానిని నిరసించినాఁడు.

"బుభుక్షితై ర్వ్యాకరణం న భుజ్యతే
న పీయతే కావ్యరసః పిపాసితైః"

అను చమత్కారములో తత్త్వౌచిత్యము చెడినందున నది గ్రాహ్యము కాదని క్షేమేంద్రుఁడు చెప్పియున్నాఁడు.

నిరుపయోగము, అనర్థదాయకము నగువాఙ్మయముచే ప్రజలు రంజింపఁబడుటకు తత్కాలమం దుదాత్తవాఙ్మయమును రమణీయ ధోరణిలో రచింపఁగలకవుల వైరస్యమే ముఖ్యకారణము. గతశతాబ్దిలో నింగ్లండులో నిమ్నశ్రేణికిఁ జెందినవవలలు కుప్పతిప్పలుగా బయలుదేరుటను జూచి మెకాలే యిట్లు ప్రతిజ్ఞచేసెను. "రంజింపఁ జేయుటలో నీనవలలకుఁ దీసిపోకుండ, ప్రజానీకమున కావశ్యకమైన చారిత్రకజ్ఞానమును బుష్కలముగా నీయఁగలగ్రంథములను నేనురచించి పతివిలాసవతియొక్క బల్లమీఁదను ఈచెత్తపుస్తకములకు బదులుగా నాగ్రంథము లుండునట్లు గ్రంథపరంపరను ప్రకటించెదను. ఈ సంకల్పమునకు ఫలితముగా బయలుదేరిన యాతని 'హిస్టరీ ఆఫ్ ఇంగ్లాండ్' అను గ్రంథము మధురమైనశైలిలో, సరసహృదయరంజకముగా రచింపఁబడి చారిత్రకగ్రంథమయ్యు సాహిత్యగ్రంథములలో స్థానము గాంచినది.

నేఁడు భారతదేశములో బయలుదేరుచున్న 'అనర్థక' సాహిత్య స్థానమున కల్యాణవాఙ్మయము ప్రతిష్ఠింపఁబడవలయు నన్నచో లోకశ్రేయోనిరతులైన రచయితలు సాంప్రదాయికభావములను రసోదంచితముగా కావ్యనాటకకథానికాదిరూపమున వెల్లడించుట యొకముఖ్యమార్గము.

సాహిత్యము అగ్నిహోత్రమువంటిది. శిష్టులు దేవతల కాహుతి నందించుట కుపయోగించునగ్నినే దుష్టుఁడు కొంపలుతగులఁ బెట్టుట కుపయోగించును. కవితాపవిత్రతను దృష్టిలో నిడికొనియే థామస్ గ్రే కవితను దివ్యాగ్నిగా వర్ణించి యున్నాఁడు. (Some celestial fire.) మానవుని దివ్యత్వములోనికిఁ గొనిపోఁదగిన కవితాశక్తి దురుపయోగము చెందుచో సమాజవ్యవస్థను భ్రష్టముచేయు

టకును నీతిని గుల్లచేయుటకును సమర్థమగును. అట్టిసాహిత్యముపట్ల జాగరూకతతో నుండవలసిన పరిస్థితి యుపస్థితమై యున్నది.

లలిత సరళ దేశభాషలలో రచింపఁబడుచో రామాయణ మహాభారతకథలే జనసామాన్యము యొక్క హృదయము నాకర్షింపఁగలవు. రమ్య సులభ భాషలో రచింపఁబడు దుష్టవిషయమునకు నట్టి భాషలోనే రచింపఁబడు నుదాత్తవిషయమునకును బోటీ కల్గుచో ప్రజలునిస్సందేహముగా నీ రెండవదానినే యాదరింపఁగలరు. ఈ విషయమై యిటీవల ఇండోనీషియాలో జరిగిన సంఘటనము మన కాశ్చర్యమును గల్గించును. ఆ దేశమున అమెరికన్ కామిక్స్ (నిమ్నశ్రేణికిఁ జెందిన ప్రహసనములు) ప్రజాహృదయములపై ఆధిపత్యము నెఱపుచుండినవి. దేశశ్రేయోభిలాషుల కిది మిక్కిలి బాధను గల్గించెను. ప్రజాహృదయము నట్టి సాహిత్యము నుండి మరలించి యుదాత్తసాహిత్యముపైకి త్రిప్పవలయు నని వారు తలంచిరి. రమ్య సులభ భాషలో రామాయణ మహాభారత కథలను రచియింపించి వారు ప్రజల కందించిరి. వెంటనే ప్రజ లాప్రహసనసాహిత్యమును పీడి యీ పవిత్ర సాహిత్యమును జేపట్టిరి. రామాయణ మహాభారత కథలముందఱ నీ ప్రహసన గ్రంథముల బండారము బయటఁబడినది. రామాయణ మహాభారతముల యాకర్షణ శక్తిముం దాప్రహసనములు నిలువఁ జాలకపోయినవి. మహాభారతము ఇండోనీషియా భాషలో నిటీవల 40 సంపుటములుగా వెలువడినది. రామాయణము కాని మహాభారతము కాని ఇండోనీషియా భాషలో నచ్చు కాఁగానే వెచ్చమయిపోవుచున్నందున నెప్పటి కప్పుడు నూతనముగా ముద్రింపవలసి వచ్చుచున్నది. ఇన్ని వేల సంవత్సరములు గడచినను ప్రాఁతవడక విదేశస్థులను గూడ నీ రీతిగా నాకర్షింపఁగల్గిన రామాయణ మహాభారతముల నైసర్గికపటుత్వమున కెవరు జోహారు లర్పింపరు? ఈ యార్షగ్రంథము ల భాషాసౌభాగ్యము

సంస్కృత భాషాభిజ్ఞులకు మాత్రమే యాస్వాద్యమైనను, వీని భావ సంపదయు, కథామాధుర్యము నితరులను గూడ నుద్ధరింపఁగల వనునది ప్రధానాంశము.

అమంగళ ఘట్టబాహుళ్యమును జిత్రించిన కవినిలోకయాథార్థ్య ప్రదర్శకుఁడని స్తుతించుట యభారతీయపద్ధతి. కవి లోకములోని యథార్థస్థితిని వర్ణించినను అది ధర్మమోక్ష పురుషార్థ భంజకముగా నున్నచో సాంప్రదాయికులను రంజింపఁ జేయదు. కళ కళకొఱకే యను భావము భారతీయము కాదు. అసంస్కృత హృదయుని ఉత్సాహ పఱచునట్టి యథార్థిక శృంగార వర్ణనలు, ఘాతుక కృత్య చిత్రణములు భారతీయ కవిలక్ష్యములుగా నెప్పుడును లేవు.

మానవహృదయములోని సుకుమార భావములకును, కారుణ్యమునకును, ధార్మికతకును, పరమేశ్వరభక్తికిని, ఆధ్యాత్మిక వికాసమునకును దోహదమిచ్చుచు నుదాత్తమైన ధోరణిలో నడచు సాహిత్యమునే చదువవలయునని భారతీయుల సిద్ధాంతము. "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అను కావ్యపఠననిషేధము దుష్టకావ్యపరముగా జెప్పఁబడినది.

భారతీయ సాహిత్యము యొక్క విశిష్టతను గుఱించి శ్రీ అరవింద లిఖించిన వాక్యముల నిటను లెక్కింపవలసియున్నది.

"మానవ జీవిత ప్రదర్శనమును పాత్రచిత్రణమును గవికి ప్రధాన కర్తవ్యములనుగా భారతీయాలంకారికులు నిర్దేశింపలేదు. ఇవి ప్రయోజనాంతర రహితములై స్వతస్సిద్ధముగానే నిర్వర్తనీయము లని పాశ్చాత్యులు భావించినట్లు భారతీయులు భావింపలేదు. భారతీయాలంకారిక మతములోఁ గవిత్వ మానందావహము, కోమలము నగు నొక కళ. నాటకము సూక్ష్మములైన మానవహృదయాంతర భావములను జిత్రించుచు సామాజికుని మనస్సును గోమలమైన శాంతి సమన్విత స్థితిలో

నికిఁ దీసికొనిపోవుటను ముఖ్య కర్తవ్యముగా గల్గియున్నది. మానవుని జుట్టు పట్టుకొని యీడ్చి తుపానువంటి దారుణకరుణామయ సంఘటనల లోనికిని భయానక దృశ్యములలోనికిని దీసికొనిపోయి వానిని రక్తములో ముంచి భయోపహతునిగాను కంపితదేహునిగాను జేసి వైచుటను దన కర్తవ్యముగా భారతీయ సాహిత్యము భావింపలేదు. డచెస్ ఆఫ్ మాల్ఫిలోఁ గాని, ఒడిపస్‌లోఁ గాని, మాక్బెత్ ఒథెల్లోలవంటి విషాదాంత నాటకములలోఁగాని కళాసంబంధమైనయానందము నొందుటను ఆటవికానాగారక లక్షణముగాను, అమానుష లక్షణముగాను భారతీయులు భావింతురు. దీనికిఁ గారణము భారతీయ మనః ప్రకృతిలోని దివ్యమైన యొక విధమగు కోమలత్వము. హిందువుల మనస్సు స్వతస్సిద్ధముగా నిత్యము నుదాత్తముగా నుండును. మఱియు నది శాంతమైనది, సహనశక్తి కలది. మాధుర్యము, పవిత్రత, మఱియు బుద్ధుని యాత్మనుండి పొంగివచ్చిన కారుణ్యము హిందువులకు స్వభావసిద్ధమైనది. కావునఁ గవితాకళ ఆనందపఱచునది మాత్రమే కాక ఉదాత్తతను జేకూర్చునదిగా నుండవలయునని భారతదేశములో భావింపఁబడెను. (Kalidasa 8_38)

ఇంగ్లీషు మున్నగు ఆధునిక యూరపియను సాహిత్యములలోనే కాక గ్రీకు లాటిన్ సాహిత్యములలో గూడ నపారపాండిత్యమును గల్గియుండి యాధునిక తత్త్వవేత్తలలోను, జగత్ప్రవక్తలలోను నొకరుగా విఖ్యాతులైన శ్రీ అరవింద ప్రాచీన భారతీయ సాహిత్యప్రాశస్త్యమును వెల్లడించుచుఁ బల్కిన యీయసందిగ్ధ వచనములు విశాలప్రపంచములో భారతీయసాహిత్యమునకుఁ గల యున్నతస్థానమును నిర్దేశించుచున్నవి. అన్ని దేశములలోను, అన్నిభాషలలోను గొప్ప సాహిత్యమే బయలు దేఁ నదనియు, నొకటి గొప్పది మఱొకటి తక్కువది యనుటకు వీలు లేదనియు సామాన్యముగాఁ జెప్పివేయుట కేవిధమైన ప్రతిభయు

సక్కఅలేదు. సామాన్యు లెల్లరు నట్లు చెప్పవారే. విమర్శించి యొక సాహిత్యము యొక్క విశిష్టతను నిరూపించుట కసాధారణమేధ కావలయును. అతిలోక ప్రతిభాధన్యులైన శ్రీ అరవింద గావించిన యీ తీర్పును ప్రత్యాఖ్యానము చేయుట యెవరికిని శక్యముకాదు.

ప్రజల యాధ్యాత్మిక దృక్పథమునకు ప్రతిబింబము సాహిత్యము లోను, సాహిత్యమున కను గుణమైన ప్రభావము సమాజముపైనను గన్పట్టుట కారణముగా భారతీయజీవితమునకును సాహిత్యమునకును గల ప్రగాఢసంబంధము పరస్పరోత్తేజన హేతువై యీ రెండింటికిని ప్రపంచములో విశిష్టస్థానమును గూర్చినది.



# ఆంధ్రసాహిత్యపరిషత్తు-తదాశయములు.

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

మహాజనులారా!

ఆంధ్రసాహిత్యపరిషత్తునకు నేఁడు నలువదియేనిమిదవ వార్షిక సభ జరుగుచున్నది. ఈయాంధ్రసాహిత్య పరిషదాశయములనుగూర్చి తెలుపవలయునని నీయుపస్థితులైన సజ్జనులలో సర్వవిధముల నర్హత గలవారు ఆంధ్రసాహిత్య పరిషదధ్యక్షులైన కవిసార్వభౌములొక్కరే. ఆంధ్రసాహిత్యపరిషత్తు జన్మించునాఁటికి మాయట్టివారింకను జన్మింపనే లేదు. దీనిప్రారంభమును దీనివికాసమును దీనిపరిణామమును మొదటి నుండియుఁ గాంచుచు, దీనియభ్యుదయమునకై పాటుపడుచున్న కవిసార్వభౌములకే దీనియాశయములను సమగ్రముగఁ దెలుపుటకధికారము గలదు. కాని యీపరిషత్కార్యాలయమునఁ బదిసంవత్సరములు పని చేసినవాఁడనగుటచే నేనెఱిఁగిన విషయమును గూర్చి కొంత విన్నవింతును.

ఆంధ్రవాఙ్మయమునఁ బ్రబంధసృష్టి ప్రారంభమై నేఁటికించుమించు తొమ్మిదివందలయేండ్లు గడచినవి. నన్నయ మొదలు చిన్నయసూరివఱకు నడుమనుండిన యీకాలములో వేలకొలఁదిగ గ్రంథములు వెలువడినవి. వీనిలో నీనాఁడు వేలసంఖ్యపోయి వేళ్ళసంఖ్యపై నిలచినవి. మిగిలిన వన్నియుఁ గాలగర్భమున నణఁగిపోయినవి. ఇట్లగుటకుఁ గారణమేమని మనము పర్యాలోచనముచేసిన, కవితావిషయమున నేవి సలక్షణమైనవియో యవియే నిలిచి మిగిలినవన్నియు నంతరించిపోయినట్లు తెలియవచ్చును. సలక్షణమైనవియనఁగా వ్యాకరణ నియమములకు సరిపడునట్లు శబ్దములను గూర్చుటమాత్రమే కాదు. ఉత్తమసాహిత్యమనుటకుఁ గావలసిన నీతినియమముల నన్నిటిని బాటించిన గ్రంథములని యర్థము.

ఈనాఁడాంధ్రసాహిత్యరంగములో సత్తమకవులుగా లెక్కింపఁబడువారు నన్నయ తిక్కన ఎఱ్ఱన రంగనాథుఁడు భాస్కరుఁడు మారన సోమన శ్రీనాథుఁడు పోతన పెద్దన తిమ్మన రామకృష్ణుడు రామరాజ భూషణుఁడు సూరన ఇత్యాదిగ పరిమితసంఖ్యగల కవులేగలరు. వారి వారి రచనలం దన్నివిషయములుగాక కొన్నివిషయములే యుత్తమము లని సాహిత్యమర్మజ్ఞులు వాకొందురు. ఉత్తమసాహిత్యముగా లెక్కించుటకుఁగావలసిన కల్పనా పాటవము, భావసౌష్ఠవము, శయ్యాసౌభాగ్యము కథాచమత్కారము, సముచితశబ్దప్రయోగము రసోచితనిర్మాణము మున్నగు లక్షణము లేకృతులందు సమగ్రముగఁ గూడియుండునో, యట్టిరచన లేవిధమయిన ప్రచారము నపేక్షింపక భాష నిలిచియుండు నంతవఱకుఁ దమయస్తిత్వమును నిలువఁబెట్టుకొనియుండును. పైనఁ బేర్కొనిన యుత్తమకవుల కృతులన్నియు సలక్షణమైనవిగనుక నే యవి చిరస్థాయిత్వము నేర్పఱచుకొన్నవి. రాజాశ్రయము లేనిదే యొకమాతృకకు పదిపుత్రికలైనఁ బుట్టని వెనుకటిశతాబ్దులలో నుద్భవించి, వందలకొలఁది యేండ్లకాలము గడచినను కాలగర్భమున నణఁగిపోవక దీర్ఘాయుష్యమువహించిన కృతులన్నియు సలక్షణములేగాని విలక్షణము లేవియుఁ గానరావు. ఏకాలమునందైనను ఏభాషయందైనను సలక్షణమైన కృతులే కలకాలము నిల్చుననుట నిర్వివాదమైన విషయము.

కడచిన శతాబ్దిలోననఁగా 1850 మొదలుగ నచ్చుయంత్రములు వచ్చినప్పటినుండి నేఁటివఱకుఁగల సమయములో, ఆంధ్రసారస్వతరంగమున వివిధశాఖలలో, వేలకొలఁదియేగాదు లక్షలకొలఁది గ్రంథములు బయలుదేఱినవి. వానిలోఁగూడ నుత్తమము లని లెక్కింపఁబడునవి వ్రేళ్లసంఖ్యకులోఁదనే నిలుచును. ఏవియుత్తమములుగా గణింపఁబడునో యవియన్నియు సలక్షణములేగాని లక్షణదూరములుమాత్రముగావు. సాహిత్యనియమములను వ్యాకరణనియమములను సర్వథా

పాటించునట్టి రచనలే సహృదయసమాదరణీయములగు ననుట నిర్వివాదమైన సత్యము. లోకవ్యవహారమునందుఁగూడ నీతినియమములను బాటించు జనుఁడే బహుజనాదరణపాత్రుఁడగును. నీతినియమములులేనివానికి, అవిగలవానికిఁగల గౌరవాదరములుండఁజాలవు. భాషావిషయమునఁగూడ నది యట్టిదియే. ఆలంకారిక శాస్త్రోక్త పద్ధతిని సాహిత్యవిషయకములు ఛందోవిషయకములునగు నీతిపాటింపఁబడు కృతులే కాలమునందైనను గవితారసాస్వాదలోలుపుల యాదరమునకుఁ బాత్రములై చిరస్థాయిగ నుండగలవు. లేనివన్నియు నొకగాలికి బయలుదేటి వేఱొకగాలికి సంతరించిపోవునవియే యగును. కావున సాహిత్యవిషయమున సలక్షణత్వమే చిరస్థాయిత్వమునకు నిదానము.

మఱియు సాహిత్యసృష్టియనునది కళాత్మకమైన నిర్మాణము కళయనునది యేదియయినను నది, ప్రాచీనసామగ్రికి నవీనమైన వికాసరూపము. కళానిర్మితికిఁ బ్రాచీనసూత్రములను విడనాడుట కుదరని పని. లలితకళల కుపకరణములైన సుత్తి ఉలి కుంచె పటము రంగులు వాద్యసాధనములు శబ్దార్థములు మున్నగునవి యేవియయినను నవి వెనుకటివిపోయగును. అట్టిప్రాచీనోపకరణాలంబముతోడనే యర్వాచీనులైన కళానిర్మాతలు తమతమ ప్రతిభావిశేషముచే విలక్షణమైన రచన సాగించి, సౌందర్యాతిశయనమున్మీలనమున సహృదయుల హృదయము నాకర్షించి, ద్రష్టలకానందమును గలిగింతురు. సాహిత్యనిర్మాణమనునది యట్టికళాత్మకమైనసృష్టి. ఈరీతి కళాత్మకమైన నిర్మితి ప్రాచీనసామగ్రీసహకారమును వదలి కేవల నూతనసామగ్రితో బయలుదేఱనేరదు. అందును కవిత్వమనునది ప్రాచీనశబ్దములమీఁదనే నవీనమైన నిర్మాణము. కవితాకళాస్రష్టకు ప్రతిభావ్యుత్పత్తులు జతఁగూడియున్నచో సకలజనహృదయాకర్షకము ఆనందజనకమునై వగద్య పద్యాత్మక కావ్యనిర్మాణముగావించి, సహృదయ హృదయములనాతఁ

డానందవీచుల నోలలాడింపఁగలఁడు. అట్టికళానిర్మితి కేకాలమందైనను విశిష్టవిజ్ఞాన మావశ్యకము. అదిలేని నాఁడాతని నిర్మాణమపరిపక్వము గనేయుండును.

కవితానిర్మితికిఁ గడంగువాఁడు, శబ్దశాస్త్రజ్ఞునియొద్దకుఁబోయి శబ్దములను తయారుచేసిపెట్టుమని యడుగఁబోఁడు. లోకములోని యితరమైనపనులట్టివిగావు. ఏపని కేదిసాధనమో, తన్నిర్మాతయొద్దకుఁబోయి యాయుపకరణమునుజేసి యిమ్మని యడుగును. ఈవిషయము మహాభాష్యమునఁ బతంజలి యిట్లు వివరించియున్నాఁడు. "లోకములో జనుఁడు కుమ్మరివాని యింటికిఁబోయి, నీవు నాకొకకుండచేసియిమ్ము; దీనితోఁ బనియున్నది; యని యడుగును. ఇట్లు వ్యాకరణజ్ఞుని యింటికిఁబోయి, నాకుఁ గొన్నిశబ్దములు తయారుచేసియిమ్ము; నేను బ్రయోగించెదనని యడుగఁబోవఁడు" అనినాఁడు. మఱియు వ్యాకరణమనునది యీవఱకు లోకమునఁబ్రయుక్తమైన శబ్దములలో నసాధుశబ్దములనుండిసాధుశబ్దములను విడఁదీసి, వానిస్వరూపాదికమును సూక్ష్మమైన పద్ధతిలో నెఱుఁగఁ జెప్పును. అంతియేకాని వ్యాకరణమెప్పుడును శబ్దములను క్రొత్తగా నిర్మింపదు. ఈవఱకున్నవానిని నిరోధింపదు. లక్షణమనునది యేదియయినను నాతీరుననే నడచుచుండును.

చిన్నయసూరి బాలవ్యాకరణమును రచించి, భాషాప్రవాహమునకొకయానకట్ట కట్టివైచె నను నపప్రథగలదు. 'ప్రవాహినీ దేశ్యా' యను సూక్తినిబట్టిదేశ్యశబ్దమయమైనభాష యెప్పుడునుమున్ముందునకుఁ బ్రవహించుచునే యుండవలయునుగాని, దానిప్రవాహమునకు వ్యాకరణముచే నానకట్ట గట్టరాదని వారియూహ. ఇదిపాశ్చాత్యభాషాశాస్త్రి సిద్ధాంతసంస్కారవశమునఁ దెలిపిడిమాట. ఏభాషకైనను వ్యాకరణమనునది బయలుదేఱినచో దానితో నాభాషమృతినొందునని పాశ్చాత్యులలోఁ గొందఱయూహ. తద్వాసనావాసితచిత్తులైన మనవారిలోఁ

గొంద ఱావలుకునే పలుకుచున్నారు. కాని యీనాఁడు మన దేశమున ముఖ్యముగ నానకట్ట లెక్కువ కట్టవలయుననుచున్నారు. ఏటిప్రవాహ ముల నిచ్చవచ్చినట్లు ప్రవహింపనిచ్చిన నది వ్యర్థముగ సముద్రగామి యగుచున్నదనియు, పెద్దపెద్దనదీప్రవాహముల కానకట్టలుగట్టి, నీటిని నిలువఁజేసి, కాల్వాదిముఖమున బహురూపములఁ బ్రవహింపఁజేసినచో నది యీాపరక్షేత్రములనుసైతము పండించి, విశేష దేశ సౌభాగ్యదా యకమగునని యుద్ఘోషించుచున్నారు. అట్లుసేయుట దేశసౌభాగ్య దాయకమనుట నిర్వివాదమైన సత్యము. భాషావిషయమున నానగట్ట గట్టుటయు నట్టిదియే.

దేశ్యశబ్దప్రవాహము తనయిచ్చవచ్చినట్లు ప్రవహించుచుండ, దానికి వ్యాకరణముచే నిరోధమును గల్పించి, గద్యపద్యాత్మకములగు రచనలనుకుల్యలద్వారాయాశబ్దప్రవాహమునుసంయతముగఁబ్రవహింపఁ జేసిన నాప్రవాహము దేశమునందలి జనులమనములనెడి క్షేత్రముల నానంద సస్యములతో నిండునట్లుచేయును. అట్లుగాక ప్రవాహము నిచ్చవచ్చినట్లుపోనిచ్చిన, నది నిమ్నాభిముఖమై ప్రవహించి నిరుప యోగకరమేయగును. ఇదివఱకుఁ గట్టినయానకట్టలు కాలవశమున శిథిలమైననాఁడు, వానిని మఱింతగట్టిచేసిపెంచినచో నాకట్టలు మఱింత ప్రదేశము ఫలించుట కుపకరించును. అటులనే వ్యాకరణనియమములను ముందున్నవానిని మఱింత దృఢముచేసి, మఱికొంతపెంచి పెద్దచేసిన నది భాషాసంపదకు మఱింతపెంపును సమకూర్చిపెట్టును. కావున భాషాక్షేత్రముసకలసంపత్సమృద్ధము గావలయుననిన ప్రాచీనలక్షణముల నన్నిటిని సుదృఢముగావించి పెంపొందింపవలయును. అట్టి సలక్షణ మైన యాంధ్రభాషను సురక్షితము గావించుటయే యీయాంధ్ర సాహిత్యపరిషత్తునకుఁ బ్రధానాశయము. గ్రాంథికాంధ్రభాషాపోషణ మునకువలయు పనులనుగావించుటయే యీపరిషత్తునకుఁ బ్రధాన లక్ష్యము.

గ్రాంథికాంధ్రభాషా సముద్ధరణమునకై ప్రాచీనకాలమునం దెన్నియో సంస్థలు బయలుదేఱినవి. వానిలో నేఁటికి నలువదియెనిమిది వత్సరములు జీవించియున్న సంస్థ యీఆంధ్రసాహిత్యపరిషత్తు ఒక్కటియే. ఇది సలక్షణమైన యాంధ్రభాష నుద్ధరించుటకై యత్నించు సంస్థగనుక నే యావదాంధ్రదేశమున కాదరపాత్రమై యింతకాలము నిలువఁగలిగినది. దీనిప్రధానలక్ష్యము నిదిసాధించుచుండునంతవఱకు నిదియిట్లే నిల్చుననుటకు సందియములేదు. నీతినియమబద్ధమైనదేవ్వడును జిరకాలస్థాయియగు ననుట ప్రత్యక్షసిద్ధమే. ఈ సాహిత్యపరిషదాశయములలోఁ దొలుతటిది ప్రధానమైనది. ఆంధ్రభాష కొక సమగ్రమైన నిఘంటువును నిర్మించుటయనునది. అట్టి నిఘంటునిర్మాణము జరిగినచో దానికగు వ్యయమంతయు తామేభరింతుమని శ్రీపీఠికాపురాధీశ్వరులు వాగ్దానముచేసి చెల్లించుకొనినారు. ఆనిఘంటు నిర్మాణమున సమగ్రతలేదనియు, తన్నిర్మాణమున నాలస్యము హెచ్చుగనైనదనియు పెక్కుమందియూహ. కాని యానిఘంటు నిర్మాణకార్యమునఁ గూడ నేను నాలుగైదువత్సరములు పాల్గొనియుండుటచే దానిలో నా యనుభవమును గొంత తెలిపెదను.

ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకటమున వెలువడుచున్న శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు సంపుటములలో ప్రథమసంపుటము పీఠికయందు ఆ నిఘంటు నిర్మాణపద్ధతి విపులముగ నిరూపింపఁబడినది. సహృదయతతో విమర్శింపఁగోరువారి నందఱ నొకమాఱాపీఠిక పరికింపఁగోరుచున్నాను. ఈ నిఘంటువులో నన్నయ మొదలు చిన్నయసూరివఱకు నుండిన ప్రామాణికాంధ్రకవుల ప్రయోగముల సహకారముతో నర్థనిర్ణయాదికమును గావించుచు, కన్నడము, తమిళము, మళయాళము తుళు మున్నగు భాషలలోని సజాతీయపదములనిచ్చుచు, శాసనప్రయోగముల నందిచ్చుచు Oxford Dictionary పద్ధతిలో రచన సాగించెదమని తెలిపి

యాపద్ధతినే నిర్వహించియున్నారు. చిన్నయసూరి రచించిన నిఘంటువుతో సహితముగ, చిన్నయ మొదలు నిన్న మొన్నటివఱకును నాంధ్రదేశమందున్న సంస్కృతాంధ్రభాషాపారీణులైన మహావిద్వాంసులందఱు నీనిఘంటునిర్మాణకార్యమునఁ బాల్గొనియున్నారు. వారందఱుఁగావించిన ప్రథమరచనను తరువాత నిఘంటు కార్యాలయమునఁ బనిచేసినపండితులు పూర్వోత్తరవిరోధములు న్యూనాధిక భావములు లేకుండ సరిఁజూచుకొనుచు, తుట్టతుదకు నిర్ధారితమైన ప్రణాళిక కనుగుణముగఁ గూర్చుకొనుచు నిఘంటువున కాకృతి గల్పింప మొదలు పెట్టిరి. ఇట్టి యీనిర్మాణమునం దాలస్యమైనదనుటనుగూర్చి నేఁ డెలుపున దొక్కటియే. ఈరీతినిఘంటువుల నిర్మితిలో నాలస్యమగుట యే గుణము. తొందఱపడిన భాష నిలిచియుండునంతకాలము నిలిచియుండఁదగిన యిట్టి నిఘంటువులలో స్ఖాలిత్యము లేర్పడును. అట్టి స్ఖాలిత్యములుండుట నిఘంటునిర్మితి కేపాటియు సరిపడదు. ఇంతవఱకు వెలువడిన సూర్యరాయాంధ్ర నిఘంటు సంపుటము లాఱింటిలో మొదటి మూఁడింటిని తరువాతిమూఁడింటితో జోడించిచూచిన సహృదయుల కిట్టి నిర్మాణమునఁ దొందఱపడవలయునో పడనక్కఱలేదో విస్పష్టముగ గోచరించును. గడచిన పదియేండ్లలో నీ నిఘంటుకార్యము సక్రమముగసాగలేదు. దైవికమైన నిరోధముచే నదికొంతవఱకువచ్చి నిలిచిపోయినది. నిలిచిపోయిన కొదువభాగమును పూర్తిచేయుటకు, ఈ వఱకు నిఘంటుకార్యమునఁ బనిచేసిన పండితులమైన మేము, ఈ నిఘంటువును పూర్తిచేయుట కుచితమైన సేవచేయుటకు సంసిద్ధులమై యుంటిమని మనవి చేయుచున్నాను. పరమేశ్వరానుగ్రహమునఁ గొఱవడి యున్న నిఘంటు నిర్మాణ సామగ్రి పరిషత్కార్యాలయమునకుఁ జేరిన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువును సమగ్రమును గావించి, శ్రీ సూర్యరాయ ప్రభువర్యుల యాశయమును, మహార్థికమైన కోర్కను, ఆంధ్ర

జనుల యాశయమును పండింపఁ జేసి కొందుమనియు, దీనికి బరమేశ్వరుఁడు సాయపడుఁగాక యనియు విని వేదించుకొనుచున్నాను.

ఈ యాంధ్రసాహిత్య పరిషత్సభా వేదికలందు లిఖితములైన యుపన్యాసములు చదువుటయే యొక పరిపాటి. గ్రాంథికాంధ్రభాషా పోషక సంస్థ గావున నిచటఁ జదివెడి యుపన్యాసములను ముందుగనే రాయించినచోఁ బరిషదాశయములు సక్రమముగఁ గొనసాగుట కవకాశ ముండును. వ్రాఁతకు మొదలు పెట్టినచో నేవిషయమయినను సంయత ముగను క్రమబద్ధముగను నుండును. అట్లు చేయక కేవలము మాటాడు టకే మొదలుపెట్టిన ఉపన్యాసమున శాఖాచంక్రమణము తప్పదు. కావు ననే నేనిపుడు మాటాడు విషయమును గ్రంథస్థము చేసికొనియే వచ్చి తిని. పరిషదాశయములను బాగుగ నెఱిఁగినవారీ యున్నవారిలోఁ జాల తక్కువమందియున్నారు. ఈవఱ కెఱిఁగిన వారికిఁ గాక, తక్కిన వారికీ పరిషదాశయముల నెఱిఁగించుటకు నాకుఁ దెలిసిన విషయముల నెఱిఁగించుచుంటిని.

సాహిత్య విమర్శన మనునది సుకుమారమైన ప్రయోగము. ఈ పనికి సహృదయత నిష్పాక్షిక దృష్టి యెంతేనియుఁ గావలయును. లేకున్న సత్కవుల కృతులందలి సారస్యము సరిగా గోచరింపదు. పాక్షిక దృష్టితోఁ గొనసాగిన విమర్శనముల వలన నెంతేని యనర్థ మేర్పడును. ఈ వఱకు మన తెలుఁగుభాషలో బయలుదేఱిన విమర్శ నములలో, కూలంకషముగ గుణదోషములు రెండిటిని నిరూపించిన విమర్శనములు చాల తక్కువయని చెప్పవచ్చును. కొందఱకు నన్నయ యేకవి. తిక్కన కవి కానేకాఁడు. కొందఱకు తిక్కనయే కవి. నన్నయ కవియే కాఁడు. కొందఱకు శ్రీనాథుఁడే కవి. కొందఱకు పోతనయే కవి. మఱికొందఱకు పెద్దనయే కవి. ఇఁక కొందఱకు పింగళి సూరనయే కవి. వేఱొక కొందఱకు భట్టుమూర్తియే కవి. ఇవన్నియు

J 927 ...erabad-27.

పాక్షిక విమర్శన పరిణామములు:- అట్టి పాక్షికత లేకుండ [illegible] తమ తమ యాశయములను వెలువఱిచి లోకమున కందిచ్చిన భాష కెంతేని పరిపోషము గలుగును. కావున సహృదయతతో నిష్పాక్షికమైన విమర్శనమునకుఁ గడఁగిన సలక్షణమై యౌచిత్యభరితములైన గ్రంథములే భాషలోఁ జిరస్థాయులు కాఁగలవను విషయమును నిస్సంశయముగ నెఱుఁగ వచ్చును.

శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యమును గూర్చిన విమర్శనమును గూర్చి కొంత తెలిపెదను. దీని నాంధ్రసాహిత్యపరిషత్తు ప్రకటించు నంతవఱకు శ్రీనాథుఁడు దీనిని రచించినాఁడనియే లోకమునకుఁ దెలి యదు. దీనిని బ్రకటించుటకు లభించిన తాటియాకు ప్రతి యొక్కటియే యగుటచే దీని ముద్రణమున గ్రంథపాతము లెన్నియో యేర్పడినవి. ఇది వెలువడిన వెంటనే విమర్శకులు దీని కొక ముద్ర వైచినారు. "దీనిలో చండాలీ బ్రాహ్మణబ్రువ సంయోగ శృంగారమతి మాత్ర ముగఁ బోషింపఁబడినది. ఇందు శ్రీనాథుని విషయలోలత్వ మతిమాత్ర మని తెలియుచున్నది" అనినారు. దానితో పాఠకలోకమునఁ బెక్కురు దానిని బఠించుట మానినారు. చూచువారైనను చండాలీ సుకుమారుల సంయోగ ఘట్టమును మాత్రమే చూచి వెనుక ముందులు వదలి వేయుచున్నారు. ఇది పాక్షిక విమర్శనమువలనఁ గలిగిన యనర్థము. శ్రీనాథుఁ డీప్రబంధము నెంత పవిత్ర మని తెలిపినాఁడో కనుఁడు.

"అభ్యుదయపరంపరాభివృద్ధియు నభిమతార్థసిద్ధియు సత్యధర్మక్రియాభివృద్ధియు నగునట్లష్టాదశవర్ణ సాగర్భంబుగా నత్యాశ్చర్యకరంబై నారచియింపంబూనిన కథానంవిధానంబు సకలపాపనిర్ముక్తంబై సర్వ వస్తుసంధాన సంయుక్తంబై [illegible] సర్వాగమానూనసంభావితసంస్తుత్యంబై [illegible] పరమేశ్వర

ప్రియంబై పార్వతీ మనోహరంబై శ్రీనాథ సేవితంబై బ్రహ్మరుద్ర దేవతాది సంస్తూయమానంబై శోభిల్లు నిష్పణ్యాచారిత్రంబు దశదోష వివర్జితంబై యుండ నానేర్చు విధంబున రచియించెద; నది యెట్టిదనినఁ బూర్వోక్త మార్గంబునఁ బరిపూర్ణంబై యథావిధి శోభిల్లు నిష్పణ్యా చారిత్రంబుం బోలినట్టి ధర్మక్షేత్రంబును మహాతీర్థంబును నగు గంగా కాళిందీ సంగమంబున ... శౌనకాదిమహర్షులకు సూతుం డిట్లనియె" ఈ వచన రచనా క్రమములో ఉపమానోపమేయ భావమును వ్యత్యస్తము గావించి, ఈ ప్రబంధమువలెఁ బరమపవిత్రమైన ప్రయాగక్షేత్రమున ననుటచే దీనిని శ్రీనాథుఁ డెంత పవిత్రగంథమని తెలిపినాఁడో చూడుఁడు. చండాలీ బ్రాహ్మణ బ్రువసంయోగ శృంగారవర్ణనముచే నిది యశ్లీలాకరమైనచో శ్రీనాథుఁ డిట్లనుటకు సాహసింపఁ గలఁడా? నాలుగువందల యేఁబది పద్యములలో ప్రతిజ్ఞానుసారముగ నష్టాదశ వర్ణనలు నిర్వహించి, శైవాగమ రహస్యముల నెన్నిటినో దెలిపి, తన పలుకును సర్వథా సత్యమనిపించినాఁడు.

ఈ ప్రబంధమున చండాలాంగనా సౌందర్యము నతిమాత్రముగ చిత్రించెననినారు. ఇచట చండాలాంగనా రూపచిత్రణము, కాదంబరిలో శుకమును గొనివచ్చిన చండాలాంగనా రూపచిత్రణమునకుఁ బ్రతిబింబము. ఈ ప్రబంధమున కాదంబరీ కావ్యానుసరణము విశేషముగఁ బాటింపఁబడినది. ఇట్లు వర్ణించుట దోషమైనచో నది భట్టబాణుని దోష మగును గాని శ్రీనాథునిది గాదు. కాదంబరీ విషయము అశ్లీలాకరము కాకున్న నిచటి యీ వర్ణన మెంత మాత్రమును గాదు. మఱియు నీ ప్రబంధమునందీ చండాలీ సుకుమార సంయోగ వర్ణన మేఁబదిపద్యములు మాత్రమే గలదు. మిగిలిన విషయ మంతయు శాంతరసపరిపోషకమే. ప్రథమ చతుర్థాశ్వాసములలో హార్యజుల యుద్ధమున రౌద్ర వీరరస భావములు, శివదూత యమదూతల కలహము

నందలి రౌద్ర వీరరసభావములు శాంత రసపరిపోషకములుగ నిరూపింపఁబడినవి. ద్వితీయాశ్వాసమున సుకుమార జననాదికము నిర్వహింపఁబడినది. ఏకావ్యమునందు నేకవిచేతను వర్ణింపఁబడని హేమంత శిశిరములత్యద్భుతముగఁ జిత్రింపఁబడినవి. ఇట్లే కావ్యమున మిగిలిన విషయములధికములు శృంగార రసభావనిబంధన మల్పముగనే గోచరించును. ఇట్టి యీ పవిత్రమయిన కావ్యమును సావధానమతితోఁ బాఠకలోకము పరికింపకుండుట పాక్షిక విమర్శనఫలమే యని పాఠకులకు నామనవి.

ఆంధ్రభాష సంస్కృత పదబాహుళ్యమై యాడంబరముతోఁ గూడి పఠక సామాన్యమునకు దుర్బోధమని యందురు. కాని మొదటి నుండియు మనభాష సంస్కృతమందలి ఇతిహాస పురాణ కావ్యాదికము ననువదించుచు వచ్చి, సంస్కృతభాషతో సర్వధా సన్నిహిత సంబంధము నలవరించుకొని యున్నది. 'దేశభాషలందుఁ దెలుఁగు లెస్స'యని యనిపించుకొనుటకు మూలకారణము మన తెలుఁగు కవులు సంస్కృత భాషను తగురీతిని మలచి తెలుఁగుకరువునఁ గూర్చి కవిత్వమువ కాక ప్రత్యేక మాధుర్యమును గూర్చుటయే సంస్కృతభాషలోఁ గల సకల సౌభాగ్యములు మన తెలుఁగున కవతరించినవి గావుననే తెలుఁగునకు దేశభాషలన్నిటను నుత్తమత్వమేర్పడినదనుట సత్యము. రచనకు మార్దవము ఓజస్సు సౌకుమార్యము మున్నగు నుత్తమగుణము లేర్పడవలయు ననిన సంస్కృతపదజాలమును జోడించినఁ గాని యది రానేరాదు. ఆ విషయమున నాఁడును నేఁడును గూడ మనవారు సిద్ధహస్తులే. అట్లు గాక యచ్చ తెలుఁగులో రచన సాగించిన దాని పేరయిన నెఱుఁగువా రుండరు. అచ్చతెలుఁగు కావ్యములైన యయాతి చరిత్రము అచ్చతెలుఁగురామాయణము నీలాసుందరీపరిణయము మున్నగు వాని పేరెఱిఁగిన వారు మనలో నెందఱు గలరు? సంస్కృతపద బాహుళ

మైన నన్నయ శ్రీనాథ పెద్దనల కవితను కాదనువా రెవరు గలరు? కావున రచనకు విశిష్టత ప్రత్యేకత గావలయుననిన సంస్కృత భాషాపద జాలమును నాఁడును నేఁడును గూడ జోడింపక తీరదు.

ఆంధ్రకవులలోఁ బ్రాచీను లెవ్వరయినను సంస్కృతపదజాల మును దమరచనలలో నుపయోగించిన నాపదము లన్నియు సంస్కృత భాషా వ్యాకరణావిరుద్ధములే. ఈనాఁడును మన తెలుఁగువారు సలక్షణ మైన సంస్కృతమునే యుపయోగింతురు. ఈనాఁడు భారతజాతీయ భాష కావలయునని యనుకొనుచున్న హిందీభాషను సంస్కృత పద ప్రచురము గావించుచున్నారు. వారికంటెను మన తెలుఁగు వారు సలక్షణమైన సంస్కృత పదములనే యుపయోగింపఁ గలరు. ఆంధ్ర భాష మొదటి నుండియు సంస్కృతమును విడనాడక వచ్చుచుండుటయే దీనికి మూలకారణము. సంస్కృత పదములను సలక్షణముగ నుపయో గించు మనము తెలుఁగు పదములను మాత్రము సలక్షణముగ నేల యుపయోగింపరాదు. తెలుఁగు భాషకుఁ గల వ్యాకరణము చాల చిన్నది. దాని నెఱుఁగుట కంతగ శ్రమపడు నక్కఱయే లేదు. కావున నాంధ్రభాషాభిమాను లందఱు దేశభాషలన్నిటియందు నుత్తమమైనది మధురమైనది యని గణింపఁబడుచున్న మన తెలుఁగుభాషకుఁ గల వెనుకటి గౌరవమును నిలుపఁ దలఁచిననాఁడు సలక్షణమైన గ్రాంథి కాంధ్రభాషయందే రచన సాగింపుఁడు. చిరకాలము నుండి గ్రాంథి కాంధ్రభాషాభివృద్ధికై కృషిచేయుచు, నమూల్యమైన గ్రంథములను దెలుఁగు వారి కందిచ్చి, తెలుఁగునేల నలుమూలల ఖ్యాతి గడించు కొనియున్న యీ పరిషత్తు పురోభివృద్ధికిఁ జేయూఁత నొసఁగి, పరిష దా శయములను ఫలింపఁ జేయుఁ డని మనవిచేసికొనుచు మీ నుండి సెలవు దీసికొనుచున్నాను.

ఓమ్ శమ్.

---

# ధూర్జటి యాధ్యాత్మికత

బండారు తమ్మయ్య

చ॥ అతులితభక్తి వర్ధిల్లి, యుదంచిత సత్కవితా విభూతిమై
శతకము క్షేత్రవృత్తమును జక్కనిరీతి రచించి, వానికిన్
బతిగను గాళహస్తి శివుఁ బ్రాకటభక్తి నొనర్చి సద్యశః
స్తుతమతియైన యాంధ్రకవిధూర్జటి ధూర్జటి సంస్మరించెదన్.

ఆంధ్రభోజుఁ డని వినుతిగాంచిన శ్రీకృష్ణదేవరాయల యాస్థానమలంకరించిన యష్టదిగ్గజములలో ధూర్జటికవి యొక్కఁడను విశ్రుతి సుప్రసిద్ధ మంటియున్నది. "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల గల్గె నీయతులితమాధురీమహిమ?" యని కృష్ణరాయలు నిండు సభలోఁ బ్రశంసింపఁ దెనాలి రామకృష్ణుఁడు "హా! తెలిసెన్ భువనైక మోహనోద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహారి సంతత మధురాధరోదితసుధారసధారలఁ గ్రోలుటం జుమీ!" యని తన సహజ వికటరీతిని బద్యమందలి తరువాయి భాగమును బూరించెననియుఁ బరంపరగా వినవచ్చుచున్నది. ఈ చాటువునందు రామకృష్ణుఁడు ధూర్జటి కారోపించిన వేశ్యాలోలత్వము కేవలము బూటకమేయని యది యాతని సహజ వికట హాస్యమునకే యాదర్శకముగాని వాస్తవికతకు నిదర్శనము కాదని ప్రాజ్ఞలోకము భావించుచునేయున్నది. ధూర్జటి కృతులలో మనకు లభ్యమయినవి శ్రీ కాళహస్తీశ్వర శతకము, కాళహస్తి మాహాత్మ్యము అను ప్రబంధము రెండుమాత్రమే. వీనిలో మొదటిది యాంధ్రమందలి శతక వాఙ్మయమునకు, రెండవది ప్రబంధ వాఙ్మయమునకు శిరోభూషణములయి వెలయుచున్న విషయము సర్వవిఖ్యాతము. శతకము భక్తిజ్ఞాన వైరాగ్యబోధకమయి పలుతావుల భూపాలురఁ గూర్చిన నిరసనములతోడను నిందలతోడను గూడి యుండుటచే నేటివారు కొందఱు, కృష్ణరాయలు ధూర్జటికవితను మనసార

మెచ్చినవాఁడయినను వైష్ణవమతాభిమాని యవుటచే, అల్లసాని పెద్దనాదులను మన్నించినట్లు శైవకవి యగు ధూర్జటిని గారవింపఁ డయ్యె ననియు నందుచే నాతఁడు విముఖత్వమును విరక్తిని జెంది కృష్ణరాయల నుద్దేశించియే తనశతకమున రాజనిందలఁ గావించియున్నాఁ డనియు నూహాములతో వ్యూహములఁ బన్ని "ధూర్జటి హృదయము" అను పేరితోఁ గొన్ని పద్యముల రచించి ప్రకటించుచున్నారు. కాళహస్తీశ్వర శతకమందలి రాజనిందలు, కవి భక్తి జ్ఞానవైరాగ్యములకుఁ బ్రాధాన్య మొసంగిన యాధ్యాత్మికసంపన్నుఁ డవుటచే సర్వసామాన్య దృష్టితోఁ జెప్పినవే గాని, తనయెడఁ జూపిన నిరాదరణమును బురస్కరించుకొని యే యొక్కభూపాలు నుద్దేశించి చెప్పినవి గావనియే నాయభిప్రాయము. పైని జెప్పిన యపోహము కృష్ణరాయలకుఁ గాని ధూర్జటికిఁ గాని యశోదాయకము కానేరదు. కృష్ణరాయలు రసజ్ఞుఁడయిన రాజసత్తముఁడు. ఆతనికి మతాభిమాన పూర్వక పక్షపాతముల నారోపించుట సమంజసము గాదు. పూర్వోక్తమయిన "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల గల్గె నీ యతులిత మాధురీ మహిమ" అను ప్రశంసను గృష్ణరాయలు ధూర్జటియెడఁ గావించినట్లు లాతరువాతఁ గొలఁది కాలములో వెలసిన ధూర్జటి మనుమలు కుమార ధూర్జటి, లింగరాజకవి, తమ కృతులలోఁ గ్రంథస్థ మొనరించుటచే నది సత్య మనక తప్పదు. దూర్జటికిఁ గృష్ణరాయల యాశ్రయము నాదరణము నుండినను లేకున్నను, ఆతఁడు మహాభక్తుఁడు విరాగియు నగుటచేఁ దన కృతుల నరాంకిత మొనర్చుట కొప్పనివాఁడు. నిక్కమయిన యాతని యేలిక, హృదయేశ్వరుఁడు శ్రీ కాళహస్తీశ్వరుఁడే. అట్టికవి తనకుఁ గాని మఱియొకనికిఁ గాని కృతియిచ్చువాఁడు కాఁడని కృష్ణరాయలు నెమ్మనమ్మున నుమ్మరమ్ముగ నమ్మియే యుండును. అందుచే నాతని కాకవి యెడ విరసత కవకాశమే లేదు. కేవలము తన సహజ రసజ్ఞతా మూలము

వనే యాతఁడు ధూర్జటి కవితను బ్రశంసించినది. ఇంతకు శతక కర్తయుఁ గాళహస్తి మాహాత్మ్య ప్రబంధకర్తయు భిన్నులని కొందఱు తలంచుచున్నారు. అది నిజము కాదని రెండింటిని రచించినది కృష్ణరాయల నాఁటి స్తుతమతి ధూర్జటిమహాకవియే యని, నా నిండు విశ్వాసము. అట్టి నమ్మిక కలిమి నీ యుభయ కృతులను బురస్కరించి కొనియే కేవలము "ధూర్జటి యాధ్యాత్మికత" యను విషయమును గూర్చి మాత్రమే నే నిప్పుడు కొంత ముచ్చటించుచున్నాను.

ధూర్జటి కవి తాను జీతబత్తెములు లేని శ్రీ కాళహస్తీశ్వరుని యాస్థానకవి నని, తనకవిత నాతనికే గాని మఱేనికి నీయనని మీఁదెత్తి నను బిరుదమును ముంజేతికంకణముగాఁ జేపట్టితి నని ప్రగల్భముగాఁ బ్రకటించికొనియున్నాఁడు ఈక్రిందిపద్యములోఁ జిత్తగించునది.

"సీనా సందొడఁ బొటుమాట వినుమా నీచేత జీతంబు నేఁ
గానిం బట్టక సంతతంబు మదివేడ్కన్ గొల్తు నంతన్నప
త్నా నీకంబున కొప్పగింపకుము, న న్నాపాటియే చాలుఁ దే
జీనొల్లంగరినొల్ల నొల్ల సిరులన్ శ్రీకాళహస్తీశ్వరా!" (ప 4)"నీకుం గాని కవిత్వ మెవ్వరికినే నీ నంచుమీఁదెత్తితిన్ జేకొంటిం బిరుదంబు కంకణము ముంజేఁ గట్టితిం బట్టితిన్ లోకుల్ మెచ్చ వ్రతంబు,నాతనువుకీలుల్ నేర్పులుంగాపుఛీ ఛీకాలంబుల రీతి దప్పెదుఁ జుమీ శ్రీకాళహస్తీశ్వరా! (ప 114). ఇట్లని యాతనికిఁ గవితాహంకృతిగలదనిగాని,ఎవరును స్తుతింప నేరని పరమేశ్వరునిఁ దాను తనకవితచే మెప్పింపఁ గలననెడి గర్వమాతనికిఁ గలదని కాని మనముతలంపరాదు."జలకంబుల్ రసముల్,ప్రసూనములు వాచాబంధముల్,వాద్యముల్ కలశబ్ధ్వాను,లంచితాంబర మలంకారంబు,దీప్తుల్ మెఱుంగులు,నైవేద్యము మాధురీమహిమగాఁ గొల్తున్నినున్ భక్తి రంజిల దివ్యార్చన గూర్చి నేర్చినక్రియన్ శ్రీకాళహస్తీశ్వరా (ప 50) అను పద్యమునఁ దన భక్తి రంజిత కవితారూపమున

దివ్యార్చన గూర్చెదనని చెప్పుచు మరల నావెనువెంటనే ఏలీలన్నుతి యింపవచ్చు నవమోత్ప్రేక్షాధ్వనివ్యంగ్య శబ్దాలంకార విశేషభాషల కలభ్యంబైన నీరూపమున్ జాలుం జాలుఁ గవిత్వముల్ నిలుచునే సత్యంబు వర్ణించుచో ఛీలజ్జింపరు గాక మాదృశకవుల్ శ్రీకాళహస్తీశ్వరా! (ప 51) అని వ్రాసి పరమేశ్వరనిజస్వరూపవర్ణనా విషయమునఁ గవుల స్తుతులెట్టుల సమర్థములగునది వివరించి యావిషయమునఁ దన యసమర్థతను గర్వరాహిత్యమును బ్రదర్శించియే యున్నాఁడు. ఇంతకునే ప్రయోజనము నర్థము నపేక్షింపక యూరక యాదేవదేవునికిఁ గవిత చెప్పుట తన జిహ్వకు నైసర్గికకృత్య మని యుద్ఘాటించినాఁడు "ఒక యర్థంబును నిన్నునే నడుగఁగా నూహింప నెట్లైనఁ బొమ్ము కవిత్వంబులు నాకుఁ జెంద వివియే మోయంటివా నాదు జిహ్వకు నైసర్గికకృత్య మింతియ సుమీ ప్రార్థించుటే కాదు కోరికలన్నిన్నను గాన నాకు వశమా శ్రీకాళహస్తీశ్వరా! (ప 65) దైనందిన జీవనవిధాన మెట్లుండవలెను? సౌఖ్యమన నెట్టిది? యను విషయములఁ గూర్చి ధూర్జటి భావన "దినముం జిత్తములో సువర్ణముఖరీ తీరప్రదేశామ్రకాననమధ్యోపల వేదికాగ్రమున నందంబునన్ బంకజాసననిష్ఠన్ నినుఁ జూడఁగన్నదివో సౌఖ్యంబు లక్ష్మీవిలాసినిమాయానటనల్ సుఖంబులవునే శ్రీకాళహస్తీశ్వరా (ప 35) అను పద్యమున ద్యోతకమగును. వీనిని బట్టి యాతని నైహిక వాంఛావిరక్తి, యాధ్యాత్మికాసక్తి ప్రకటితములు కాఁగలవు. రాజసేవాదికములఁ గూర్చిన నిందలు, నిరసనలకు నీదృశంబగు నాతని యాధ్యాత్మిక దృష్టియే యుద్బోధకము గాని యేరాజుల యెడను నాతనికిఁ గలద్వేష మందుల కెంతమాత్రము కారణము కాదనియే తలంపనగును. కాళహస్తీశ్వర శతకమందలి పద్యములన్నియు జాలవఱకిట్టి భావననే ప్రవ్యక్తము చేయుచుండును సప్తసంతానములు వెలయించిన వారి సుకృతము గూడ భగవత్కైంకర్య

మొనర్చిన పుణ్యాత్ముని పుణ్యమున కెన గాదని యాతని భావము. "తనయుం గాంచి, ధనంబు పాతి, దివిజ స్థానంబు గట్టించి, విప్రునకు ద్వాహము చేసి, సత్కృతికిఁ బాత్రుండై, తటాకంబు నేర్పునఁ ద్రవ్వించి, వనంబు వెట్టి మనసీ పోలేఁడు నీ సేవ చేసిన పుణ్యాత్ముఁడు వోవులోకము నకుఁ శ్రీకాళహస్తీశ్వరా (ప 1-12)

ఇంక నీతని ప్రబంధమును బరిశీలించినను నీతని యాధ్యాత్మికత బహుముఖముల నందుఁ బరిస్ఫుటమగుచుండును. "మనాక్ కావ్యార్థ సూచన"మ్మను నాలంకారిక మతమనుసరించి కావ్యమందలి ప్రథమ పద్యముననే కాళహస్తి శివలింగ స్తుతి గావించు సందర్భమునఁ దత్సేవ వలన నాక్షేత్రమునఁ దర్శించిన యే యేపూర్వ భక్తుల చరిత్రములఁ దాను గావ్యమున వివరింపఁబోవునో వారినెల్ల నొక పద్యముననే తాను ముందు సూచించినాఁడు. "శ్రీ విద్యా నిధియై మహామహిమచేఁ జెన్నై వసిష్ఠా జలూతా వాతాశన సామజాటవికగోత్రా దేవ నత్కీర రాజీవాక్షీ యుగ యాదవాధిపులకున్ శ్రేయస్కరంబైన యార్యావామాంగము, దివ్యలింగము మదీయాభీష్టముల్ సల్పెడున్" ఇంతేగాక ప్రతి యాశ్వాసారంభ పద్యమును దదాశ్వాసవర్ణితకథాసూచకముగ రచించినాఁడు. ఈతని కాళహస్తి క్షేత్రవర్ణనము ఇతరకవుల ప్రబంధములందలి పురవర్ణనములకు సర్వవిధముల విలక్షణముగ నుండి యాతని యాధ్యాత్మిక దృష్టికిఁ బ్రబలాదర్శకముగ నున్నది. అసలా క్షేత్రమే దక్షిణ కైలాస ప్రశస్తిగలది కదా!

సీ॥ సంసారపారదోచ్చాట నానలకీల కలుషసంచయ తామ్ర గంధకంబు
కామలతామూల కందకుద్దాలంబు సంకల్ప పాషాణ టంకముఖము
రాగ శాలివనాంకుర కడంగరీయంబు శంకాకళంక భుజంగనకులి
సవషునో గోరాజ నాసికారజ్జువు కోపనేత్రుణ విశిఖోపలంబు

గీ॥ దివ్యదేశిక హంసోపదిష్ట మార్గ, నిర్గుణధ్యాన సంధాన నిరుపమాన।
సౌఖ్యసంపన్న సాధక జననివాస మమృత లింగాకరము కాళహస్తి
పురము (ఆ. 1. ప17.)

అని కాళహస్తిపుర మమృతలింగాకర మని వర్ణించి "ఆడం జిత్రము వాడవాడ ఘనకుడ్య స్వర్ణ రత్నద్యుతుల్ చూడం జూడఁగ షణ్ముఖీకరణ తేజోరూఢిచిత్తైతుణ క్రీడాదుస్తరమార్గ సౌఖ్యరసవార్ధిం దేల్చుఁ దత్పట్టన క్రోడ క్షోణి నంటన్న నున్న పురముల్ కొండాట కర్హాంబులే" (ఆ. 1, ప. 18) అను పద్యమున నితర పురము లేవియు సన్నుతి పాత్రములు కావని చూపినాఁడు. ముక్తిదాయక పురమగుటచే నచ్చటి జంతు సంతతికిఁ గైవల్యమును బడయుటలో నుత్తమ మధ్య మాధమ స్థితులు లేవఁట. "అమితములైన జంతువుల కక్కడ నుత్తమమధ్య మాధమత్వము లరయంగఁ గాన మప వర్గరమాసతిఁ బెండ్లియాడుచో సమతయె గాని తత్పురము సాటిగ నన్యపురంబు లెన్నఁగా నమరునఁ టన్నహస్తి మశకాంతర మింతియు వాసి చూచినన్ (ఆ. 1. ప. 22) అచ్చటి పౌరుల యాంగజాగమ కళాక్రియలు గూడ నాధ్యాత్మిక విలాసములు గానే నిరూపితములయినవి. ఎలదోటల్ వనముల్ వధూ కుచము లద్రీంద్రంబు లాటికింటికిన్ ఫలముల్ నా తెలి లంగజాగమ కళాబంధంబు లిచ్ఛానసం బులు కోపంబునఁ బాయుటల్ తపము సంభోగంబు కైవల్య మందుల లీలాగతి నుండు మానవుల కెందుం గాన మీచిత్రముల్. (ఆ. ప 21) చాతుర్వర్ణ్యమునకు రాజయోగైక సామ్రాజ్య తత్పరతను శ్లేషానుప్రాణిత వర్ణనమున సమర్థించినాఁడు.

సీ॥ నైజంబులను నిత్య నైమిత్తికంబులు నడుపుచో బ్రహ్మార్పణంబుసేసి
సంగరహితబుద్ధి శాంతనవస్ఫూర్తి వైరివర్గంబు సంహారమాడి
ప్రబల మహార్థ ప్రభాసమానస్థితి కోశంబు లుండెడు కొలఁదు లరసి
యాతిథిత వాతాదల సమముగా నాత్మ ప్రయత్నంబులందుఁ దలఁచి

గీ॥ సంచరింతురు బ్రాహ్మణక్షత్రవైశ్యశూద్రులప్పేటసంతతభద్రహృదయ
నిరుప మానంద విహరణోన్నిద్రు లగుచు రాజయోగైక సామ్రాజ్య
రతుల భక్తి (ఆ.1. ప. 23)

ఇక్కడ వారకాంతసీగణము యోగి జనంబులుగను, గంధగజములు అవధూతవర్గముగను నిరూపింపఁబడినారు.

చ॥ పరిచితబంధ నైపుణి నపార కళానుభవ ప్రసక్తినా
ద రసవివేక సంపద సదా శుక వాక్యసుధానుభూతి మో
హరహితవృత్తిఁ బ్రస్ఫురదనంగరహస్యవిచారబుద్ధి న
ప్పురమునఁ గామినీజనులు పొల్తురు యోగిజనంబు పోలికన్ (ఆ.1.ప24)

మ॥ అరగంటం గనుఁగొంట మందగతిఁ బూర్ణాహంకృతిన్ బ్రార్థనా
కరభుక్తిస్థితి ముక్తలోక భయశంకావృత్తి నున్మత్తన
వ్యరతిన్సత్త్వసమగ్రతన్స్ఫురిత పద్మాభ్యున్నతి స్గంధమం
థరదంతావళికోటి యొప్పునవధూత ప్రక్రియం దత్పురిన్. (ఆ1ప25)

యోగులకు బాలోన్మత్త పిశాచ సామ్య మనుశ్రుతమేగదా! కేవల భక్తియోగమునందే గాక యష్టాంగయోగ, సిద్ధాసన ఉడ్యాన జాలంధరాదిక యోగబంధంబులందుఁ గూడ నీతఁడు బంధుర ప్రజ్ఞ గలవాఁడని తెలియుట కీతని కావ్యమునఁ బెక్కు దృష్టాంతములు గలవు. కాళహస్తి క్షేత్రమునకు నిజతపమున సువర్ణ ముఖరీనదిని గొని తెచ్చి యగస్త్య మహర్షి యానదీతీరమున శివలింగప్రతిష్ఠ గావర్చునపుడు కాళహస్తీశ్వరుని గూర్చి యామునివరుని ముఖమున దండకరూపమున నీతఁడు గావించిన స్తోత్రము (ఆ.1.ప.46) జిత్తగించునది. సర్వము శివ మయమను నాధ్యాత్మిక సత్యమును దృఢమ్ముగ నమ్మిన వాఁడవుటచే నీ కవివతంసుఁడు గావించు ప్రకృతి వర్ణనములలో నీతని యాధ్యాత్మికత మఱింత వెల్లివిరియుచుండును. ఉదయాద్రిపయి నుదయించునుడు రాజబింబమును శివలింగముగా నీక్షించు నీతని వర్ణనముం జూడుఁడు.

మ॥ ఉదయ గ్రావము పానవట్ట మభిషేకోద ప్రవాహంబు వా
ర్ధి ధరధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీప ప్రభారాజి, కౌ
ముది, తారానివహంబు లర్పిత సుమంబుల్ గాఁ దమోదూర సౌ
ఖ్యదమై శీతగభస్తి బింబ శివలింగం బొప్పెఁ బ్రాచీదిశన్ (ఆ.2.132)

మహాశివభక్తి సంపన్నుఁడయి యవతరింపఁ బోవు తిన్నఁడు గర్భస్థ శిశువుగా నున్నప్పు డాతని భావిభక్తి సూచకముగ నతని తల్లి తండ్రి శరీరమున గోచరించు లక్షణముల నీతఁ డిట్లు వర్ణించినాఁడు.

సీ॥ భసితాంగ రాగశోభా విలాసంబుతోఁ బ్రతివచ్చు నానన పాండుగరిమ
కంఠహాలాహల కాళిమచ్ఛవితోడ నెనవచ్చు గుబ్బచన్మొనలనలుపు
వరశివాకృతితోడ సరివచ్చు నణుకరం బనఁజాలి ఘనతరంబైననడుము
స్వస్వరూపవిచార సంప్రాప్తి శాంతితో మార్పడు చిత్తైకమౌనజడిమ
గీ॥ సరభసావంగ సంక్రీడ జరుగ నీక
డాహ్లాదము గర్భమున నున్న తనయుఁ డీశుఁ
డై ప్రకాశింపఁ గలఁడని యపుడ తెలుపు
కరణిఁ జెంపొందె నమ్మందగామినికిని. (ఆ. 3.ప. 22)

కాళహస్తీశ్వరుని సేవించి ముక్తిగాంచిన వారిలో మధురాపురీ వేశ్యామతల్లి వీరే మాణిక్యతల్లి తనయ లిరువురు యగు కావ్యారంభ పద్యమున రాజీవాక్షీయుగమని పేర్కొనబడినది. వారు బాల్యము నుండియు వారి వనితాధర్మముల నుద్బోధించు తల్లి వచనముల నెల్లఁ బెడచెవిని బెట్టి సహజ శివభక్తి సంపన్నలవుట.

ఉ॥ దారువనీ మునీంద్రకులదారభుజంగుఁడు, భక్తబల్లాణ
త్స్మారమణాంగనామణిభుజంగుఁడు, ముక్తి వధూభుజంగుఁడి
చ్ఛారచి తాంగ భూషణ భుజంగుఁడు, మాకుభుజంగుఁ డమ్మ ని
స్సార మనుష్యమాత్రుఁడు భుజంగుఁడుగాఁడిక మాట లేటికిన్
(ఆ 4 ప 41)

అని తమ దృఢనిశ్చయము నామెకు విన్నవింతురు. ఈ బాలికా మణులుతమ చిన్నతనమువనుమ్మెల తోట్లకుఁదల్లులొనగూర్చినమణి మయాలంకారముల వెఱఁగంది చూచునపుడు తెప్పలు నడల్పక తారక యోగమార్గరతులట్లు వానిని గన్గొన సాగిరని వర్ణించినాఁడు

చ॥ కనకపుఁ జేరు సోయగము గల్గిన ముత్తెపుఁ గొత్త తొట్లలో
నునిచి యనర్ఘ రత్నముల నొప్పగు గుత్తులు మోలె వ్రేలఁగ
ట్టిన వెఱఁగంది తెప్పలు నడల్పక తారకయోగ మార్గద
ర్శన రతులట్ల కన్గొనఁగ సాగిరి కన్య లనన్య చిత్తలై (ఆ 4 ప 12)

వారి బాల్య విద్యాభ్యాస వర్ణనా సందర్భమునఁ గూడ నీ క్రింది విధమున వారి శరీర సౌందర్యము నభివర్ణించినాఁడు.

సీ॥ శివ పూజనాసక్తిఁ జిన్ని చన్నుల పెక్కువయుఁ
బ్రత్యూహంబును నయము నూపు
శైవాగమాంతర జ్ఞానంబుఁ దనులతా ప్రభయు నంతంతకు నభినవముగఁ
బార్వతీ ప్రాణేశ భక్తియుఁ గూకట్లు వెలసి నాఁనాటికి వృద్ధిఁబొంద
వారకులాచార వాసనా బాల్యంబు లొకపూట కొకపూట కుడిగిపోవ

గీ॥ శాంభవంబైన తేజంబు శైశవాప
గమవయోగణ్య లావణ్య గౌరవంబు
హృదయమున సంగకంబుల నుదయమొదవఁ
జదుఁబోవుదు రిరువురు మదవతులును (ఆ 4 ప 23)

ధూర్జటి కవితయందలి యాధ్యాత్మికతను దిఙ్మాత్రముగ సూచించుటయే నా ప్రస్తుతోద్యమముగాని దానిని సమగ్రముగ వివరించుట గాని యాతని కవితయందలి యితర సలక్షణముల విశదీకరించుట గాని కాదు. సత్కవిత్వ మభ్యసించు వారి కీతని కాళహస్తి మాహాత్మ్యము మేలుబంతియని పండిత వర్యులు బాహాటముగఁ బ్రక

టించియే యున్నారు ధూర్జటి యాధ్యాత్మికతకు మూలకారణ మాత నికిఁ గాళహస్తీశ్వరుని యెడఁగల సహజభక్తియే శా. దంతంబుల్ పడ నప్పుడే తనువునన్ దార్ఢ్యంబు పోనప్పుడే కాంతాసంఘము రోయనప్పు జరా. కాంతంబు గానప్పుడేఁ వింతల్ మేనఁ జనింపనప్పుడె కురుల్ వెల్వెల్ల కానప్పుడేఁ చింతింపన్ వలె నీపదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా అని యాతఁడు లోకమును హెచ్చరించినాఁడు. ఆతని యుద్బోధమును గమనించి శివభక్తితో పాటు ధూర్జటి యాధ్యాత్మికతా దృష్టిని గూడఁ గొంతవఱకయిన నలవరించికొని యాంధ్ర కవిపండిత లోకము తరించుఁ గావు తమని యభిలషించుచు నీ వ్యాసమును ముగించుచున్నాను.

ఓంతత్సత్.

---

# హరవిలాస విమర్శనము

"గాండీవి"

హరవిలాస ముపలబ్ధములైన శ్రీనాథుని ప్రబంధములలో నొకటి. ఇది భీమఖండానంతర కృతియని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారును భీమఖండమునకుఁ బూర్వకృతియని శ్రీ చాగంటి శేషయ్య గారును వ్రాసిరి. కొందఱు దీనిని గాశీఖండానంతర రచన మని తలంతురు. కాశీఖండము నందలి "కంచియుఁబవతీ లసమూస్త్రిఖడ్గలతిలు" అను పద్యపాదము శ్రీనాథుని కాంచీపురీ పరిచయమునకు నిదర్శనము. హర విలాస కృతిపతి కాంచీపుర నివాసి. కావున హరవిలాసమును గాశీ ఖండమునకుఁ బూర్వకాలిక గ్రంథమనుటయే లెస్సయని తోఁచు చున్నది.

1. చిఱుతొండనంబికథ :— హరవిలాసమునందలి కథలలోఁ జిఱుతొండనంబి కథ మొదటిది. దీనికి మూలము బసవపురాణము నందలి సిరియాలుని కథ. అందు సూచనా మాత్రములుగాఁ జెప్పఁ బడిన విషయములు ప్రపంచించియు నూతన కల్పనలు చేసియు శ్రీనాథుఁ డీకథకుఁ బుష్టిచే కూర్చినాఁడు.

"చెఱకురసంబు నీప్సిత వస్తువులును, నఱలేక యందిచ్చి కఱ కంటు (పు) గొలువ" అను ద్విపద నాధారముగాఁ గొని మిండజంగము రాక చిఱుతొండఁడు చెఱకుఁ గట్టలు తెచ్చుట మున్నగు విషయ ములు విపులముగా వర్ణింపఁబడెను. "అది గాక హరుఁ డిరువది యొక్క దినము, వదిగొని కంచిలో వాన గుర్పింప" అను ద్విపద సూఁతగాఁ గొని వర్షవర్ణనము చేయఁబడినది.

"ప్రేంకణము లాడెడి వేలుపు లేమఁ జూచియే, చెమరి చితించు గేళి సరసీరుహాము త్తి" పార్వతి శివుని వేఁడుకొనుట నూతన కల్పన లలో నొకటి. చిఱుతొండని భక్తినిఁ బరీక్షించు తలఁపు పార్వతీ పరమేశ్వరుల కంకురించుట క్రీకల్పనము బీజప్రాయమైనది. దుర్వాస

శ్శాపమునఁ దుంబురుఁడు చిఱుతొండఁడుగాజన్మించుట రెండవ కల్పన. దుర్వాసశ్శాపమునే యేల చెప్పవలెను ? మఱియొక ఋషినే యేల చెప్పరాదు ? అని ప్రశ్నింపవచ్చును. ఎవరినిఁ జెప్పినను నిట్లు ప్రశ్నింప నవకాశముండు నను సమాధాన మవిచారిత రమణీయము. చిట్ట మిడువఁగా లేళ్ళు బెదరెనని దుర్వాసుఁడు తుంబురుని శపించినాఁడు. ఇట్టి యత్యల్పకారణమునకు శపించిన వాఁడు ముంగోపి కావలయును గదా ! అట్టి వారిలోఁ బ్రసిద్ధులు దుర్వాసోవిశ్వామిత్రులు. వీరిద్దఱిలో దుర్వాసునే యెందులకు గ్రహింపవలెను ? గ్రంథము హారవిలాసము. దుర్వాసుఁడు హరాంశ సంభవుఁడు. ఇంతే కాక హారవిలాసమున సముద్ర మథన కథలో దుర్వాసశ్శాప ప్రసక్తి రానున్నది. కాన నిచ్చటఁ గూడ నతనినే చెప్పుట యుచితతరముగదా ! ఈశ్వరుఁడు సిరియాలునిఁ బార్వతి తిరువెంగనాంచిని బోధించి కార్యవిముఖత నాపాదింప యత్నించుట మూఁడవ కల్పనము. ఇది వారి భక్త్యతిశయములు గూఢమూలము లొనర్చుట కుద్దిష్టము. శివుఁడు సిరియాలునకు మూర్ఛను దెప్పించిన నాల్గవ కల్పనము విభూతి మాహాత్మ్య ప్రతిపాదనార్థము.

బసవపురాణమున నీశ్వరుఁడే కపటయోగి రూపమున వచ్చి "సిరియాలుఁ గరుణాభిషిక్తుఁ జేయుచును, నరమాంస మొక్కొక్క వెరవున నడిగి' నట్లు చెప్పఁబడినది. చిఱుతొండఁడే జంగమాన్వేషణము చేసి వృద్ధదంపతుల రూపములతో నున్న పార్వతీ పరమేశ్వరుల నింటికిఁ గొనిపోయినట్లు హారవిలాసమునఁ గలదు. ఈ మార్పుచేఁ జిఱుతొండని జంగమ పూజా తాత్పర్యము ద్విగుణీకృత మగుచున్నది. శివుఁడు "కుడుతు నాబంతి నిలుతేఁడుఁ గొడుకుఁ గుడుప" అని చిఱుతొండనితో నన్నట్లు శ్రీనాథుని రచన. ఇలుతేఁడు కొడుకును భుజించు చుండఁగా భుజింతునను నర్థమే కాక యిలుతేఁడును, గొడుకును నిద్దఱును భుజించు

చుండగాఁ భుజింతునను రెండవ యన్వయమునకును వీలుండునట్లు శ్రీనాథుఁడు వాక్యము నిర్మించినాఁడు. "నరమాంస మొక్కొక్క వెర వున నడుగ" అను సోమనాథుని ద్విపద కావ్యమునందలి "వెరవు"ఇట్లు బహిర్గత మొనర్పఁబడినట్లు చెప్పనగును. చిఱుతొండఁడు 'భరిత భోజ నంబుగా వడ్డించి' నట్లు కలదు. భరితభోజనము శైవ సంప్రదాయము నకు సంబంధించినదై యుండును. దీని తత్త్వము "శైవాగమ విశా రదులు" నడుగవలసియున్నది.

2. కుమార సంభ వాంధ్రీకరణము :- గౌరీ కళ్యాణము కాళి దాసుని కుమారసంభవమూలకము. అందలి యేడు సర్గలలోఁ గల 532 శ్లోకముల నుండి 322 శ్లోకములను, సప్తమసర్గ నుండి మూఁడు నాలుగు శ్లోకములను గ్రహించి యీ కథను శ్రీనాథుఁడు రచించెను. "అభ్యర్థనాభంగభయేన సాధు ర్మాధ్యస్థ్య మిష్టేఽప్యవలంబతేఽర్థే" అని హిమవంతుఁడు శివు నర్థింపమికిఁ గాళిదాసు చెప్పిన సమర్థన ముపే క్షింపఁబడెను. ఇంద్ర మదన సంవాదములో శ్లోకముల యుత్తరార్థ ములు పరిత్యజించియు మూఁడు నాలుగు శ్లోకముల నొక సీసమున సంగ్రహించియుఁ గథ వేగ వేగముగా నడుపఁబడినది. కొన్ని మనో హార శ్లోకము లాంధ్రీకరింపఁబడలేదు.

"అనన్య భాజం పతిమాప్నుహీతి" అని శివుఁడు పార్వతిని దీవించినట్లు కుమారసంభవమున నుండఁగా "సరిలేని మగనిఁ బడ యుము" అని దీవించినట్లు శ్రీనాథుఁడు మార్చినాడు. గంగాదేవి శివ పత్నియగుట లోకప్రసిద్ధమగుటచే శ్రీనాథుని మార్పు సముచితమగు చున్నది. "ఈ కాంతతోడ మందాకినీవాహిని, సవతి కాఁగల దేమి చందముననొ" అని నారదుఁ డన్నట్లు శ్రీనాథుఁడు చెప్పుట యీదృష్టి తోనే యని యూహింపనగును. ఇట్లే నైషధమున "దేవీపవిత్రిత చతుర్భుజవామభాగా" అని సరస్వతి విష్ణుపత్నిగాఁ జెప్పఁబడియున్న

విషయము లోకయాత్రికి విరుద్ధమగుటచే శ్రీనాథునిచే "చతుర్భుజుని కోడలు" అని మార్పఁబడినది. ఔచిత్య సంపాదనమున కిట్టి మార్పు లావశ్యకములు.

కాళిదాసుని రతివిలాపఘట్టమునఁ బునః పునర్దీప్తి దోషము కలదను నాలంకారిక వచనమును స్మరించియో యేమో శ్రీనాథుఁ డీ ఘట్టమును బాగుగా సంక్షేపించినాఁడు. పద్యములలో వ్రాయఁదగిన భాగములు గూడఁ దేలికపాటు వచనములోనికిఁ బరివర్తించినట్లు చెప్పనగును.

పార్వతి తపస్సున కేఁగుట మాయావటుని శివనింద మున్నగు భాగములు హృద్యములుగాఁ దెనిఁగింపఁబడెను. మచ్చునకొక్క యుదాహరణము చూపెదన.

శ్లో॥ వపు ర్విరూపాక్ష మలక్ష్య జన్మతా
దిగంబరత్వేన నివేదితం వసు,
వరేషు యద్బాలమృగాక్షి మృగ్యతే
తదస్తి కిం వ్యస్తమపి త్రిలోచనే

ఉ॥ పుట్టువు వెఱుంగ నెవ్వరికిఁ బోలదు మూఁడవ కన్నుఁ జూచి చే
పట్టఁడు వెఱ్ఱివాఁడయినఁ బ్రాణహరుండఁట జంతుకోటికిఁ
గట్టిన తోలుచీర కలకల్మిఁ బ్రకాశము సేయుచున్న దె
ప్పట్టునఁ జూచినన్ శివుని బైసి యెఱుంగఁగ రాదె భామినీ.

"దిగంబరత్వేన నివేదితం వసు" అని కుమార సంభవ శ్లోకమున నుండఁగా "కట్టిన తోలుచీర కలకల్మిఁ బ్రకాశము సేయుచున్నది" అని శ్రీనాథుఁడు శివుఁడు తోలు కట్టుకొనునని మార్చినాఁడు. దిగంబరుఁడు వసుహీనుఁడగుటకంటె విరాగియగుటకే యవకాశ మధికముగా నుండును. తోలుచీర ధరించుననుటచే నతని వసుహీనత ప్రస్ఫుటమగుచున్నది. కావున శ్రీనాథుని రచనము రమణీయ

తరము. 'తోలుచీర' అనుట నీచార్థద్యోతకము చర్మాంబరధారియని చెప్పినచో నీస్వారస్యము రాదు" ప్రాణహరుం డట జంతుకోటికిన్' అనునది యమకాలంకము. వేషమెట్లున్న నేమియనుకొన్నను ప్రవర్త నము గూడఁ బ్రాణాంతక మైనదేయను నర్థము మూలాతిశాయి మనోజ్ఞముగాఁ బొందుపడియున్నది. ఇట్లు మాయావటు నన్నందు లకుఁ బార్వతి కవశ్యము క్రోధ ముదయింపఁ గలదను భావము "భామినీ" అను సంబోధనము వ్యక్తము చేయుచున్నది. "కోపనా సైవ భామినీ" (అమరము) "భామ్యత్యవశ్యం కుప్యతి భామినీ, భామ క్రోధే" అని గురుబాల ప్రబోధిక.

కపటవటుని శివనిరసనమునకుఁ బార్వతి యొసఁగిన సమాధాన ములు కుమార సంభవమున నుండఁగా శ్రీనాథుఁడు వాని నెల్ల నుపే క్షించినాఁడు. దీనికిఁ గారణము నరయవలసియున్నది. కిరాతార్జు నీయ కథలో వృద్ధ బ్రాహ్మణుఁడు వృద్ధశ్రవు నెంత నిరసించినను" అత్యంత ధీరోదాత్తుండగు పాండుపుత్రుఁ డూరక తపంబు సేయుచుండె నని శ్రీనాథుఁడు రచించుటను బట్టి కుత్సితాక్షేపణము లుపేక్షామాత్ర దండ్యము లను తలంపుతో ధీరోదాత్తయగు పార్వతి సమాధానములు చెప్పనట్లు శ్రీనాథుఁడు కథ నడిపె నని తోఁచుచున్నది. హరవిలాసము భీమఖండమున కైదేండ్ల పూర్వాపరములలో రచితమైనట్లు తలంప వలసియున్నది. కావున నాకాలము నాఁటి శ్రీనాథుని మనస్తత్త్వ మీ క్రింది భీమఖండ పద్యమువల్లఁ దెల్లమగుచున్నది.

గీ॥ నికటమున నుండి శ్రుతిపుట నిష్ఠురముగ
నదరి కాకులు బిట్టు పెద్దఱచినప్పు
డుదధికాయంచ యూరక యుంటలెన్స
సైఁపరాకున్న నెందేనిఁ జనుట యొప్పు.

ఈ పద్యమును బట్టి పై రీతి రచనములలో శ్రీనాథు నాత్మీయతా ముద్ర సైతము కలదని యూహింపవనగును. "ఉదధిరాయంచ యూరక యుంట లెస్స" అనునది యర్జునుని విషయమునను "సైఁపరాకున్న నెందేనిఁ జనుట యొప్పు" అనునది పార్వతి విషయమునను ననుసంధింపఁ బడెనని ఫలితార్థము. పార్వతి మాయావటుని నిరసించి పోవుట మూలమునందే కలదు. (కుమార. 5-84.)

సప్తఋషులు హిమవంతుని కడ కేఁగుట గౌరీకళ్యాణము మున్నగునవి సముచితముగ సంఘటింపఁబడెను. అష్టమ సర్గమునఁ గాళిదాసు విశ్రృంఖలముగా వర్ణించిన పార్వతీ పరమేశ్వర శృంగార మనౌచిత్యపూరితమై యున్నది. శ్రీనాథుఁ డౌచిత్యము నాదరించి మూఁడు నాల్గు శ్లోకముల పరివర్తనముతో ముగించుట ప్రశంసార్హము.

3. దారుకావనవిహారము :— ఇందు "యం సర్వశైలాః" అను కుమార సంభవ పద్య మాంధ్రీకరింపఁబడెను "మహిమండలమున కుమానదండము మేను" అనునది పూర్వాపరౌ వారినిధీ విగాహ్య స్థితః పృథివ్యా ఇవ మానదండః అను కుమారసంభవ శ్లోక పాదముల కను సరణము "తలమీఁది చదలేటిదరి మీలఁ దినఁ జేరుకొంగలు చెలఁగి కొంగొంగు రనఁగ" ఇత్యాదిపద్యము శివుని భైక్ష్యకాల వేషమును జమత్కారముగాఁ జిత్రించుచున్నది.

4. సముద్ర మథన హాలాహల భక్షణములు :—

ఇందలి వినాయక పూజ భీమఖండమూలక మఁట. చంద్రుఁడు లక్ష్మి కగ్రజుఁడను విషయము సుప్రసిద్ధము. భాగవతమున నిట్లే చెప్పఁ బడినది. (అష్టమ 265, 266 గద్య పద్యములు) "అన్నన్న మొగము వెన్నుని, యన్నన్న జయించు" (విజయ) "చిన్ని వెన్నెలకందు వెన్ను దన్ని సుధాబ్ధిఁ బొడమిన చెలువ తోఁబుట్టు మాకు" (మను) మున్నగు ప్రయోగములు దీనినే యనుసరించుచున్నవి. హారవిలాసమున లక్ష్మి

పుట్టున రెండు గడియలకుఁ జంద్రుఁడు పుట్టినట్లు చెప్పఁబడెను. (6-78, 79 వ.) దేవదానవులు "ఇప్పదార్థంబు మాకుంబంచి పెట్టుము" అని మోహినిని గోరఁగా నామె "నానేర్చిన విధంబున సుధారసంబు వడ్డించెద" అనుట చమత్కారముగా నున్నది. "నానేర్చు కొలఁది మీకును, మానుగ విభజించి యిత్తు" (8 స్క-311) అని భాగవతమునందును నిట్లే కలదు. మోహిని వడ్డనలోని "పంక్తి మధ్యంబున నిల్చి కంకణ ఝుణ ఝుణత్కారంబు తోరంబుగా" ఇత్యాది వచనము భీమఖండమున నన్నపూర్ణ వ్యాసాదులకు వడ్డించినప్పటి రచనమును బోలి యున్నది.

5. కిరాతార్జునీయము :— దీనికి మూలము నన్నయ భారతారణ్య పర్వము. ఇంద్రుని గూర్చి యర్జునుఁడు తపము చేయుచుండఁగా నతఁడు వృద్ధ బ్రాహ్మణ వేషముతో వచ్చి యింద్రుని నిరసించి నట్లున్న కల్పనము, కపటవటువు పార్వతికడకు వచ్చి శివుని దూషించిన కుమారసంభవ కథ కనుసరణమని తోఁచుచున్నది. "ఆ సహస్రాక్షుని యాత్మ సంశుద్ధికిఁ బరమ సంయమి యింటి :పంచసాక్షి" ఇత్యాది పద్యములు హృద్యములు. అర్జునుఁడే మాయాభిల్ల రూపమున నున్న శివునితో సూకరమును గూర్చి తగవాడినట్లు భారతమున నుండఁగాఁ దపస్సు చేయుచున్న యర్జునుఁడు స్వల్పవిషయమునకుఁదగవు పెట్టుకొనుట యుచితము కాదను తలంపునఁ గావలయు శ్రీనాథుఁడు కిరాతుఁడే తగవాడినట్లు మార్చినాఁడు. ఇది యెంతయు సముచితము. శివుఁడు ఫల్గును నవహ్యాతగాండీవు నొనర్చినట్లున్న భారతకథను విడిచి యతఁ డీశ్వరుని మౌళిపై గాండివముతోఁ దాడించినట్లు కల్పించినాఁడు. అప్పుడు "వడఁకుం గుబ్బలి కుమారి వడ వడ వడఁకి"నఁదట 'వడకుం గుబ్బలి' సాభిప్రాయము. "కఱకు వెంద్రుకలలోఁ బఱచు మందాకిని సుకుమార దేహంబు స్రుక్కఁబాఱె" అను పద్యమున నప్పటి శివుని

మూర్తి రమ్యముగా వర్ణింపఁబడెను. శివుని భావాపీడనమునచే నర్జునుఁడు మూర్ఛిల్లె ననువిషయము వదలఁబడెను. అర్జున కృతవరమేశ్వర స్తుతి సార్వ విభక్తికముగా వ్రాయుటకుఁ గారణ ముదాహరణకావ్యముల ప్రభావము కావచ్చును,

6, నివాతకవచకాలకేయుల వధ :— ఈ కథకు మూలము నన్నయ భారతారణ్యపర్వము.

ఉ॥ ఈ రథమెక్కి తొల్లియ మహేంద్రుఁ డనేక సహస్ర సంఖ్య దే
వారుల వృత్రశంబర బలాదుల నుద్ధతులన్ జయించె నీ
వారి విభేది నీవును బలాఢ్యుఁడవై వధియింపుము గ్రమా
యారతులన్ నివాతక వచాసురులన్ సమరాంతరంబునన్

(అరణ్య 4-57)

సీ॥ ఈ రథంబెక్కి మున్నింద్రుఁడు నిర్జించె
శంభన్మహార్థత్యు జంభదైత్యు.

ఇత్యాది సీసముగాఁ బైనన్నయ పద్యము వివరింపఁ బడెను. ఇట్లే ముక్కాలు మువ్వీసము నన్నయ రచనమే శ్రీనాథుఁడు గ్రహించి యీ కథ రచించెను. స్వతంత్ర పద్యములు కొలఁదిగాఁ జేర్పఁబడినవి. (7-156, 159, 166, 175 మొ॥)

7. శ్రీనాథు నాత్మీయత :— 'అనర్ఘ్యమర్ఘ్యేన' అని కుమార సంభవ శ్లోకమున నుండఁగా "అతిథియై యున్న శంభున కర్ఘ్యమిచ్చి" అని వ్రాయుట శ్రీనాథు నతిథి సత్కారాభిలాషకు నిదర్శనము.

"గీతాంతరేషు శ్రమవారి లేశైః" అను దానిని "దేసిక గాన మార్గములఁ దిన్నని రీతులఁ బాడి పాడి" అనియు "శ్రుతాప్సరోగీతిర పిక్షణేఽస్మిన్" అను దానిని "అచ్చరలు పాడుహిందోళ మాలకించి" అనియు రచించుట శ్రీనాథుని సంగీత సంప్రదాయజ్ఞతకు దేశి సంగీత ప్రీతికి ద్యోతకమని తోఁచెడి. "దేశీ — స్త్రీ — గాన సముదాయః

గ్రీష్మర్తౌ మధ్యాహ్నః — సంగీత దర్పణమతే హిందోళ రాగస్య భార్యా, తస్యా గాన సమయః యామయుగళమ్" (శబ్ద కల్పద్రుమము) "శిశిరస్య వసంతస్య సంధా హిందోళ రాగకః" ఇత్యాదులు చూడ నగును.

దారుకావన విహారమునందలి లింగోద్భవ ఘట్టము శ్రీనాథుని విషయలోలతకుఁ దార్కాణముగా శ్రీప్రభాకరశాస్త్రిగారు తలంచుట సరికాదు. 'ఆగమజ్ఞాన నిధి' యగు శ్రీనాథుఁడు దీనిలో నౌచిత్య విచారము చేయఁదగదని తలంచియుండును. పాల్కురికి సోమనాథుని లింగోద్భవ దేవగద్యాది కృతులు శ్రీనాథునకు మార్గదర్శకములై యుండవచ్చును. వేయేల శ్రీ శాస్త్రిగారే హరవిలాస పీఠికలోనీఘట్టమున నౌచిత్య చర్చ సంగతము కాదనియు శ్రీనాథుఁ డీరచనలో నౌచిత్యి నంతగాఁ గోల్పోలేదనియు వ్రాసియున్నారు కావున విస్తరమ నావశ్యకము.

8. అనుసృతులు :—

1. "అక్షయ శరధు లివుడు యుగాంత కాలరిక్తంబైన శరధులుం బోలె నున్నయవి" (అరణ్య.)

శరధులు యుగాంత వేళా, శరధులునుం బోలె నయ్యె శర శూన్యంబుల్ (హర.)

2. "వారిఁ జంపుదు నొంపుదు, భంగపరతు నిడుమ పఱుతుఁ జెఱుతు (విరాట.)

"వాని భంజింతు నాతని మానమడతు నతని నిర్జింతు నాతని నతికరింతు (హర.)

3. ఇనుమంత బూఁడిద నొసలఁ బూసినను సమసలక కొండంత మఱలొందు (బసవ.)

ఆవగింజంత బూదిమైన లఁదిగొనిన వెలఁది గుమ్మడి కాయంత వెఱ్ఱిపట్టు (హర.)

4. ఉద్దామ ద్యుమణిద్యుతి వ్యతికర ప్రక్రీడ దర్కోపల జ్వాలా జాల జటాల జాంగలతటీ నిష్కూజ కోయష్టయః (అనర్ఘ)

ప్రాలేయాహిత సంప్రదీప్త కిరణ ప్రక్రీడ దర్కోపల జ్వాలా జాల జటాల జాంగలతటీ వాచాల కోయష్టియై (హర)

5. మకరంద మానిమై మఱచిన గొనయంబు వెడమోయఁ గడివోని వింటితోడ (ఉ.హ.)

కాంతాజనంబుల కటివంక బొమలతోఁ బ్రతివచ్చు పుష్ప చాపంబుతోడ (హర)

శ్రీనాథు ననుసరింపని తదనంతర కవియే లేఁ డనవచ్చును.

1. పవన ప్రేంఖోలన ప్రక్రియా, వనరోదంచిత సాగసౌరభ రసవ్యాలోల రోలంబముల్ (హర)

పవమాన ప్రేంఖణ ప్రక్రియా, వనరోదంచిత సార సౌరభ రసవ్యాలోల రోలంబముల్ (శృ. శా.)

2. చెక్కు గీటిన వసవల్చు చిఱుతవాని (హర)

చెక్కు గీటిన వసవల్చు శిశువు లెదురె (జైమిని)

3. అఘమర్షణ స్నాన మాచరించి (హర.)

అఘమర్షణ స్నాన మాచరించి (మను.)

4. వికటపాటల జటామకుటికాభారంబు కఱకైన జంజుపు
నెఱులు గాఁగ (హర)

జడగొప్పు కేకిపింఛపుఁ ద్రాటి చుట్టగా
విసరు హాసను రేఖ పేఁకెగాఁగ (కాలహ.)

5. 'సెలమేటి తెలిసీటఁ జిఱుబంతి పసపాడి' (హర 5-38) అను పద్యమే ధూర్జటి చెంచు స్త్రీలవర్ణనలకు హస్తావలంబ మొసఁగెనా! యని యాలోచింప వలసియున్నది.

ముద్రిత సంస్కార పరామర్శము :—

ఆంధ్రగ్రంథములు సుపరిష్కృతములు కామింజేసి వాటిల్లు చున్న యనర్థము పండితులకు విదితమే. 1939 లో "ఆర్. వేంకటేశ్వర-అండు-కో" వారిచేఁ బ్రకటింపఁబడిన హరవిలాసమును శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించి పీఠికతో వెలయింపఁ జేసిరి. వారి ముద్రిత సంస్కార మిటఁ గొలఁదిగాఁ బరామర్శింపఁ బడుచున్నది.

గ్రంథములలోని యతిప్రాసాది నిబద్ధస్థలములయందలి ప్రయోగములను బట్టియు గ్రంథకర్త స్వభావమును బట్టియు నాయాగ్రంథములను సంస్కరింపవలసియుండును. "బాహాబలాటోప పరిపాటి మెప్పించి (7-144) అనుచో 'మెప్పించి' ముద్రితము. "మెచ్చించెద వే నపుడు నిన్ను సేబాసందుక్" అని హరవిలాసముననే 'మెచ్చించు' యతిస్థానగతముగాను "మెచ్చించు తెరల మంజిడి, పచ్చడములు (శృ. నై. 7-155) అని నైషధమునఁ బ్రాసగతముగాను శ్రీనాథుఁడు ప్రయోగించి యుండఁగా 'మెప్పించు' నిల్పుట సరియని తోఁపదు. 'మెప్పించు' లోని పత్వమును నిర్వహించు ప్రాచీన కవిప్రయోగము మృగ్యము. ఇది తప్పు కాదు గాని శ్రీనాథ సమ్మతమగుట నిరాధారము "ఏమిరాకొంకక పెట్టు జంగములకుఁ హేరాళ మిష్టాన్నముల్" అనుచో "ఏమిం గొంకక" కవిపాఠమనుటలో క్షతి కానరాదు. "ఒక వ్రేలి జుట్టు వెండుంగరంబు" అను దానిని "ఒక్క వ్రేలికి వెండియుంగరంబు" అని శ్రీ శాస్త్రి గారు సవరింపనక్కఱలేదు. (7-12) దేశ్యాకారసంధులు తిక్కన భారతమూలకములు. "నోరన్నుచ్చులు గమ్మనై పడఁక" (2-83) అని వావిళ్ళ ముద్రణమున సరిగా నుండఁగా శ్రీ శాస్త్రిగారి ముద్రణమున గణభంగము వాటిల్లియున్నది. వావిళ్ళ ముద్రణమున 'ముష్టాముష్టి' అని యుండఁగా శ్రీ శాస్త్రిగారు "ముష్టీ ముష్టి" అని ముద్రింపించిరి.

నన్నయ యతిస్థానమున "ష్టా" నుంచి ప్రయోగించెను. ముగ్ధబోధ వ్యాకరణమున రూపము సాధింపఁబడెను.

కొన్నిచోట్ల వైరిసమాసములు ముద్రితములయ్యెను. "ప్రతి దినమ్మును గపురదీపములు వేయు" (పీఠిక 1-10.) ప్రతిదినమ్ముఁ గపు రపు దీపములు వేయు" అని వేఱొక ముద్రణమునఁ గలదు. అదియే గ్రాహ్యము. "విద్యుత్తండంబులు" (5-40) "కైవారపదానుసారకమ నీయముగా" (6-9) అనుచోట్ల నున్న తండకైవార శబ్దములు సంస్కృత పదము లనుటలో నభిప్రాయభేదములు గలవు. తండ శబ్దమునకు సమూహమను నర్థము సంస్కృత కోశములలోఁ జూపఁబడలేదు. "తండ—పుం — తడి — అచ్ — — ఆహతౌ" అని వాచస్పత్యము. 'దండ' శబ్దమునకు సమూహ మను నర్థము శబ్దరత్నాకర సూర్యరాయ నిఘంటువులలోఁ జూపఁబడెను. "దండ—దండవత్ స్థితే రవికారా దే, సంఘాతే —" ఇత్యాదిగా వాచస్పత్యమున వ్రాయఁబడియున్నది. కాఁగా "విద్యుద్దండంబులు" అని గ్రహించుట లెస్సయని తోఁచెడి. 'కైవార' శబ్ద మాచ్ఛికమని శ్రీ వేదము వారు నైషధ వ్యాఖ్యలోఁ జర్చించిరి. కాని "కేవ" ధాతువుపై 'అరన్' ప్రత్యయము చేర్చి 'కైవార' శబ్దము సాధించుకొనవలెనని శ్రీ వఝ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి గారు విపుల విమర్శన పూర్వకముగా నిర్ణయించిరి.

"శయ్యా శబ్దమునకు సజ్జ సెజ్జ" అను సర్వలక్షణ సారసంగ్రహ లక్షణము ననుసరించి కావలయు 'పూసజ్జ' అని ముద్రింపించిరి. తిమ్మ కవి చూపిన లక్ష్యములు ప్రకృతార్థక్షమములు కావు. అతనిది నిర్మూల లక్షణము. కావున 'పూసెజ్జ' అని సవరించుకొనవలెను. "ద్యావాపృథివీ మహామహాత్ములకుఁ"(5-15)అనుచోటి"మహాత్ము"సాధువగుటసందిగ్ధము. "మహాఁ, మహాంతమ్" అను రెంటిలో దేనిని ప్రాతిపదికముగా గ్రహించిన 'మహాత్ము' అను రూపము సిద్ధింపదు. "మహాత్" అను

నపుంసకలింగ ప్రథమైకవచన తుల్యరూపమును ప్రాతిపదికముగా గ్రహింపవలసియుండును. కాని పుంలింగరూపము లుండఁగా నపుంసక లింగరూపములను గ్రహించుట సంప్రదాయ విరుద్ధము. కావున 'మహాత్త లకఁ' అనుట లెస్స. "కఱకంఠున్" (1-11) కంటె "కఱకంటున్" నిర్వాహకము. కంఠశబ్దభవము 'కంటు' అని యంగీకరింపనగును.

"వాగ్వివాద మింకేటికిన్"ఇది తప్పేమో? 'ధన్వివాదమింకేటి కిన్' అని దిద్దవలెనేమో? యని శ్రీ శాస్త్రిగారు పీఠికలో వ్రాయుట చింత్యము. "ఉపసర్గస్య ఘఞ్యమనుష్యే బహుళమ్" ఉపసర్గస్య బహుళం దీర్ఘః స్యాద్ఘఞన్తే పరేఃనతు మనుష్యే. పరిపాకః పరీపాకః అమనుష్యేకిమ్ - నిషాదః" అను సిద్ధాంత కౌముది చొప్పున 'వాగ్వి వాదము' లక్షణ సమ్మతమే.

విస్తర భీతిచే నీవ్యాసమునఁ గొన్ని ముఖ్య విషయములు మాత్రమే సంక్షేపముగా వివరింపఁబడినవి. పండితప్రకాండు లను గ్రహింతురుగాక !

---

# నాటకరచన — దాని పరిణామము

సాహిత్య విద్యాప్రవీణ, ఉభయ భాషాప్రవీణ,
రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి.

మహాశయులారా !

నాటకరచనను గూర్చి యీ నా ప్రసంగము. నాటక మన నెట్టిదో దాని ప్రాచీనార్వాచీన రూపము లెట్లున్నవో తెలిసికొనుట యవసరము. నాటక ప్రదర్శనములను గాంచి యానందించు నలవాటు మన భారతీయులకుఁ గలదు. నేఁటికిని నాటకమును జూచుటకై యువ్విళ్లూరు ప్రజలును, నాటకమందలి భూమికలను ధరించి సామాజికుల నానందింపఁజేయ నుద్యమించు నటులును మన కటనటఁ గాన నగుచుందురు. కావున నాటకమందు కుతూహలము గల నేఁటి సామాజికులకు నాటక స్వరూప పరిణామములఁ దెల్పుటకై యీ నా ప్రయత్నము.

సంస్కృతసారస్వతమున వేదములు శాస్త్రములు, పురాణములు, కావ్యములు అని నాలుగు ముఖ్యములగు శాఖలు గలవు. ఈ నాల్గింటిలోఁ గావ్యశాఖకుఁ జెందిన వీనాటకములు. శ్రవ్యదృశ్యభేదమునఁ గావ్యములు రెండు విధములు. శ్రవణమాత్రార్హములు శ్రవ్యకావ్యములు. వాల్మీకిరామాయణము మొదలు హర్షనైషధము వఱకు గల కావ్యము లన్నియు సంస్కృతమున శ్రవ్యములనఁబడును, మను చరిత్రాది ప్రబంధములన్నియు నాంధ్రవాఙ్మయమున శ్రవ్యము లనఁబడును. దర్శనార్హములగు కావ్యములు దృశ్యములు. ఇవి కేవల దర్శనార్హములే గాక శ్రవణయోగ్యములు నగును. వీనికే రూపకములని పేరు. ఇందు నాటక మంతర్భవించును. ఈ శ్రవ్య దృశ్యభేదమునఁ గావ్యశాఖలో ముఖ్యమగు భేదము లేర్పడినవి.

ఇందు మఱియొక భేదము గలదు. దృశ్యకావ్యములలో నాట్యమునకు విశిష్టస్థానము గలదు. నృత్తము, నృత్యము, గీతము, వాద్యము

అను వాని సాహాయ్యమున నిందలి కథాభాగము ప్రేక్షకులకుఁ బర మానంద మొనగూర్చుచుండును. భావము నాశ్రయించి నృత్తముండును. నృత్యము తాళలయాశ్రితము. మధురగానము గీతము. వీణావేణు మృదంగాదులు వాద్యవిశేషములు, ఏ తచ్చతుష్టయ విశిష్టమగు నాట్యకళ యీ దృశ్యకావ్యములందుఁ బ్రదర్శింపఁబడును. సామాజికు లీనాటకముల సర్వేంద్రియ తృప్తినిఁ గాంతురు. కావుననే యీరూపక ములు నాటకనామమున రూఢములయినవి. శ్రవ్యకావ్యములందుఁ జైనృత్తాదులకుఁ దావులేదు. కాన దృశ్యకావ్యములు శ్రవ్యములకంటె భిన్నములు.

మఱియు నిందుఁ గవితారూపమగు కళావిశేషమునకే గాక నటనమునకుఁ గూడ స్థానము గలదు. చతుష్షష్టికళలలో నాలుగు కళలు ముఖ్యములు. కవిత్వము నాట్యము శిల్పము చిత్రలేఖనము. వీనికే లలితకళలని ప్రసిద్ధి. ఈనాలుగింటిలోఁ బ్రధానస్థానము నాక్రమించి నవి కవితానాట్యములు. అనన్యసామాన్యములగు ప్రతిభావ్యుత్పత్తు లుండినఁ గాని కవిత ఘనతఁ గాంచదు. అభ్యాస పాటవము నాట్యమున కవసరము. నాయకావస్థానుకృతియే నాట్యము. అయ్యది రసాశ్రయము. హావభావ ప్రకటనము, అంగవిన్యాస సౌష్ఠవమును సంతతాభ్యాసమునఁ గాని సంభవింపవు. ఈ భావ ప్రకటనము రసానుగుణముగ నుండవలెను. ఇట్టి నియతి కృతనియమ నిర్ణీతములగు నీ కళావిశేషము లీదృశ్య కావ్యములం-దుండుటంజేసి యివి సర్వోత్కృష్టములును సర్వజ నాదృత ములు నగుచున్నవి,

శ్రవ్య కావ్యములలోఁ గవి తన ప్రతిభావిశేషమున శ్రోతల కవగతమగునట్లు కథాకథనముఁ గావించును దృశ్యకావ్యములందు మాత్రము పాత్రల సంభాషణాదికముచే సర్వ మవగతమగుచుండును. ఇదియు దృశ్యశ్రవ్యములకు మఱియొక భేద మనవచ్చును.

ఇంతియ కాక వర్ణనములందునను మఱియొక వ్యత్యాసము గలదు. ప్రదర్శనమున కనుకూలము గాని యుద్ధము - మరణము సంభోగము - దూరదేశయానము - మున్నగు కథాంశములు శ్రవ్య కావ్యములం దుపవర్ణితము లగుచుండును. నాటకాదులందు మాత్రము ప్రదర్శనార్హములగు విషయములకే స్థానము గలదు. ప్రదర్శనార్హములు కాని యితివృత్తభాగములు సూచింపఁబడుచుండును. లేక అట నట నట్టి చిన్నవిషయములు సామాజికుల యూహకై విడువఁబడుచుండును. ఈ విశేషము పై రెండు కావ్యములందు ముఖ్యముగా గమనింపఁదగినది.

వేదశాస్త్రాదులకంటెఁ గావ్యమునఁ బ్రయోజన మధికము. అందునను నాటకము బహుళప్రయోజన సంజుష్టము. వేదశాస్త్రములు శాసనరూపములును శబ్దప్రధానములును. ఇవి ప్రభుసమ్మితములై నీతులను ధర్మములను గర్మములను శాసించుచుండును. కావుననే వేద వాక్యములకు విధివాక్యము లని పేరు. పురాణము లుపదేశాత్మకములు, అర్థప్రధానములు. మిత్రులవలె నియ్యవి యుపదేశముల నొసంగుచుండును. పఠితలును శ్రోతలును నాయుపదేశములు గ్రహింపవచ్చును. లేక గ్రహింపకుండవచ్చును. వాని ప్రయోజన మంత మాత్రమున నిర్వ్యాప్తము. కావుననే పురాణము లర్థవాదములును స్తావకములు నయినవి. కావ్యములన్న నవి యుభయప్రధానములు. అనఁగా శబ్దార్థముల రెండింటికి నిందుఁ బ్రాధాన్యము గలదు. మఱియు నివి కాంతా సమ్మితములు. కాంత స్వవాక్చాతుర్యమున, స్వచేష్టామూలమునఁ దన పతినిఁ గర్తవ్యోన్ముఖునిఁగ నకర్తవ్యపరాఙ్ముఖునిగఁ గావించును. అట్లే కావ్యమువలన హితప్రాప్తియు నహితనివృత్తియుఁ గలుగును. మఱియు నాకర్తవ్యతాబుద్ధి సరసమగును. కావున వేదశాస్త్ర పురాణములకంటెఁ గావ్య మధికప్రయోజనములు గలది. రామునివలెఁ

ప్రవర్తింపవలెను-రావణునివలెఁ ప్రవర్తింపరాదు-అను నుపదేశమును రామాయణము నుండి సర్వులు గ్రహించుచునే యుందురు.

మఱియుఁ గావ్యము వలనఁ గీర్తియు ధనమును లభించును. వ్యవహారదక్షత యలవడును. చదువునపుడును వినునపుడును మిక్కిలి యానందము జనించును. శ్రవ్య దృశ్యాత్మకములగు నుభయకావ్యము లందును నీ ప్రయోజనములు సామాన్యముగ నుండుటం బట్టియే యవి గ్రంథరాశిలో నుత్తమస్థానము నలంకరించినవి.

పై ప్రయోజనములు శ్రవ్యకావ్యముల కంటె రూపకములందు స్ఫుటతరముగఁ జూపట్టును. సామాజికుల హృదయములను ద్రవింపఁ జేసి, రసాత్మకములుగ నొనర్చి యానందింపఁజేయు పాటవము నాట కాదులం దనితరసామాన్యముగఁ గలదు. నాటకములు నైతిక సాంఘిక ధర్మములను సరిదిద్ది భావుకుల కానందమును జేకూర్చును. ఔచిత్య దూరములగు కథాభాగములను విడనాడి యుచిత సన్నివేశములచే నానంద మొసఁగూర్చు శక్తి నాటకాదులం దనుపమానము. కావుననే నాటకరచన కవితా పరిపాకమునందిన కాళిదాసాది మహాకవులకు సాధ్య పడినది, అందుననే 'కావ్యేషు నాటకం రమ్యం' అను నానుడి ప్రసిద్ధి కెక్కినది.

అలంకార శాస్త్రమును బట్టి చూచిన దృశ్యశ్రవ్యకావ్యములకుఁ గల లక్షణము భిన్నముగ నున్నది. నగరాది వర్ణనములు పదునెనిమిది శ్రవ్యకావ్యములం దుండును. రెండు మూఁడు లోపించినను గావ్యలక్షణము నకుఁ గొఱంత లేదు. రూపకములందు మాత్ర మాలక్షణము విశేష విశిష్టమయినది. రసము-నాయకుఁడు-ఇతివృత్తము-వీని యాధారముగ రూపకరచన యుండును. నాందీ ప్రస్తావనలు, విష్కంభ ప్రవేశకాదులు, భరతవాక్యము మున్నగు విశేషలక్షణము లిందుండును. ముఖాది పంచసంధులు క్రమపరిష్కృతములై యొప్పును. అంకవిభేదము కావ్యార్థ

సూచనము మున్నగునవి ప్రత్యేకములు, ఇట్టి నియమము లెన్నియో యిం దుండవలెను.

మఱియు నాటకాదులందలి రచన రసానుగుణముగ నుండును. శబ్దాక్షర విన్యాసమున మిక్కిలి జాగరూకత యవసరము. ప్రసాద గుణమునకు ముఖ్యస్థాన మిటఁ గలదు. రసవిరుద్ధాక్షరము లిటఁ బరిహరింపఁబడును.

ఇంకను "నాటకాంతేతు సాహిత్యం" అను నభియుక్తోక్తిని బట్టి చూడ భాషాసౌష్ఠవము గూడ నాటకమునకుఁ బ్రాణమువంటి దయి యున్నది. ఇట్టి నిబంధనలకు లోనగు నీ నాటకములు తొలుదొల్త సంస్కృతమున నడుగిడినట్లు కానవచ్చుచున్నది.

భాసుఁడు-కాళిదాసు-శూద్రకుఁడు-విశాఖదత్తుఁడు-భట్టనారాయణుఁడు-భవభూతి-మున్నగు మహాకవులు సంస్కృతమునఁ బెక్కు నాటకములను రచించిరి. కాని వారి రచనలలో రసేతివృత్తనాయకులకు భేదము గలదు. గాని రచనాసంవిధానమున భేదము కానరాదు. ఇట్లు సంస్కృతభాషలో నావిర్భవించిన రూపకములు రసనాయకాది భేదమునఁ బదివిధములయినవి. నాటకములు శాకుంతలాదులు. ప్రకరణము మృచ్ఛకటికము. భాణము ముకుందానందము. ప్రహసనము లటకమేళనము. డిమము త్రిపురదాహము. వ్యాయోగము నరకాసుర వ్యాయోగము. సమవాకారము సముద్రమథనము, వీథి మాళవిక. అంకము యయాతి. ఈహామృగము రుక్మిణీహరణము. పై భేదము లందుఁ గాలనియమము గూడఁ గలదు. ఇవి కాక నాటికయను మఱియొక భేదము గూడఁ గలదు. రత్నావళి-ప్రియదర్శిక-మున్నగునవి నాటిక లనఁబడును. వీని లక్షణము గూడఁ బైవానికి భిన్నముగనే యున్నది. ఇట్లు సంస్కృతభాషలోఁ బలురూపముల వికసించిన యీ నాటక రచన భాషాంతరముల నెట్టి రూపము నందెనో పరికింతము.

ఈ నాటకరచనాపద్ధతి తొలుత బెంగాలీ భాషలో నడుగిడి క్రమముగ హిందీభాషలోని కవతరించినది. క్రీ॥ శ॥ పదునెనిమిదవ శతాబ్దిని "బాబు హరిశ్చంద్ర" అను కవిపుంగవుఁడు దొలుత నాటక రచనకుఁ గడంగెను. చంద్రావళి-హరిశ్చంద్ర - ముద్రారాక్షసము-మున్నగునవి వాని నాటక రచనలు. ఇవియన్నియు సంస్కృత నాటకానువాదరూపమునఁ గలవు. ఆలంకారిక నియమబద్ధములై యొప్పుచున్నవి. పిమ్మట "బాబు జయశంకర ప్రసాద్" అను మహాకవి 'చంద్రగుప్త-స్కందగుప్త-నాగయజ్ఞ-అను పేళ్లతో నాటకములను రచియించెను. ఇందు సంస్కృతానువాద పద్ధతి యున్నను నివి చారిత్రాత్మకములు, పురాణగాథలను గొంతవఱ కాధారముగఁ గొని యియ్యవి రచింపఁబడినవి. పిమ్మట నేకాంకిక నాటకము లవతరించినవి. 'రామకుమారవర్మ' యనుకవి 'చారుమిత్ర' అను పేర నాటక సంగ్రహము గావించెను. ఇట్లు వృద్ధి నందిన నాటకరచన నేఁటికిని 'ద్విజేంద్రలాల్ రాయ్' 'ఉపేంద్రనాథ్ హాశ్క' మున్నగు కవిపుంగవులచేఁ బోషింపఁబడుచున్నది.

ఈ హిందీ నాటకములందు ప్రారంభదశలో ననువాదపద్ధతి గలదు. క్రమముగ నయ్యది సన్నగిల్లినది. కాని స్వగత సంభాషణమున కధికముగఁ దావీయఁబడినది. రానురాను పద్యములతో పాటు స్వగత సంభాషణము గూడఁ బరిత్యజింపఁబడినది. చివరకు వచనరచనయే మిగిలినది. పాటలు మాత్రము దిఙ్మాత్రముగ నుండును. ఇట్లు నాటక క్రమము మాఱినది.

ఆంగ్ల భాషయందు నాటకీయపద్ధతి మిక్కిలి విరివిగ వృద్ధినందినది. "ఆరిస్టాటిల్" అను గ్రీకుదేశీయకవి తొలుత నాటక లక్షణమును గల్పించెను. 'షేక్స్పియర్' మహాశయుఁడు సుమారు ఇరువది నాటకములను రచించి నాటక కర్తలలో నగ్రిమస్థానము నలంకరించెను. పాశ్చాత్య

దేశములలో వాని నాటకములను జదువనివా రుండరు. భారత దేశమునం గూడ నాంగ్ల భాషావిదు లందఱు కొద్దిగనో గొప్పగనో వాని నాటకము లను జదువుచుందురు. గోల్డుస్మిత్తు-బెంజాన్సన్-మున్నగు వా రానాంటి ప్రాచీన నాటకరచయితలు, ఆధునికులలో బెర్నార్డుషా ప్రసిద్ధుఁడు.

ఇట్లాంగ్ల భాషలో విఖ్యాతినిఁ గాంచిన యీ నాటకరచన కొంత వఱకు సంస్కృతము ననుసరించిన దనవచ్చును. కాని ప్రత్యేకతయు నున్నది. నాటకమంతయుఁ బద్యరూపముననే యుండును. వానికే బ్లాంకు వెర్సు (Blank-Verse) అని పేరు. సూచ్యార్థసూచనము - పాత్రప్రవేశము - రసావిష్కరణము - సామాన్యరూపముగఁ జూపట్టు చుండును. స్వగత భాషణమునఁ గథను జాలవఱకు నడిపించుట వారి కిష్టము. సుఖాంతనాటకములు భారతీయులకు సమ్మతములయి యుండ దుఃఖాంతనాటకములను రచించుట యాంగ్లేయుల కానందము. అట్లని వారి నాటకములలో సుఖాంతములు లేకపోలేదు. As you like it-Tempest-Midsummer Night's Dreem మున్నగు కొన్ని షేక్స్పి యర్ నాటకములు సుఖాంతములే.

మఱియు వారి నాటకములందు కాలము-దేశము-కథ-అను వాని కైక్యము గలదు. భారతీయ నాటకములం దది పరిగణింపఁబడ లేదు. ఆంగ్లేయుల నాటకకథ కొంత నియమితకాలమున జరిగినట్లు వర్ణింపఁబడును. కాళిదాసవిరచిత శాకుంతలనాటకకథ సుమా రయిదు సంవత్సరము లవధిగ వ్రాయఁబడినట్లున్నది. కాన సంస్కృత నాటక కర్తలు కాలనియమమును బాటించునట్లు కానరాదు. ఒకే దేశమున కథ జరిగినట్లు వారినాటకములందుఁ గన్పడును. భారతీయనాటకము లం దయ్యది యుండదు. మన నాటకములందలి పాత్రలన్నియు ముల్లో కము లందును సంచరించుచుండును. ప్రాసంగికకథలను బ్రధాన కథతోఁ గలిపి చెప్పుట యుభయులు నంగీకరించిన విషయమే. స్వగత

సంభాషణ మాంగ్ల నాటకములం దధికము. పద్యముల కందు సంపూర్ణ స్థానము గలదు. మన నాటకములం దయ్యది మిశ్రమము. కాని 'షా' మహాశయుఁడు వచనమునకుఁ గూడఁ దావొసంగి నాటక రచన గావించి నట్లు తెలియుచున్నది.

ఇట్లు భాషాంతరములందున్న నాటకరచన యాంధ్రభాషయందే రీతి నున్నదో గమనింతము. ఆంధ్రమున క్రీ॥ శ॥ పదునేనవ శతాబ్ది నుండి నాటకరచన యడుగిడుచున్నట్లు తోఁచును. శ్రీనాథకవి సార్వభౌముఁడు వీథినాటకమును రచించెను. క్రీడాభిరామ మను గ్రంథమున నా నాటక పద్యములు చూపబడినవి. అందు వచనములు గూడ నున్నవి. కాని యా నాటకమున సంస్కృతనాటకలక్షణము లధికముగ లేవు. గద్య పద్య రచన యానాఁటికి నాటకమున స్థిరరూపమును దాల్చినట్లున్నది.

పిదప మధుర-తంజావూరు ప్రభువుల కాలమున యక్షగానము వృద్ధినందినది. పందొమ్మిదవ శతాబ్దిని ప్రదర్శనయోగ్యమగు నాటక రచన ప్రారంభింపఁబడినది. బాగుగఁ బరిశీలించినఁ దెలుఁగు సారస్వత మంతయు సంస్కృతానుకరణమే. తెలుఁగు కవులు ప్రబంధ సృష్టితో నాఁగిపోయిరి. నాటకరచనకుఁ బూనుకొనలేదు. కాని వారి ప్రబంధము లందు నాటకీయ రచనా బీజములు లేకపోలేదు. ఇట్లుండఁ దొలుత ధార్వాడకంపెనీ వారు రాజమహేంద్రవరమున నాటకములను బ్రదర్శించిరి. శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు రద్దానినిఁ గాంచి తెనుఁ గున నాటకములను వ్రాయ సంకల్పించిరి. ఆంగ్ల నాటకములలో నొకటగు "Merchant of Vennice" అను దానికి 'వెన్నిసువర్తకుఁడు' అను పేర ననువదించిరి. ఆ నాటకము ప్రదర్శింపఁబడెను. అందలి పాత్రధారుల వేషము లన్నియు పాశ్చాత్యపద్ధతుల ననుసరించినవి. మాటలు మాత్రము తెనుఁగునకు సంబంధించినవి. ఇట్లు సామరస్యము చాలనందున నా నాటకము ప్రజామోదము నందుకొనలేదు. అతఁడు

మరల హరిశ్చంద్ర నాటకమును రచించెను. అదియు మెప్పు నందఁజాల దయ్యెను. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు గయోపాఖ్యాన మును రచించిరి. అది ప్రదర్శనమునఁ బేరుగాంచినది. అంతఁ గొందు కూరివారి దృష్టి సంస్కృత నాటకములపైఁ బడెను. వారి యభిజ్ఞాన శాకుంతలము పేరుగాంచెను. శ్రీ వసురాయ కవిగారి వేణీసంహార నాటకము గూడ సంస్కృతానువాదమే. అదియును బ్రదర్శనమునఁ బేరువడసెను. శ్రీ బలిజేపల్లి వారి హరిశ్చంద్రయుఁ బ్రసిద్ధినందెను. వీని యందలి రచన ప్రబంధరచనలను బోలియుండును. వరుసగాఁ గొన్ని పద్యములును, దీర్ఘసమాసభూయిష్ఠమగు వచనములును నీ నాటకము లందుఁ గానవగును. ఇదియంతయు సంస్కృత నాటకానుకరణము. ఇది యిట్లుండ శ్రీ ధర్మవరము కృష్ణమాచార్యగారు ఆంగ్లనాటకరచనా పద్ధతి ననుసరించి యంకములను రంగములుగ విభజించి విష్కంభ ప్రవేశకాదులను దొలఁగించెను. చిత్రనళీయము-విషాదసారంగధర-వాని నాటకములు. తెలుఁగు నాటకములందుఁ బాటలను బ్రవేశపెట్టిన మహా నీయుఁ డితఁడే, తరువాత శ్రీ తిరుపతి వేఁకటకవులు ఆంధ్రనాటక రచన యందొక నూతన పద్ధతినిఁ బ్రవేశపెట్టిరి. వారి పద్యములన్నియును సంవాదాత్మక శైలిలో నుండును. వారి భారతనాటకములు ప్రసిద్ధి నందినవి. కాని వీరిరచనయుఁ దొలుత సంస్కృతనాటకముల ననువ దించుటతోఁ బ్రారంభమయినది. క్రమముగ నాయనువాద పద్ధతి యంతరించినది. పిదప నాంధ్రకవులు స్వతంత్రించి నాటకములను రచిం చుట కున్ముఖులయిరి. కాని వానియందొక విశేషము గలదు. సంస్కృత నాటకములందువలె వీనియందు నాటకలక్షణము లన్నియుఁ గానరావు. ప్రారంభదశయందలి నాటకములలోఁ గొన్ని లక్షణము లున్నను గాల క్రమమున నయ్యవియు నంతరించినవి. మొదటి నాటకములందు పద్యము లధికముగ నుండెడివి. క్రమముగఁ బద్యములను బాటలను

నాటకముల కలంకారము లయినవి.సిమ్మట పద్యము లంతరించి పాటలు మిగిలినవి. నేఁటికి నవియు నంతరించి మాటలే నాటకముల కాధారము లయినవి. మాటలు సంభాషణరూపమున నున్నచో నాటక మగు నను సిద్ధాంతము నేఁటిలోకమునఁ బ్రబలినది. అంతియ గాక పద్యరచన పనికిరా దనియు వచనరచనయే రసాధాయకమనియు నిశ్చయింపఁబడు చున్నది. పై నాటక లక్షణముల కిందుఁ దావులేదు. దృశ్యములు (సీన్సు) మాత్ర మిందుండును. అంకవిభాగము గలదు. ఇట్లు వచన రూపము ననే గాక గేయనాటికలు నేకాంకికలు గూడ నేఁటి కాలమున వెలువడు చున్నవి. ఇందు పాటలు మాత్రమే యుండును.

ఇట్లు నాటకరచన మాఱుచున్నట్లు నటకుల మనోవృత్తియు నటనావిధానమును గ్రమక్రమముగఁ బరిణామము నందినది. సంస్కృత భాషలో నున్న నాటకములను బ్రదర్శించు నాచారము పూర్వకాలమున వృద్ధినంది మధ్యయుగమున నంతరించియుండును. సంస్కృత భాషా జ్ఞానము సర్వులకు నమకూడ కుండుటయే యద్దానికిఁ గారణమగును. కాని సంస్కృతభాషావేత్తలగు కొందఱు ప్రభువులు మాత్రము తమ సంస్థానముల నాటకశాలల నెలకొల్పి, సంగీతసాహిత్యములం దారి తేరిన పండితులను బోషించి, విలాసార్థము నాటకములను బ్రదర్శింపఁ జేసినట్లు చరిత్రములను బట్టి యవగతమగుచున్నది. ఈ శతాబ్దిని విజయ నగర ప్రభువులగు శ్రీ ఆనందగజపతి మహారాజులు నాటక సమాజ మును స్థాపించి పోషించుట సర్వజనవిదితమే. నాటక కళాపితామహుఁ డనఁదగు శ్రీమాన్ బళ్లారి రాఘవాచార్యులు ఈయుద్యమమునకు నేఁటి వారిలో మొదటి వారు. అభినయమున భావప్రకటనమున నాతఁడందె వేసిన చేయి. ప్రస్తుతము శ్రీ స్థానము నరసింహారావు శ్రీ బందా కనకలింగేశ్వరరావు, శ్రీ పీసపాటి నరసింహామూర్తి మున్నగు వారు ప్రసిద్ధులు.

ఇట్లు నాటకరచనయుఁ దత్ప్రదర్శనములుఁ దన్నటకులును భిన్న భిన్నరూపముల నందుచుండెను. సారస్వత సంపదకును భావావిష్కరణము నకే గాక నృత్త నృత్యములకును గీతవాద్యములకును గూడఁ బ్రధాన స్థానమై రసావిష్కరణమున కాధారమగు నీ నాటకరచన నేఁడు పూర్వ లక్ష్యములను విడనాడి భావప్రకటనైకప్రధానము లగుట మిక్కిలి శోచనీయము.

ఈరీతిని నీ నాటకములు పరిణామము నందుటకుఁ గారణము లేమయినఁ గలవా? యని యోచింపఁ గొంత స్ఫురింపకపోదు.

రసానుగుణముగ భావములను బ్రకటించి ప్రేక్షకుల నానందింపఁ జేయుట నాటకముల ముఖ్యోద్దేశము. నటకు లాభావప్రకటనమును గావింతురు. వా రెవరి ననుకరింపఁ దలంచిరో వారి యాశయములను బ్రదర్శింతురు. కావున మొట్టమొదట మన దేశమున నీభావ ప్రకటనము యక్షగానరూపమున వెలువడినది. అం దొక రిద్దఱు పాటలరూపమున నున్న కథాభాగమును వినిపింపఁ బ్రేక్షకు లానందింతురు. ఆ గానము తే నేఁటికి నచ్చటచ్చటఁ బల్లెలందుఁ గాననగును. దాసరి పాటలు-గొల్ల సుద్దులు - పల్నాటిచరిత్రములు-బొబ్బిలి పాటలు మున్నగునవి యీ తెగకుఁ జెందును.

కాని కాలక్రమమున వాతావరణము మాఱుటంజేసి యీ మార్గము మానవామోదమునకు దూరమయినది. భాగవతము లను పేర మఱియొక మార్గ మనుసరింపఁబడినది. అందు సంగీతమునకును, వాద్యమునకును, నేపథ్యకల్పనమునకును గొంత యవకాశము గలదు. నలుగురయిదుగురు నటులును సుమారు పదిమంది గీతవాద్య కుశలులును అందుఁ బ్రవేశింతురు. ఒకరాత్రి యంతయు నా కలాపము ప్రదర్శింపఁ బడును. కాని యీ విధానమునను గొన్ని లోపములు గనవచ్చును. వీరి కలాపములం దన్నికథలను బ్రదర్శించు నవకాశము స్వల్పము. కృష్ణ

చరిత్రము-శివలీల-సముద్రమథనము-మున్నగు కొన్నికథలే యిందుఁ బ్రదర్శింపఁబడును. ఈకళలోఁ గూచిపూడి భాగవతులు సిద్ధహస్తులు. ఈ కలాపములు రచించినవారిలో వీనినిఁ బోషించిన వారిలో శ్రీ వంకాయల బలరామభక్తగారు సిద్ధహస్తులు. నేఁటికిని నీ భాగవత ప్రదర్శనములు గలవు. పెద్దయుత్సవములందును, గ్రామదేవతల నారాధించునప్పుడును బల్లెలలోను బట్టణములందునను నియ్యవి ప్రదర్శింపఁబడుచున్నవి. వీనియందు నటకులకే గాక ప్రేక్షకులకుఁ గూడ శ్రమ యధికము. సంగీతమునకు ముఖ్యస్థాన మిందుఁ గలదు. రసానుగుణమగు భావావిర్భూతి యిందుఁ దక్కువ. కావున నీకళ నేఁటికాలమున దృశ్యాదృశ్యరూపము నందినది.

ప్రజల యభిరుచి మాఱుచుండుటంబట్టి భాగవతము లటుండ బొమ్మలాట యను మఱియొక వింత ప్రదర్శనము పొడచూపినది. ఇందు నటులు తెరచాటున నుందురు. వారికి హావభావ ప్రకటన ప్రయాసము లేదు. తెరవెనుక నుండియే పాటలను బాడుచుందురు. మాటల నాడుచుందురు. తెల్లని తెరమీఁద మాత్రము వారు ప్రకటింప నుద్దేశించిన కథలోని వ్యక్తులను దోలుబొమ్మలరూపమునఁ బ్రదర్శించుచుందురు. ప్రేక్షకు లావిగ్రహములను గాంచుచు మాటలను వినుచు పాటలకు మురియుచు నానందింతురు. కథాకథనముఖమున విగ్రహ ప్రదర్శన మింపు ముఖ్యము.

కాలక్రమమున నదియు సంతరించినది. హరికథయను మఱియొకభేద మాస్థానము నాక్రమించినది. సంగీతసాహిత్యములందసామాన్యప్రజ్ఞగల యొకవ్యక్తి యీకథను జెప్పును. శ్రుతిలయములు వాని ననుసరించి వెనుకమ్రోగుచుండును. కాని యిం దొక్కఁడే కథయందలి పాత్రల భారమును వహించును. ఈహరికథలకు మార్గదర్శి శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు. పిదప నవులుగూడ నగుటం

జేసి తామే సావిత్రి - రుక్మిణీకల్యాణము - యథార్థరామాయణము మున్నగు హరికథలను రచించి తరువాతివారలకు మార్గదర్శకులయిరి.

ప్రస్తుతము వీనికి బదులుగ 'బుఱ్ఱకథలను' పేర మఱియొకకథా ప్రపంచము వెలువడినది. ఇందు ముగ్గురే వ్యక్తు లుందురు. ఇందు ముఖ్యులే వ్యక్తులుందురు. ఇందు సంగీతసాహిత్యములకు, నటనాకౌశల మునకును స్థానము స్వల్పము. నేఁటి దేశనాయకులచరిత్రలీకథల మూలమునఁ బ్రకటింపఁబడుచున్నవి.

ఇట్లు పాటలు మొదలు బుఱ్ఱకథవఱకుఁ గలమార్గము లన్నియు నాటకరచనకు మూలబీజములే యని చాలమంది యభిజ్ఞులు దలంచిరి. కాని యవి యన్నియు దేశికవితామార్గములు. మార్గకవిత కుదాహర ణము లనఁదగు నాటకములకంటె నవి భిన్నములు. నాటకరచన వీని కంటె విభిన్న మనఁదగును.

నేఁటి సినీమాప్రపంచముమాత్రము నాటకరూపాంతర మనఁ దగును. ఎచ్చటో నటించిన నటనమును మనము తెరలపైఁజూచి యానందించు నవకాశ మిందుఁ గలదు. ఇందు నటనమునకుఁ బ్రాముఖ్య ము గలదు. మఱియొక విశేష మిందుఁ గలదు. ప్రదర్శింపననువుకాని కథాంశములుగూడ నిందు సముచితముగఁ జూపఁబడును. ఆకాశయా నము - సముద్రయానము - యుద్ధము - బంధనము-గృహదాహము - మరణము - మున్నగున వన్నియు నిందుఁబ్రత్యక్షముగఁ జూపఁబడును. క్రొత్త క్రొత్త వింతల నిందుఁ జూడవచ్చును. నాటకాదులం దిట్టిది దుర్లభము. కాన సినీమాలు నాటకచ్ఛాయలే నాటక ప్రతిరూపములే యనవచ్చును. కాని యిందు సాహిత్యము తక్కువ. సంగీతము కళా మాత్రముగ నుండును.

నాటకములందు మాత్రము భాషయు భావమును సమాన స్థాయిలోఁ బయనించుచుండును. సంగీత సాహిత్యములందు సమర్థ

లును, హావభావప్రకటన దక్షులును, చతుర్విధాభినయ కుశలులునగు నటకులు తమనటనల కనుగుణములగు భూమికలను ధరించి రంగస్థలములం దమపాత్రలనిర్వహింతురు. ఇం దొకవైపు సంగీతము సంతసముం గొల్పుచుండ సాహిత్యమింకొకవైపునవానంద మొనఁగూర్చుచుండును. నేపథ్యకల్పన మొకవంక ముగ్ధులను గావించుచుండ నటనాకౌశల మొకవంకఁ దన్మయులను నొనరించుచుండును

ఇట్లు దర్శన శ్రవణాదులచే సామాజికుల నానందింపఁజేయు శక్తి యీ నాటకములందే గలదు. కావుననే యన్నివిధముల నగ్రిమస్థానము నందిన వీనాటకములు. ఈ తీరునఁ బరిణామముసందిన నాటకకళ నేఁడు పట్టణములందునను బల్లెలందును నటనట మరలఁ బోషింపఁబడుచున్నది. ధనికులు నాసక్తులు నగుయువకులు నాటకసమాజములందుఁ బాల్గొని యాకళను బెంపొందించుచున్నారు. పండిత పామరుల కందఱికిని నానందమును జేకూర్చు నీ నాటక కళ నితోధికముగ వృద్ధిసందించుట ముఖ్య కర్తవ్యము. ప్రభుత్వము కళాశాలలద్వారా దీనిని వృద్ధి నందించుట యవసరము.



# కవితా లక్షణములు

## భారవి — పింగళి సూరన

### సామవేదం శ్రీరామమూర్తి

సంస్కృతాంధ్ర భాషలలో లక్షణ గ్రంథ నిర్మాతలు పెక్కండ్రు కేవలపండితులే కాని వారిలో సరస కవితా దక్షులైన కవీంద్రులును గొందఱు కలరు. దండి పండితరాజాదులు, నన్నయ కేతనాదులు నిట్టి వారే. లక్షణ గ్రంథములను రచింపకున్నను లక్షణ లక్షితమైన చక్కని కవిత్వమును జెప్పిన మహాకవులు నెందఱో గలరు. వీరు ప్రత్యేకముగా లక్షణ గ్రంథముల నిర్మింపకున్నను దమ కావ్యములలోఁ బ్రస్తావ వశమునఁ గవిత్వమును గూర్చి తమ యభిప్రాయముల నట నట వెల్లడించుట గలదు. ఈ యాచారము సంస్కృత కవులకంటెఁ దెలుఁగు కవులలో నెక్కుడు. తిక్కన మున్నుగా నెల్లరు కవులు ప్రస్తావనలో నీ పని చేసినవారే.

పింగళి సూరన గూడఁ గళాపూర్ణోదయాదిని సుకవిస్తుతి సందర్భమున.

సీ. విశ్రాంతి విరతి గావింపక సారవ
త్సాహిత్య సామసన్యంబు లెఱిఁగి
సమయంబు దప్పక శ్రవణ క[illegible]ంబు
లైన శబ్దములు సత్యాకులాత్మఁ
జేయక సత్ప్ర[illegible]చిత సుకుమార భా
స్ఫురితాభిప్రాయఁగా నొనర్చి
పదబంధ శిథిలతఁ బాటిల్లఁగా సీత
తే. ప [illegible] సేయ [illegible]

ఆ. వెరఁగు కవియు దోషాకరుఁడును యశము దు
గ్ధమును బడయు నట్లు గానినాఁడు
కృతి గురావ మొదవు కీర్తియుఁ బాలు నీ
కుఁట గాదు పాసదోహ్యుఁ జేయు.

(పీఠిక-8)

అను పద్యమునఁ గొంతవఱకుఁ గవితాలక్షణములఁ బరామర్శించెను. కాని ప్రభావతీ ప్రద్యుమ్న ప్రస్తావనలో నీ ప్రసంగమునే మొత్తఁడాయెను. ఈతఁడు కవితావిషయమునఁ దనయభిప్రాయమును దత్తత్కావ్య గతపాత్రముఖమునఁ దెలుపుచుఁ దన కవితలోని విశిష్టతను దానే నేర్పుమైఁ బ్రశంసించుకొనుచుండును. ఈ విషయమున శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు కళాపూర్ణోదయ పీఠికలో నిట్లు వ్రాసియున్నారు. "సూరన తన సమకాలికుఁడైన షేక్స్పియరు వలె నందందు శైలిం గూర్చిన విచారములను దనకును కథకును భంగము కాని మాడ్కిఁ బాత్రములచాటునఁ జేసియున్నాఁడు. బయటఁ బడకయ తనకృతిని దానే విమర్శించియున్నాఁ డనుట. దృష్టాంతము మణికంధరుఁడు చేసిన దండకరూపమగు కృష్ణ స్తవముం గూర్చి కలభాషిణి ప్రశంసించిన తెఱంగు.

సీ. పొసఁగ ముత్తెపుసరుల్ పోహళించిన లీలఁ
దమలోన దొరయు శబ్దములఁ గూర్చి
యర్థంబు వాచ్య లక్ష్య వ్యంగ్య భేదంబు
లెఱిఁగి నిర్దోషత నెనఁగఁజేసి
రసభావములకు నర్హంబుగ వైదగ్ధి
మొదలైన రీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లిమ్ముగాఁ బాదుకొల్పి

తే॥ యమర నుపమాదులును యమ కాదులు నగు
నట్టి యర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగని వారు గలరె!

కళా 1-81.

ప్రభావతీ ప్రద్యుమ్నమునందును ఇట్టి దొకటి గలదు; కాని కథలో నీ పద్యమున కున్నంత కలయిక దానికి లేదు. ఇంద్రుఁడు శుచిముఖిని గొనియాడుచు నాడిన పద్యము.

సీ. శబ్ద సంస్కార మెచ్చటను జాఱఁగ నీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁపిల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తి దోషంబు పొంతఁ బోక
యాకాంక్షిత న్యాప్తి యాచరించుచును శా
ఖా చంక్రమ క్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాదుకో నదుకుచు
నుపపత్తియెందు నతూర్జితముగ

తే. నొకటఁ బూర్వోత్తర విరోధ మొందకుండఁ
దత్తదవయవ వాక్య తాత్పర్య భేద
ములు మహావాక్య తాత్పర్యమునకు నొసరఁ
బలుక నేర్చుట బహుతపః ఫలము గాదె?

(ప్రభా. 2-3)

ఈ రెండు పద్యములం బోల్చి చూచితిమేని రెండవ పద్యము రచించు లోపల కవి కొంతమట్టుకు శైలిం గూర్చిన యభిప్రాయమును మార్చినాఁడనియుఁ జెప్పుట కవకాశ మయ్యెడి.

కవులు శైలిని గూర్చి గ్రంథ గతపాత్రముల ముఖమున విమర్శిం చుట మనకుఁ గ్రొత్తకాదు, ఆదికవికృత శ్రీ మద్రామాయణముననే యీ పద్ధతి మనకు గోచరమగుచున్నది. సుగ్రీవునిచేఁ బంపఁబడి భిక్షు రూపధారియై తమకడకు వచ్చి తన్ను దెలుపుకొనిన హనుమంతుని వాఙ్నైపుణిని గూర్చి రాముడు లక్ష్మణునితో నిట్లు పలికెను.

శ్లో॥ అభిభాషస్వ సౌమిత్రే సుగ్రీవసచివం కపిమ్
వాక్యజ్ఞం మధురై ర్వాక్యైః స్నేహయుక్త మరిందమ.
నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః
నాసామవేదవిదుషః శక్య మేవం ప్రభాషితుమ్
నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధా శ్రుతమ్
బహు వ్యాహరతానేన నకించి దపశబ్దితమ్
అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా
కస్య నారాధ్యతే చిత్త ముద్యతాసే ర రేరపి

(కిష్కింధా, సర్గము 3-27, 28, 29,)

కథాగత పాత్ర సామర్థ్యమును వర్ణించుచునే కవి కవితాలక్షణ ములను గావ్యమార్గమున (కాంతాసమ్మితముగా) దెలుపుటయే యిం దలి చమత్కారము. కవినైపుణము శ్లాఘింపఁబడుట యానుషంగికము.

ఈ పద్ధతి బహుకవి ప్రహతమే యయ్యు నిందు సంస్కృత కవి యగు భారవికిని దెలుఁగు కవియగు సూరనకును సామ్య మెక్కుడుగా నాదృష్టి గోచరమగుటచే నీ వ్యాసమున దానిని గొంత ముచ్చటింపఁ దలఁచితిని.

భారవి-సూరన—ఈ యిరువురి నామములు పర్యాయపదము లగుట యాదృచ్ఛికమే యయినను వింత విషయము; భారవి సంస్కృత సాహిత్యాంబరమున నిక్కముగా భారవియే; అతని వైదుష్య మపా రము; ఇఁక సూరనార్యు నుభయభాషా వైదుష్యమునకుఁ దార్కాణ

మాతని రాఘవపాండవీయము. కళాపూర్ణోదయమునందును చిత్ర కవిత్వము కొంత కలదు. కాని యందుఁ గల్పనా కామనీయకము మెండు. ప్రభావతీప్రద్యుమ్నమున నాతని పరిణత రచనా రామణీయకము కన్పట్టును. శ్రీ రామలింగారెడ్డిగారు తలఁచినట్లు కవి ప్రభావతీ ప్రద్యుమ్న రచన కావించునప్పటికి రచనారీతులలోఁ దనయభిప్రాయము కొంత మార్చుకొనినట్లు స్పష్టమగును. అందుత్తర రచన యగుట నీ ప్రబంధమున వెలువడిచిన యభిప్రాయము నెక్కువ ప్రమాణముగా గ్రహించి యిందు వివేచింపఁ బూనుకొంటిని.

కావ్య (వాక్య) లక్షణమున భారవి తన యాశయము నెట్లు ప్రకటించెనో కనుఁగొనుఁడు.

ద్విషాం విఘాతాయ విధాతు మిచ్ఛతో,
రహ స్యనుజ్ఞా మధిగమ్య భూభృతః
ససౌష్ఠవౌదార్యవిశేషశాలినీం
వినిశ్చితార్థా మితి వాచమాదదే. (కిరాతా 1-3)

వనేచరుని వాక్కు సౌష్ఠవౌదార్య విశేషశాలిని, వినిశ్చితార్థము కలది. పూర్వనిపాతశాస్త్రము నతిక్రమించినదైనను సమాసమున మొదట సౌష్ఠవపదమును గ్రహించుటచే దాని ప్రాధాన్యము వ్యక్తమగుచున్నది. సౌష్ఠవమనఁగా శబ్ద సామర్థ్య మని వ్యాఖ్య. దీనినే సౌశబ్ద్యము, శబ్దశుద్ధి యనఁదగును. దీనిని బట్టి లక్షణ విరుద్ధ భాష యగ్రాహ్యమని కవి యభిప్రాయము. సూరన గూడ "శబ్ద సంస్కార మెచ్చుటను జాఱఁగ నీక" యని దీనినే మొట్టమొదట నుగ్గడించెను.

ఔదార్యము=అర్థసంపత్తి. కవి శబ్దసౌష్ఠవముతోనే తనియక యర్థసంపదపై దృష్టి నుంచవలయును. శబ్దజాల మెంత నిర్దుష్టమైనను అర్థపుష్టి లేని కావ్యము నిస్సారము. దీనినే సూరన "పదమైత్రి యర్థ సంపదలఁ బొదల" అని పేర్కొనెను. భారవి యుగ్గడించిన సౌష్ఠవౌదా

ర్యములను రెండింటిని నీతఁడును ఆ క్రమములోనే మొదట గ్రహించెను.

వాక్కు వినిశ్చితార్థము కలిగియుండవలెను. "విశేషతః ప్రమాణతః నిర్ణీతార్థాం" అని వ్యాఖ్య. చెప్పిన యర్థము పరిమాణబద్ధమై యుండవలయును. కవి దేనిని జెప్పినను శాస్త్ర విరుద్ధముగనే చెప్పనొప్పును; గాని భ్రమ ప్రమాదాది భూయిష్ఠమైన తనబుద్ధినే ప్రమాణముఁ జేసికొనరాదు. సూరనయు నిట్లే తలంచిన వాఁడగుటచేతనే శుచిముఖి వివిధశాస్త్రపారంగతి యని "కాణాదంబును గౌతమీయమును సాంఖ్యంబుల్ భుజంగాగ్రణీ, వాణీ మార్గము జైమినీయమతిమున్ వ్యాసోక్తశాస్త్రంబు వక్కాణించెం గడుఁ బూర్వపక్షములు జోకంబెంచుచు న్నించి యు, క్షీణ ప్రౌఢిఁ దిరస్కరింపుచుఁదుదన్ సిద్ధాంతముల్ నిల్పుచున్." (పరిభా 4-61)

అను పద్యమున వర్ణించి కవికి వివిధశాస్త్ర పరిచయ మావశ్యకమని సూచించెను.

విహితాం ప్రియయా మనః ప్రియా మథ నిశ్చిత్య గిరం గరీయసీమ్,
ఉపపత్తిమ దూర్జితాశ్రయం నృప మూచే వచనం వృకోదరః.

(కిరా 2-1)

భీముఁడు ఉపపత్తియుక్తము ఊర్జితాశ్రయము నగు వచనమును బలికెనఁట. ఉపపత్తి యనఁగా యుక్తి యుక్తియుక్తములుగాని వచనములు అగ్రాహ్యములు, ఊర్జితాశ్రయ మనఁగా సదార్థము కలది యని యర్థము. పైని పేర్కొన్న యౌదార్యమే యిది. ఇదియే యర్థగౌరవము, 'భారవే రర్థగౌరవమ్,' అను ప్రశంసోక్తి సుప్రసిద్ధమే గదా! సూరన గూడ "ఉపపత్తి యెందు నత్యూర్జితంబుగ" నని యుపపత్తిని గ్రహించినాఁడు. 'ఉపపత్తిమ దూర్జితాశ్రయమ్' అను పదమున కిది యెంత సన్నిహితముగ నున్నదో కనఁగొనుఁడు, భారవి శ్లోకమున

'ఊర్జిత, పదము అర్థవిశేషణము. సూరన అర్థసంపదను బైని బేర్కొని యుండుటంజేసి మరలఁ జెప్పుట పునరుక్తమగునని యెంచి దానిని ఉపపత్తి, కే విశేషణముగాఁ జేసి వైచెనుఁ ప్రకరణ భేదముండుటచే భారవికి పునరుక్తి దోష మంటదు.

భీముని మాటలను ధర్మరాజు శ్లాఘించు ఘట్టమునందలి క్రింది శ్లోకములలోఁ గూడ భారవి కవితా లక్షణములను నిరూపించెను.

అపవర్జిత విప్లవే శుచౌ హృదయ గ్రాహిణి మంగళాస్పదే,
విమలా తవ విస్తరే గిరాం మతి రాదర్శ ఇవాభిదృశ్యతే (2-26)

భీముని శబ్దవిస్తరము అపవర్జిత విప్లవము, శుచి, హృదయ గ్రాహి, మంగళాస్పదము. కనకనే యది యద్దము వలె నున్నది; అద్దమునందుఁ బ్రతిబింబమువలె నీ వాక్ప్రపంచమునందు భీముని విమలబుద్ధి కనఁబడుచున్నది. అపవర్జితవిప్లవము అనఁగాఁ బ్రమాణ బాధ లేని దని యర్థము.పయిని జెప్పిన వినిశ్చితార్థకత్వము మరల నిట వ్యాఖ్యానింపఁబడినది. శుచి-సౌశబ్ద్యం లోహశుద్ధిశ్చ శుచిత్వమ్ అని వ్యాఖ్య. లోహశుద్ధి యుపమానపక్షమున నన్వయించును. సౌశబ్ద్యము ముఖ్య మని మరల నొక్కి వక్కాణించినాఁడు కవి. "శుచి భూషయతి శ్రుతం వపుః, అనుచోట "శుచి సంప్రదాయ శుద్ధమ్, అని వ్యాఖ్య, సౌశబ్ద్యము లేక శబ్ద సంస్కారము కలదియను నర్థమున భారవి ప్రయోగించిన యీ శుచి శబ్దమును సూరన శుచిముఖి ముఖమునఁ బెట్టినాఁడు. పెట్టి యూర కుండలేదు. మన్మఖంబు శబ్ద సంస్కార పూతంబను బుద్ధి నద్దేవియ నాకు శుచిముఖి యని పేరిడియె, నని యామె చేతనే చెప్పించెను. ఆమె ముఖము శబ్ద సంస్కార పూతంబు.సంస్కార యుక్త శబ్దములచేఁ బవిత్రతయే గాక శోభయుఁ గలుగునని 'సంస్కార వత్యేవ గిరా మనీషీ తయాస పూతశ్చ విభూషితశ్చ' అను నెడఁ గాళి దాసుఁగూడ వ్యక్తీకరించెను. హృదయగ్రాహి యనఁగా మనో

హారము. ఆహ్లాదకత్వము కవిత్వమున కావశ్యక మనుట. మంగళాస్పదము హితార్థ ప్రతిపాదకమగుటచే శ్రేయస్కరము. కవిత్వము లోకకల్యాణ హేతువై యుండవలె నని దీనిభావము.

స్ఫుటతా నపదైః రపాకృతా నచ న స్వీకృత మర్థగౌరవమ్,
రచితా పృథగర్థతా గిరాం నచ సామర్థ్య మపోహితం క్వచిత్
(భార 2-27)

ఉపపత్తి రుదాహృతా బలా దనుమానేన నచాగమః క్షతః,
ఇద మీదృ గనీదృగాశయః ప్రసభం వక్తు ముపక్రమేత కః (2-28)

స్ఫుటత యనఁగా నర్థవైశద్యము, అది పాటింపఁబడినది యనక తొలఁగింపఁబడలే దని చెప్పుట ప్రస్తుతార్థ దృఢీకరణార్థము. కవి తన భాషాప్రాభవము నెఱుకపఱుచుటయే ప్రధాన మనుకొని యర్థ స్పష్టతకు భంజకమగునంత శబ్దాడంబరము నుపయోగింపరా దని సూచన. స్పష్టముగాఁ జెప్పుటయందే దృష్టి నుంచవలయును. దీనిని సూరన "తలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగా" నని వాకొనెను. అర్థము స్పష్టముగా నుండవలెనన్నఁ దేలవముగా నుండవలయు నను కొందు రేమో అది కాదని తెలుపుటకే 'నచ న స్వీకృత మర్థగౌరవమ్' అని యెను. వైశద్యప్రస క్తార్థ గౌరవాభావ నివర్తనార్థే నఞ్ద్వయమ్, అని వ్యాఖ్య. కవిత్వమున కవి తాను జెప్పఁదలఁచినది నర్థ స్పష్టత ముఖ్యమే కాని యందఱకు నర్థమగునదియే కవిత్వ మని పేలవములగు రచనలకు దిగరాదని పై హెచ్చరికవలన గ్రహింపనగును. రచితా పృథగర్థతా గిరామ్—పదములు గాని, అవాంతరవాక్యములు గాని భిన్నార్థకములై యుండవలయును. చెప్పినదానినే చెప్పి పిష్టపేషణము చేయరాదు. "అపు నరుక్తార్థతేతి యావత్" అని వ్యాఖ్య. సూరన పద్ధ ములో దీనినే "పునరుక్తి దోషంబు పొంతఁబోక" యని స్పష్టపఱిచెను.

'నచ సామర్థ్య మపోహితం క్వచిత్'.

"సామర్థ్యం గిరా మన్యోన్య సాకాంక్షత్వమ్" అని వ్యాఖ్య. ఏక వాక్యత కవితలో నుండవలయును. దశ దాడిమాః షడపూపాః అను నట్లుండరాదు. ఇది పైకిఁ జూచుట కేమంత గొప్ప గుణముగాఁ గన్పట్టకున్నను రచనకుఁ బ్రాణమువంటి దని చెప్పక తప్పదు. ఇది రచయిత సామర్థ్యమును సువ్యక్తము చేయును. దీనినే సూరన తనపద్యములో "ఆకాంక్షిత స్ఫూర్తి యాచరించుచును శాఖా చంక్రమక్రియఁ గడవఁ జనక, ప్రకృతార్థభావంబు పాదుకో నదుకుచు ... ... దత్తదవయవ వాక్య తాత్పర్య భేదములు మహావాక్య తాత్పర్యమునకు నొనరఁ బలుక నేర్చుట" అని విపులముగా వివరించెను, 'సామర్థ్యమ్'అని భారవి సూత్రముగాఁ జెప్పఁగా దానికి సూరన భాష్యము కావించెను.

'ఉపపత్తి రుదాహృతా బలా దనుమానేన నచాగమః క్షతః' అనుమాన మనఁగా యుక్తియని యిటనర్థము. అది శాస్త్రవిరుద్ధముగా లేదని ప్రశంస. యుక్తి యావశ్యకమే కాని శాస్త్రవిరుద్ధమైనచో నయ్యది పరిహార్యమే. దీనివలన శాస్త్రసామాన్య విరుద్ధమైన కవిత్వ మేవిధముగను శ్లాఘ్యము కాదని తెలుచున్నది. కనుకనే సూరన శుచిముఖి శాస్త్రపాండిత్యము నట్లుగ్గడించెను. శాస్త్రప్రశస్తిని భారవి "శుచి భూషయతి శ్రుతం వపుః" (2-32) "సుకృతః పరిశుద్ధ ఆగమః కురుతే దీప ఇ వార్థదర్శనమ్" (2-33) ఇత్యాదులలోఁ బలుమాఱులు వెలువరిచినాఁడు. సూరన భారవి యననేల ? మన ప్రాచీనకవు లెల్లరు శాస్త్రములను దలఁదాల్చినవారే.

అస్త్రసిద్ధికై తప మాచరించు నర్జునుకడ కింద్రుఁడు ముని వేషధారియై వచ్చి కొన్ని ధర్మములను బోధించెను. అంత నర్జునుఁడు వాని వాగ్వైభవము నిట్లు ప్రశంసించెను.

ప్రసాదరమ్య మోజస్వి గరీయో లాఘవాన్వితమ్
సాకాంక్ష మనుపస్కారం విష్వగ్గతి నిరాకులమ్ 11-38

న్యాయ నిర్ణీత సారత్వాన్నిరపేక్ష మివాగమే.

1021



సంఖ్య.............
15.2.94
తేది.............

అప్రకంప్యత యాన్యేషా మామ్నాయవచనోపమమ్ 11-39
అలంఘ్యత్వాజ్జనై రన్యైః క్షుభితోదన్వ దూర్జితమ్.
ఔదార్యా దర్థసంపత్తేః శాంతం చిత్త మృషేరివ 11-40
ఇద మీదృగ్గుణోపేతం లబ్ధావసర సాధనమ్
వ్యాకుర్యాత్కః ప్రియం వాక్యం యో వక్తా నేదృగాశయః. 11-41

ప్రసాదము, ఓజస్సు ఆవశ్యక గుణములు. గరీయో లాఘవాన్వితమ్, అనుట పరస్పర విరుద్ధముగాఁ దోఁపవచ్చును. కాని గరీయః=అర్థగౌరవము గలది, లాఘవాన్వితమ్ = విస్తరదోష రహితము, సంక్షిప్తము అని యర్థము. అల్పాక్షరంబుల ననల్పార్థ రచన యని దీనిభావము. సాకాంక్షమ్=సామర్థ్యము కలది. అనుపస్కారమ్—అధ్యాహారాదిదోషరహితము. విష్వగ్గతి = కృత్స్నార్థ ప్రతిపాదకము, కావుననే నిరాకులమ్—అసంకీర్ణార్థకము. న్యాయ నిర్ణీత సారత్వాన్నిరపేక్షమివాగమే-యుక్తి బలముచే నాగమ నిరపేక్షము వలె నుండునే గాని తద్విరుద్ధము కాదని 'ఇవ' శబ్దము చెప్పుచున్నది'. 'అప్ర కంప్యత యాన్యేషా మామ్నాయవచనోపమమ్'. అనుమానాది ప్రమాణములచే బాధ్యము కానిదై వేదతుల్య మయినది అనుటచేఁ గవులు ప్రమాణ విరుద్ధములను వర్ణింపరాదని మరల గట్టి చేయుచున్నాఁడు. 'క్షుభితో దన్వదూర్జితమ్' అనుటచే గాంభీర్య గుణమావశ్యకమని తెలియుచున్నది' 'శాంతం చిత్త మృషే రివ' అనుట ప్రసన్నతా ద్యోతకము.

అవిజ్ఞాతే ప్రబంధస్య వచో వాచస్పతే రపి
వ్రజత్యఫలతా మేవ నయద్రుహ ఇవేహితమ్ (11-43)

ప్రబంధ మనఁగాఁ బూర్వాపరసంగతి. పూర్వాపర సందర్భ శుద్ధి లేనిమాట బృహస్పతి పల్కినను విఫలమగును. "ఒకటఁ బూర్వోత్తర విరోధ మొందకుండ" నను సూరనార్యుని పలుకుల భావము నిదియే.

వరాహముపైఁ బ్రయోగించిన బాణమును దీసికొనఁ జూచు నర్జునుని నివారించుచు వనేచరుఁడు పలికిన పలుకులు విని వానిని బార్థుఁడు కొండాడుచున్న విధము.

వివిక్త వర్ణాభరణా సుఖశ్రుతిః
ప్రసాదయన్తీ హృదయాన్యపి ద్విషామ్
ప్రవర్తతే నాకృతపుణ్యకర్మణాం
ప్రసన్న గంభీర పదా సరస్వతీ (14-3)
భవన్తి తే సభ్య తమా విపశ్చితాం
మనోగతాం వాచి నివేశయన్తి యే
నయన్తి తేష్వప్యుపపన్న నైపుణాః
గంభీరమర్థం కతిచిత్ ప్రకాశతామ్ (14-4)
స్తువన్తి గుర్వీమభిధేయ సంపదం విశుద్ధిముక్తే రపరే విపశ్చితః
ఇతి స్థితాయాం ప్రతిపూరుషంరుచౌ సుదుర్లభా స్సర్వమనోరమా గిరః (14-5)

సమస్య సంపాదయతా గుణైరిమాం
త్వయా సమారోపిత భార భారతమ్
ప్రగల్భ మాత్మా ధురి ధుర్య వాగ్మినాం
వనే చరేణాపి సతాధిరోపితః (14-6)

సుస్పష్ట వర్ణశోభితయు శ్రావ్యయు శత్రువుల మనస్సులను సైతము రంజింపఁజేయునదియుఁ బ్రసన్నగంభీరయు నైనభాష పురాకృత పుణ్యము లేనివారి కలవడదు. "పలుక నేర్చుట బహు తపః ఫలము గాదె" యని సూరన పై యభిప్రాయమునే యింద్రుని నోట వెలువఱిచెను.

ద్వేషించు వారిని గూడఁ బ్రసన్నులఁ జేయఁగలుగుట కవితా వశస్తికి నికషోపలము. కనుకనే "కస్య నారాధ్యతే చిత్త ముద్య

తానే రరే రపి" అని శ్రీరాముఁడు హనుమంతుని వచనములఁ గొని యాడెను.

మనోగతమును మాటలలోఁ జెప్పఁ గలవారు విద్వాంసులలో నత్యుత్తము లఁట. వారిలోను గభీరార్థమును వెల్లడింపఁ జాలినవారు నిపుణు లఁట. కొందఱు అర్థగౌరవమును మెచ్చుకొందురు. మఱి కొందఱు శబ్దశుద్ధినే ప్రశంసింతురు. కనుక నందఱను మెప్పింపఁ జాలు మాటలు దుర్లభము లఁట. "సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలి తార్థయుక్తి లో నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప" నని యీ యర్థమునే నన్నయభట్టారకుఁడు తెల్ల మొనర్చెను.

"ఇన్ని గుణములును నీమాటలలోఁ గలసియుండుటచే నీవు వనే చరుఁడ వయ్యు వక్తలలో ధురీణుఁడవు, అను పార్థుని ప్రశంసవలన నత్కవిత్వ లక్షణము లెట్టివో కవి మనకుఁ దెలియఁ జేసెను.

సంస్కారవత్త్వా ద్రమయత్సు చేతః
ప్రయోగశిక్షాగుణభూషణేషు
జయం యథార్థేషు శరేషు పార్థః
శబ్దేషు భావార్థ మివాశశంసే (17·6)

కవి యిందు శరములకును శబ్దములకును సామ్యమును వర్ణించుచు శాబ్దికులు శబ్దములవలన నర్థమునువలె నర్జునుఁడు శరములవలన జయము నభిలషించె నని చెప్పెను. ఇందు మనకుఁ గావలసినది 'యుప మాన పక్షము'. సంస్కారము గలవగుటచే హృదయమున నాహ్లాదము గలిగించునవి యనుటచే సంస్కారహీనములు ఆనందదాయకములు కాఁజాలవని వేఱ చెప్పనక్కఱ లేదుగదా! ప్రయోగమనఁగా నభి యుక్త వ్యవహారము. శిక్షయన నభ్యాసము. గుణములనఁగా శ్లేష ప్రసాదాదులు. ఇవి శబ్దములకు భూషణములనుటచే నప్రయుక్తాది దోష రహితములయిననే భావప్రతిపాదకములగు ననియు, 'యథార్థములు'

అనుటచే నియతార్థకత్వము శబ్దముల కావశ్యక మనియు భారవి యాశయముగా గ్రహింపనగును.

ఇట్లు భారవియు సూరనయుఁ దమ కావ్యములలోఁ బాత్రముఖమున వ్యక్తీకరించిన సత్కవితాలక్షణములలో శబ్దసంస్కారము అర్థగౌరవము, ఉపపత్తి, ప్రమాణావిరుద్ధత, అక్లిష్టత, సాకాంక్షత్వము (సామర్థ్యము) ఓజః ప్రసాద గాంభీర్యాది గుణములు, పునరుక్తిరాహిత్యము, పూర్వోత్తర సందర్భశుద్ధి, అసంకీర్ణార్థకత యనునవి ముఖ్యములుగా నెన్నఁదగియున్నవి.

ప్రతిపాదకములగు శబ్దములు, ప్రతిపాద్యమైన యర్థము, ప్రతిపాదన విధానము అను నీ మూఁడును నిర్దుష్టములుగా నుండునట్లు కవి యవహితచిత్తుఁడై చేయు కావ్యరచన లోకకల్యాణ హేతువగును. అందులకు వలఁతులు గాని లాతి యులఁతి కవులు కైతలల్లకుండుటయు లోకకల్యాణ హేతువే యగును.



# సూరనార్యుని శారదాపీఠము

నరసింహదేవర ఉమామహేశ్వరశాస్త్రి

సత్కావ్య రచనావిశారదుఁడగు పింగళి సూరనార్యుని యపార పాండితీవైభవమునకు రాఘవపాండవీయము, కమనీయకథాకల్పనమునకు కళాపూర్ణోదయము, మాధురీధుర్యోరువాగ్వైచిత్రికి ప్రభావతీ ప్రద్యుమ్నముఁ బట్టుగొమ్మలు. కళాపూర్ణోదయ కథాకల్పన మొక సాలెగూటి యల్లిక. కథలో పిల్లకథలు, పిల్లకథలలో కొన్ని మర్మములు, మర్మములలోని మర్మములతో మూలకథ కన్వయముఁ గలిగి ఒక మహాసూత్రముగా కథారచనము సాగించిన ప్రతిభాశాలి సూరన. కళాపూర్ణోదయములో సుగాత్రీశాలీనుల గాథ యొక రస సముచితమైన యుపకథ. ఇది కళాపూర్ణోదయమునకు మూలకథ. సూరనార్యుని సాహిత్యమున నిది శారదాపీఠము. సుగాత్రీశాలీనుల కథ కీశారదాపీఠము రంగస్థలము. ఈ రచనము సూరనార్యునిది కాదు. మహాపతివ్రత యగు సుగాత్రి పాతివ్రత్యనిరతికి మెచ్చి ఆదంపతుల చరిత్ర రమణీయముగ, సకలపాపహారిణముగా, ఔచితీమనోహరముగా, ఆదర్శప్రాయముగా వాగ్దేవి శారదయే రచించి శారదాపీఠములోని వారికెల్లరకుఁ గలలో గన్పించి తెలుఁగొకప్రతిని పంచియిచ్చిన మహనీయ కావ్య మిది. గురుని యానతిపై శిష్యుఁడు తెచ్చి మణికంధరుని ముంగలఁ జదువుచున్నాఁడు. గురువర్యుఁడు వ్యాఖ్యానించుచున్నాడు. సూరనార్యుఁడు కళాపూర్ణోదయములోని అన్నికథలకన్న మిన్నగా ఔచితీ గంభీరముగా, సందేశగర్భితముగా, రసోదంచితముగ, కావ్యహృదయముగ నీ సుగాత్రీశాలీనుల గథ రచించుకొన్నట్లు, అతని కీ ఘట్టముపై నొక ప్రత్యేకభావ మున్నట్లు, శారదాదేవి రచనగా చెప్పుకొనటవలన దెలియుచున్నది. అపరిమితపుణ్యగాథ యీయుండుట సముక్తిమున సహా

క్షించి యానందించెడి యాకాంక్షయే యీ నా ప్రసంగము.

కాశ్మీరదేశములోనిది శారదాపీఠము. అందు శారదాదేవిని గొల్చు పూజారిబ్రాహ్మణుని కూఁతురు సుగాత్రి. సరస్వతీ వరమున జన్మించినది. భర్త శాలీనుఁడు అత్తవారింటి యిల్లరికపు టల్లుడు. ఆగంపతుల ప్రథమసమాగమముతో కథ ఆరంభమైనది.

భూషణాదు లెన్నిటినో మేనఁదొడిగి సుగాత్రిని శోభనపుగదికి పంపినారు. ఆలుమగల సరసములు చూచు ముచ్చటకై చెలికత్తెలు చాటుచాటున నిలిచినారు. ఆడంబరముగ ధరించిన ఆ యలంకారముల వైభవములు, దివ్యమాల్యగంధావలేపనముల గుబాళింపులు గలసుగాత్రిని జూచుటతోడనే శాలీనునిలో నేదో మార్పు తోఁచినది. ఆతనికవు డామె సుగాత్రి కాలేదు. ఆపెసౌందర్యాస్వాదనమున నాతఁడు శాలీనుఁడయ్యెను. చేరదీయ లేదు, ఉండి, ఉండి, చూచి చూచి తిరిగి పోయినది. ఇదియెల్లఁ జూచిన బోంట్లు తల్లికిఁ జెప్పినారు. నేఁడేదో జరిగినది కాని రేపు చూడక పోదుమా! అని నవ్వినారు. మంచి యౌవనము గలవాఁడు. అందగాఁడు కదా యనుకొన్నాము. ఇదేమి కారణమో? అనుకొనిరి. తల్లిమనస్సు చివుకు మన్నది.

రెండుమూఁడురోజు లటులనే పుత్రికను కడునలంకారయుక్తను జేసి యల్లునొద్దకుఁ బంపినది. మొదటినాఁటి భావమే ప్రతిదినమున దోఁచినది. పాప మా సుగాత్రికి వట్టి రాకపోక లైనవి. అందగాఁడు నవయౌవనుఁడు భర్త- క్రొత్తదంపతులు-పైఁగా నూత్నసమాగమము. శోభనమూర్తిగా నలంకరించికొని పతిని మెప్పించి సుఖింపఁగోరి రోజు రోజు క్రొత్త క్రొత్తగా నలంకరించుకొని వచ్చుచున్న దా సుగాత్రి! ఆమెయెడనాతఁడు వట్టిశాలీనుఁడు. పేరుపెట్టుటలోనే ఔచితిఁబోషించు సూరనార్యుఁడు ఆపాత్రముల నెంతయో రసనీయోచితముగ నిర్మించెను.

మూఁడునాళ్లును వ్యర్థప్రయత్నమై సిగ్గుపడి పోయినసుగాత్రితోఁ జెలియ లందురు. ఇందెంత స్వాభావికత, వాస్తవికత కలవో చూడుఁడు :—

గీ. పొలఁతి! యాలిమగల పోఁడుము లేమియుఁ
గలిగినట్టి చొప్పు గానరాదు
మీ తెఱంగు చూడ మేల్మేలు దంపతు
లిరువురును వివేకు లేమి చెప్ప?

ఆ. సలిసవదన! యెన్నినాళ్లైనఁ జిన్న కూఁ
తురవు గావు నీవె తొడఁగి పతికిఁ
దగిన సేవ సేయ కగునె యూరక యుండ
నాతఁ డేమియు ననఁ డనుచు నిట్లు.

క. మగవాఁడు భాగ్యవంతుఁడు
మగువకు నొప్పగునె యిట్లు మానపుబిగి క
ట్టిగఁ దాల్పఁ? దనంతన యా
డిగ మిటునటు సేయ నతని డెందము గరఁగున్.

క. గారామునఁ దోడ్తోడన
రా రమ్మనఁ డనుచు మగుడి రానేఁటికిఁ క
య్యారంబుతోడి బాగా
లీరాదో? యాకు మడిచి యీరాదో! చెలీ!

"వెఱ్ఱిదానవైతివి గాని ఓయంగన! భోగములపంటకు ఆమని యగు నీబంగారుయౌవనమును రిత్తశయ్యకు నిచ్చుకొందువా? తగిన ట్లూడిగము జేసి నాథుని వశపఱచుకొని సుఖింపరాదా?'' అనినారు.

ఈ మాటలతో నన్ను బాధింపకుడు. మీయీ మాటలు విన నాకిష్ట ముండదు. అని సిగ్గుతో వెళ్ళిపోయినది. కాని, వారు చెప్పిన యుపాయము లన్నియు పతికడ నుపయోగించినది. అట్టివి నచ్చవని సఖులతో చెప్పినదేకాని భర్తకడ నన్నింటిని ప్రయత్నించి చూచిన

పతిభక్తిపరాయణ ఆమె. ఇది భక్తితోడి యనురక్తికి గుర్తు. ఒక్క యుపాయమును ఫలింపలేదు. భర్త ఆదరింపలేదు. మంగళసూత్ర మీపాటి శుభస్థితి నుండుటయే పదివేలనుకొని తృప్తిపడినది పాపము! అతని కాయురభివృద్ధికరము లని వివిధాలంకారము లెప్పు డేమరక తాల్చుచు, తనతల్లి యాతని నేమియు నట్టట్టాడకుండ ప్రార్థించుచున్న పరమసాధ్వి యా సుగాత్రి! ఆపె శీలము జగదుదాహరణమును లోకోత్తరమును కదా!

భర్తృసుఖ మెఱుఁగని తనకూఁతురు కష్టమును జూచి కుందు తల్లి యిట్లనినది. "ఇట్టి నిష్ప్రయోజకు నెందును జూడఁబోము. నేనే దేని యన్నచో నీవు తిట్టిపోయుదువు నన్ను. నాయీ సమస్తమునకు దిక్కైన యొక్కమగ మొలక నీవలనఁగల్గుననుకొన్నాను. కాని యీతఁడు వట్టిగొడ్డు తాకట్టు. ఎన్నాళ్ళయిన నీతఁ డింతియే! లేవఁగొట్టినచో నిన్ను బాధించుట యగునుగదా! ఇంకేమి ప్రయోజనము! అపూల తోఁటకైన పోయి చూచి రమ్మనుచుండుట మంచిది!" అని ఆపసికై యల్లుని నియోగించినది.

"దివిజనుతయైన శారదాదేవిపూజ కుపకరించు కార్యం బిది" అని మహదానందముగాఁ దదేకనిష్ఠతో నాతోఁటపనులు చేయుచున్నాఁడు శాలీనుఁడు. అత్తగారి ఆలోచనలో అల్లున కదియొక శిక్ష. శాలీనుని భావనలో నది శారదాసమర్పణమున కొక యమృతభిక్ష. ఆతఁడు:—

క. సమధిక మధుమధు గరిమా
సముచంచల చంచరీక సంచయ సంచా
రమనోరమ సుమనోరమ
ణమణిన వ పుష్పతోట [illegible]

సీ. సీరెత్తువేళల సీరెత్తఁ బాడు పా
దునకుఁ గాలువలు పొందుగ నమర్చి
త్రివ్వటంబులతీఱఁ ద్రివ్వటంబులు నెట్టఁ
దగినట్టి కట్టుగుద్దలి గడించి
మెరువుఁ జల్లెడుసావి నెరువుఁ జల్లు గతాళి
మానుఁడై గంపలఁ దాన తెచ్చి
యంట్లొత్తు పదనున నంట్లొత్తు నెలమి గా
న్పించు లేఁగొమ్మలు వంచి వంచి
నారుపోయుంగ వలయుచో నారు వోయుఁ
గొమ్మ నాఁటంగ దగునెడఁ గొమ్మ నాఁటు
నొకటి విసువక యంత కంతకును హెచ్చు
హాళితోడను శాలీనుఁడ నిరతంబు.

ఆదివిజకులప్రసూతుఁడు తద్వనసమృద్ధి గని యెంతయో మురిసి పోవును. వాని కార్యక్రమ మిది:—

క. ఎంతయుఁ బ్రొద్దున లేచి ని
తాంతాచరిత స్వజాతి ధర్ముఁడగుచు ని
శ్చింతుఁ డయి గురుపరంపరఁ
జింతించి తదుక్తజపము చేసి ముదముతోన్.

గీ. నియమమునఁ బువ్వములు గోసి నేర్పు మీఱఁ
బలుతెఱంగుల వింత వింతలుగ మాలి
కలును బొందులు గందుకంబులు రచించి
బ్రహ్మ యిల్లాలికిని సమర్పణము సేయు.

ఇచట శాలీనునిలోఁ గల నిరుపమానమగు శారదాభక్తి, నైష్ఠికత తెల్లమగుచున్నవి. శారదపూజతప్ప నితరప్రపంచ మెఱుఁగని మందుఁడా శాలీనుఁడు. మొత్తము కావ్యములో నెల్ల రెండుమాటలు

మాత్రమే శాలీనుని నోట వచ్చినది. తక్కిన దంతయు నాతని ప్రవర్తనముతప్ప భాషణము లేదు. ఇది గదా పాత్రపోషణములోని ఔచితి!

పతిభక్తిపరాయణనుగాత్రి కిది విషమపరీక్ష. తల్లినోటి దురుసుఁదనము నోర్వలేదు. తోఁటపనులలో నలిగిపోవు నాథుని బడలికలు చూడ లేదు. తల్లిని గాదనలేదు. తోఁటకుఁ బోయి భర్తకుఁ బనులలో సాయపడవలెననుకొనును. ఇల్లు దాఁటి వెడలుటకు సిగ్గుపడును.

శాలీనుఁడు ఆనాఁడు తోఁటలో నున్నాఁడు. పెద్ద పెద్ద మెఱుపులు, ఫెళఫెళమను నురుములు, పెఠీలుమను పిడుగులతోఁ బెద్దవాన వచ్చినది. సమస్తజగ మంధకార బంధురమైనది. లోకమంతయు నుదకమయత్వ మందినది. చిటపొటమని పాట పాట చినుకు లారంభించినప్పటినుండి తోఁటలోని తనపతి యెక్కడఁ దడియునో యని తహ తహ పడిపోవుచున్నది. "ఈఘోరవర్షమున నెట్లయితివో? నీవంటి వాని కీపాపపుఁ బుపుఁదోఁట పాల్పడుటఁ బ్రాప్తము లయ్యెను?" అని కుంగిపోయినది. "ఓదయాశాలినీ! శారదా! నీవే కనిపెట్టి నాప్రాణేశుని గాపాడు" మని మ్రొక్కుకొన్నది. దీన నీమెపతిభక్తి యెంతచక్కఁగానో ప్రదర్శిత మయ్యెను. అంతియ కాదు. ఆమె పతిభక్తి యెంతవఱకుఁ బోయినదో చూడుఁడు—

శా. ఈదేహంబునఁ బూర్వదేహములయం దేనిఁ బ్రతిధ్యానదా
నాదిప్రోద్భవ మేమి యేమి గలదా యాపుణ్య మీవర్ష పీ
డాదోషంబును మత్పతిం బొరయకుండ న్మానుపుం గాత నే
నాదుం గావుతఁ దన్నిమిత్త పతిపాపాక్రాంతికిం బాత్రమై.

ఈ పతిభక్తి విలువకట్టరానిది. ఈ దేహమునఁ జేసినదిచాలదు. పూర్వజన్మములోని పుణ్యమంతయును వర్షాపీడాదోషము తనభర్తకుఁ జెందకుండుటకై ధారవోయుచున్నది. ఇంకను నమ్మకము చాలదు. తానుజేసిన పుణ్యము ధారపోయుటయే కాదు- తత్పాపఫలమునకుఁ

దాను పాత్రమగునఁట. ఆహా ! ధన్యమైన దామె జీవనము !

కులదేవత వాగ్దేవిని ప్రార్థించినది. తత్ప్రసాదమున ఆవాన లోనే తాను దడియకయే తోఁటకుఁబోయి బ్రాహ్మీప్రసాదవిశేషమున నెప్పటియట్ల శుభవర్తనుఁ డైనభర్తను గాంచి మురిసిపోయినది, రెండవకంటివానికైనను జివరకుఁ బతికైనను దనరాక తెలియనీయక ఇల్లు చేరుకొన్నది సుగాత్రి!

కొన్నినాళ్లు గడచినవి. నాథుని యిడుమపాట్లన్నియు నోర్చి యోర్చి యిఁక సహింపలేకపోయినది. లజ్జ విడిచి యొకనాఁడు మానసాభ్యంతరపూర్ణమైన పతిభక్తిచేఁ దల్లిమాట లెక్కచేయక యథారీతి నలంకృతయై నాథుఁ డున్నపూలతోఁటకుఁ బోయినది. అతఁడు చేయు పనులన్నియుఁ జూచినది. తన యలంకాలము లన్నియుఁ దీసివేఱఁబెట్టి యొక సిరిచుట్టువలువ చుట్టుకొని శాలీనుఁడు వల దన్నను వినక పతికిఁ బనులలోఁ దోడై వచ్చినది.

గీ. చిఱుచెమటఁ బేర్చు నింత క్రొమ్మెఱుఁగుతోడఁ
గోమరు మే నొప్ప సారెకుఁ గొప్పు కదల
నేమిటికినైనఁ దా మున్న యేఁగి యేఁగి
యెల్లపనులు నొనర్చి నింపెసక మెసఁగ.

నిరాడంబరము, స్వభావసుందరము, నిసర్గరమణీయము నగు నా సుగాత్రియాకృతి చూచుటలో శాలీనునిమది చలించినది. శరసంధాన మొనరించినాఁడు సుమశరుఁడు. ఒకనాఁటికన్న నొకనాఁడు తనకు గలవైభవము పతికిఁ దెలియవలెనని గొప్పగా నలంకరించుకొని వచ్చెడి సుగాత్రిని గన్నెత్తి చూడలేదు శాలీనుఁడు నేఁటివఱకు! సిరిచుట్టువలువ కట్టుకొని నిసర్గరమణీయమగు తనసౌందర్యమును బ్రదర్శించుచుఁ బరమ స్వాభావికతకు నిలయముగ నున్న సుగాత్రిని బ్రేమించినాఁ డీనాఁడు శాలీనుఁడు. ఇచట సూరనార్యుని కవితాసందేశము ధ్వనితము. కేవల

శబ్దాడంబరములకు, అలంకారములకు ప్రాధాన్యత నిచ్చి యాడంబరత చూపు కృత్రిమసౌందర్యమువంటి కవితకన్న, స్వభావోక్తి గలిగి వాస్తవికత నాచుకొని, మాధురీధురీణమగు కథాకల్పనము గల కవితనే రసజ్ఞుఁ డాస్వాదించునని పింగళి సూరనార్యుని సందేశము. నిరాడంబరయు, నిస్వార్థజీవనయునగునాసుగాత్రి నిసర్గరమణీయసాహిత్యసరస్వతి. దాని నాస్వాదించు సాహిత్యరసికుఁడు శాలీనుఁడు.

ఆ కనుమూస్త్రిని యుద్ధతి నాఁపలేక శాలీనుఁడు "వెఱ్ఱిపసుచ! యెంతమూన్పిన నెఱిఁగెడుదానవుగావు, నీకుఁ దోఁటపనుల కెంతదూరమకటా!" అనెను. ఇది శాలీనుని నోటినుండి వచ్చిన మొదటిమాట. మొత్తముకథలో నీతనినోట రెండుసార్లుమాత్రమే ప్రవచన మున్నది. ఇతఁ డొక మితభాషి.

"వెఱ్ఱిపసుచ!" అని సంబోధించుటలో హృదయమును గరిగించు ననురాగ మువ్విళులూరునుగదా! వట్టి షండుఁడుగ, మందుఁడుగ నింతవఱకుఁదోఁచు శాలీనునిలో ఎంతదయారసము రాగరసముఁ దోఁచినవో! ఒక్క సంబోధనలో! తనయుత్తరీయవస్త్రపు మునికొంగున తన్వి కపోలపుఘర్మబిందువులఁ దుడిచెను. ఎంత నలిగిపోయితి వని యెంతయో తమకమునఁ గౌఁగిలించి, పూఁబోదరింటికిఁ దార్చి మదనమహారాజ్యభోగములఁ దేలించినాఁడు. సుగాత్రి నిఁక కౌఁగిలినుండి విడువలేఁడు శాలీనుఁడు. "ఇవి మిగులఁ గ్రొత్తలు ఇంటికి పోవలెన"ని ప్రియమువల్కి విడిపించుకొన్న దామె. మరల భూషణము లన్నియు బిగించుకొని పతి యాదరణమునకుఁ బట్టరాని సంతోషము నొందుచు నింటి కేఁగినది. వసంతఋతువులోని యెండకు వసివాడి, కనుగందిన వవకుసుమలతిక ఆసుగాత్రి - ఆనాఁడు!

పతి యనుగ్రహము వడసి సంతోషించు నామెముఖవికాసాదులనుబట్టి తన్మనోరథసిద్ధి గుర్తించి సఖులెల్లరు సంతోషించుచున్నారు.

వేళాకోళములతో సరదాగా గడచినది. తల్లియు సంతోషించినది. భర్త స్వాధీనుఁ డయ్యెను. ఈ రాత్రి సుగాత్రి నెప్పటికంటె మిగులఁ గ్రొత్తగా నలంకరించి కేళీభవనమున నున్న పతిచెంతకుఁ బంపినారు తత్సఖులు. కాని తోఁటపనులలో తోడుపడిననాఁటి సహజసౌందర్యము మదిని హత్తి దానినే పదేపదే తలపోయు తాత్పర్యమున నున్న యా శాలీనుఁడు

"అప్పటి తన్వికాలేపనపటాభరణాదుల వైభవోన్నతుల్
దెప్పలు విచ్చి చూడక చరింపనియట్టి పరాకుచేతఁ దా
నెప్పటియట్ల యుండె నతఁ; డింతి కడుం దడవుండి యుండి నా
యొప్పమి యేమిసంఘటిలెనొక్కొ? యటంచు విషాద మొందఁగన్."

కన్నెత్తి చూడలేదు. ఎంతో ఆశతో వచ్చిన సుగాత్రి కిది సహింపరాని యవమానము. చూచి చూచి తిరిగి పోఁబోయినది; కాని అక్కడనుండి వెడలిపోవుటకు నే నెవ్వరిదానను ? దైవ మెటుచేయు నున్న నట్లగును. పతిచెంత పడియుండుటయే తగు ననుకొన్న పతివ్రత యామె! నిలిచి నిలిచి తానే పతి నిట్లుపలుకరించినది. "కడు దిమ్మటచే శ్రమ మొందినారు గాఁబోలును? పోదునా! నిదురవోయెద రే!" అన్నది. అపుడుమాత్రె మాపరాకులో శాలీనుఁడు "ఏకోర్కెనివచ్చితి" వన్నాఁడు. ఇది శాలీనుని రెండవ మాట. ఆకథలో ఆఖరిమాటకూడ! ఆ శారదాభక్తురాలి సమాధాన మిట్ల:—

"లోకమువారలు పతికడ కేకోర్కెని వత్తురు?" అందుపైఁ గూడ నాతనిలో మఱొకప్రవృత్తి లేదు. సహించినది సహించినది. స్త్రీ సహజమగు వాంఛను జంపుకొనలేని యా సుగాత్రి భర్త నిట్లడుగు చున్నది. ఇక్కడ సూరనార్యుని రసపోషణము, ప్రతిభాప్రదర్శనము కొనియాడఁదగినవి. నిరాడంబరమై అత్యంతసహజమై చిన్నగా చొచ్చు కొనిపోయి హృదయమును గదలించు నీ శబ్దములు కూడ్చు ఆకాంక్షగుడై

నైన కరఁగించి తీరును. ఇది సరస్వతీ రచనము !

మ. అకటా ! యేమని దూరుదాన మిము నాథా! వేగుజామయ్యెఁ బొం
దికగాఁ బాదములొత్త రమ్మనుటగానీ, యొంటియేమోకదా
సికటక్షోణికి నేఁగుదె మ్మనుటగానీ! కొంత నెయ్యంపుఁ బూ
నికతోఁ గన్నులు విచ్చి చూచుటయొకానీ లేద యొక్కింతయున్.

ఉ. నేఁ డలతోఁటలో నపుడు నిబ్బరమైన మదీయభాగ్యపుం
బోఁడిమి యేమిపాకమునఁ బొందెనో, మీకృప యట్లు గాంచి, పె
న్వాఁడి దనర్చు నాచనవున న్మిము నిమ్మెయి నంటిఁ గాని యే
నాఁడును బుణ్యసాధ్వికి గుణం బిది గామి యెఱుంగుదు న్మదిన్.

కంతు నంతాపమున వంత నొందుచు "నాథా !

క. రా మైనఁ గొంత మేల్ నా
రాయణ మీ మనసు కంటె రహిఁ నీక నెపుడున్
మీాయంతఁ దడవెదరె యని
యాయంగన యతనిపాద మల్లన పట్టెన్.

పాన్పుపైఁ గూర్చుండి పాలిండ్లపైఁబతిపాదముల నొత్తుకొనుచు,కన్నుల నద్దుకొనుచు, అనగాటపుఁగూర్మిఁ దెల్పుకొన్నది. ఎన్నిరీతులనైన శాలీనుఁడు ప్రకృతమునకు రాలేదు. ఆమాంద్య మేమో సుగాత్రి కర్థము కాలేదు.

"చిత్తము వేఱొకర్తువయిఁ జేసి మరల్పఁగ నేరరేమొ ? మీ
రత్తరళాక్షిఁ దెచ్చుకొనుఁ; డాయక నావశమైనఁ బంపుఁ; డేఁ
దెత్తు నవశ్యముగ్, మఱియు దేవరకుంబలె నవ్వధూటికిం
దొత్తగుచుగ్ పనుల్ సలుపుదు న్నిజ మాడెద దైవసాక్షిగన్."

మీ మదిలోని తలంపేమొ తెలియకున్నది. మీ హృదయమున నెట్టిబాధయు లేకపోపుటయే నాకుఁ గావలయును. ఒకచో నవసర

మైన నన్నమ్ముకొనుఁడు ! నాకు విచారము లేదు" అన్నది. పాదసం
వాహన మొనరించుచు పరిపరివిధముల మాటాడింప యత్నించిన
దా పరమపతివ్రత ! కాని శాలీనుని నోట ఒక్కమాటయు రాలేదు.
కన్నెత్తియైనఁ జూడలేదు. పూఁదోఁటలోని తమ సమాగమము,
అసహజసౌందర్యము, ఆ పనుల తొందర, ఆ వినీతి, ఆ పదిలఁపుఁ
బ్రేమ, ఆ రతులభంగి లోలోననే తలపోసి సంతోషించుచున్నాఁడు.
బ్రహ్మపదార్థమును గుర్తించి సహజానందము నాంతర్యమునఁ బొందు
మహాయోగివలె నా శాలీనుఁడు. అతని కీబాహ్యాడంబరము, అలంకృత
పత్నీసౌందర్యము హేయము లైనవి.

ఆ పతిసేవావ్రతకు పాదసేవతోనే తెల్లవారినది. మఱునాఁడు
మరల పూఁదోఁటకుఁ బోయినది. అలంకారము లన్నియుఁ దీసి వేఱ
పెట్టినది. పనులలోఁ బతికిఁదోడైనది. పతియాదరణము నంది తనిసినది.
'తన్మతికి వట్టిసొంపులేగాని భూషణా లింపు గావు' గుర్తించినది. నాఁటి
నుండి దినదినమును దోఁట కేఁగుచు, అలంకారరహితయుగాఁ బతియాద
రణము లంది, ఇష్టరతుల నలరించుచున్నది. ఇది ఈమెకు ధన్యత.

తల్లికిఁ దెలిసినది. కూఁతురుకాపురము కుదుటఁబడిచాల సంతో
షించినది. కాని ఆమెలోని యావేదన వేఱు !

"అమ్మ ! సరస్వతీవ్రతమహత్త్వమునన్ జనియించి తీవు నా
కిమ్మగ సర్వధర్మములు నీవ యెఱుంగుదు, వంశమెల్లఁ బూ
తమ్మగు నీదుచర్య నని ధాతపడంతియ యానతిచ్చె; న్స్వ
ప్నమ్మున వచ్చి తావకగుణంబులు చూచినయట్లు గట్టిగన్.

"భర్త దేశాంతర మేఁగినను నీసంతతి నాముప్పున కగునని తజ్జ
ననమున కెదురు చూచుచున్నదానను. భర్త నిన్నాదరింపకుండుటచే
నాయాశ విఫలమైపోయె నని తలంచితిని ఓర్చుకొనలేక, విసిగి, విసిగి
నీపతి నేమాడినను నీవు సహింపక నన్ను నిందించెడి నీచందము చూచి

నీవు పతివ్రతలలో మేల్బంతివని తెలిసికొంటిని. నీకుఁ గళంకము లేదు. చిన్నతనమునఁగూడ నీపతి నెవ్వరేని చిన్నమంత మాటాడినఁ గోపగించెడిదానవు. పొరపాటుననైన నితరులగొప్ప విమర్శింపవు. ఎందును పతిభక్తికిఁ గొదువ రానీయవు. చూచిన దైవతము నెల్ల అతనిపుష్టికే వేడుదువు. అతనితోడనే నీ సర్వమును.

క. రాతిరి పగళ్ళు దృఢనే
వాతాత్పర్యమున నున్నవార లటుండన్
నీతోడ మాటలాడుం
బాతివ్రత్యమునఁ గాదె భారతి కృపతోన్.

క. ఓ తల్లి! కొదువ యొక్కటి
నాతలఁపునఁ దోఁచినది వినన్ వలయు గుణా
న్వీతుండు గాని సుతుఁడు ప్ర
సూతుం డగునఁట యకాలసురతక్రియలన్.

క. ధవళాక్షీ! వయసునఁ బి
న్నవు గాని వివేకగుణమునన్ మిక్కిలి పె
ద్దవు నీకుం దెలియని య
ట్టి విధినిషేధము లెక్కడివి తలపోయన్.

ఈ తల్లి మాటలకు సుగాత్రి సమాధానము పరిశీలింపుఁడు. దీనిలో సుగాత్రి శీలము ప్రత్యక్షరమునను ధ్వనించుచున్నది. సరస్వతిని మెప్పించిన సమాధాన మిదయే.

చ. వరునకు నెద్ది యింపది సువర్తనగాఁగ దదప్రియం బప
చ్చరితముగాఁగ నెన్నుదు నిసర్గము నాకిది మానరాద, యీ
శ్వరుఁడును వేదముం గురుఁడు సర్వము భర్తయ, యేఁ దదాజ్ఞను
ద్ధరముగఁ జేయుచున్ విధినిషేధము లెన్నియుఁ గైకొనన్ మదిన్.

క. విను మెయ్యదియు నిషిద్ధం
బని విడుచుట లేదు విహిత మని చేయుట లే
దనుమానింపక యెద్దియుఁ
బెసిమిటి యొల్లనిది విడుతుఁ బ్రియ మొనరింతున్.

ఈ జవా బెంతయో గంభీరసాభిప్రాయమై ఆమె జీవితమున కంతకు ధన్యత చేకూర్చినది. భర్త్రాజ్ఞ తప్ప విధినిషేధములు గణింపదట! పతి కిష్టమైనది చేయుట, ఇష్టములేనిది మానుట! ఇవి యామెక ధర్మములు. ఈమె పాతివ్రత్యపోషణమునకు సూరనార్యుని యీ రచనము ప్రబలోదాహరణము.

శారదా సాక్షాత్కార మైనది. పతిభక్తికి మెచ్చినది. ఎంతయో గారవించినది. ఆమె తల్లితో ని ట్లన్నది :—

"అమ్మా! ఈ సుగాత్రివర్తన కేమియు వంకలు దిద్దఁజూడకుము. సుస్థిరమైన పతిభక్తిచే నిజపాపంబ కాదు, నీయుభయవంశముల పాపోత్కరములు నాశనము చేసినది. ఇంతియ కాదు. ఈమె కథ నా కత్యంత ప్రీతిపాత్రము. పరమపవిత్రమైన దీనిచరిత్ర నేనె రచించి లోకమున నాదర్శముగా వెలయింతును" అన్నది.

ఈ పుణ్యదంపతులచరిత్ర నెంతయో రమణీయోచితముగ నిర్వహించి స్వాభావికతకుఁ బ్రాధాన్య మొసఁగి స్వీయకవితానందేశము నందించినాఁడు సూరనకవి. అద్వితీయకథాకల్పనకు స్వభావోక్తితో మెఱుఁగు లద్ది జానపదత్వ ముగ్ధత్వ దోషంబునంజేసి మున్నత్యంతాపూర్వవస్త్రభూషణాద్యాడంబరమునం దలంకి, తదలంకృతపత్నీరూపంబు సేవగించుచు, అత్తన్వి తోఁటపనులలో నాఁకులితంబైన విచ్ఛిత్తి విలసితాకారంబు మనంబున హత్తి యితరంబు నెఱుఁగని మితభాషిగా శాలీనుని దీర్చినాఁడు. రాఘవపాండవీయరచనమునాఁడు తన కున్న ఆలంకారిక శాబ్దికాడంబరముల యాశయమును మార్చుకొని, స్వభా

వోక్తి, నిసర్గరచనా సౌందర్యము, రమణీయకథాకల్పనము తనయాశయ
ములుగా లోకమునకుఁ దెలుపుకొన్న మహనీయుఁడు పింగళి సూరన్న.

'కళాపూర్ణోదయ మొక సాహిత్య మహాపీఠము.'
'సుగాత్రీశాలీనుల కథ యొక శారదాపీఠము.'

ల. వి. చలువగల వెన్నెలల దెలుపునకు సౌరభము
గలిగినను, సౌరభముఁ జలువయుఁ దలిర్పం
గొలుపు పెనఁగు కప్పురపుఁ బలుకులకుఁ గోమలత
నెలకొనిన, శౌరభముఁ జలువ పనయుం గో
మలతయును గలిగి జగముల మిగులఁ బెంపెసగు
మలయపవనంపుఁ గొదమలకు మధురత్వం
బలవడిన నీడు మఱి కల దనఁగవచ్చుఁ గడు
వెలయుఁగల యీ సుకవి పలుకులకు నెంచన్.

---

# అధ్యక్షోపన్యాసము

ఆకుండి వెంకటశాస్త్రి.

ఆంధ్రసోదర మహాశయులకును శ్రీ కవిసార్వభౌములకును నమస్కారము. వార్ధకముచే లోపించిన దేహబల విజ్ఞానబలములతో నున్న నేనీ మహాసభలో నధ్యక్షపీఠమునఁ గూరుచుండవచ్చుట సాహసము కాకపోదు. అయినను, నా ప్రాఁతపండితమిత్రులను నూతనమిత్ర మహాశయులను దర్శించి తత్పరిచయ భాగ్యము గలిగించుకొనుట కిదె యదనని యాసతో వచ్చితిని. నేఁడు జరుగుచున్న పరిషత్కన్యావార్షిక పంచదివసవివాహమహోత్సవములో, నొకనాఁటి పౌరోహిత్యము నెఱపుటకుఁ "దూరస్థా పర్వతా రమ్యాః" అనునట్లు మిన్నగాఁ జూచి, నన్నాహ్వానించుచు శుభలేఖ వ్రాయఁగాఁ దత్కార్య నిర్వహణమున కంతగా సామర్థ్యము లేనివాఁడనయ్యు సమ్మతించిన నా సాహసమును క్షమింప వేఁడుచు నా మిత్రులకు మఱియొక నమస్కార మర్పించుచున్నాను.

వెనుకటివలెఁ గాక నానాఁటికి, భాషోద్ధారకులలోను కళారాధకులలోను, దేశసేవకులలోను గ్రొత్త వేఁడిరక్త ముద్భూతమగుచు, నూతనోత్సాహములు జనించి వాని యభివృద్ధికై ప్రోత్సాహకరముగ, వార్షికోత్సవములును వర్ధంతులును, జయంతులును, జన్మదినోత్సవములును, శతదినోత్సవములు నను పేరను మహోత్సవములు జరుపఁబడుచున్న వనుట క్రొత్తమాట గాదు. అట్టి యుత్సవములలో, నీయాంధ్ర సాహిత్యపరిషద్వార్షికోత్సవ మొకటి ప్రధానమైన దని మనవిచేయుచున్నాను.

ఈ ప్రాంతములందె గాక, యిప్పురమునందును నాకన్న నెన్నో విధముల సమర్థులైనవా రున్నను, నన్నాహ్వానించినందులకు, నా మిత్రమహాశయులకు, ధన్యవాదము లర్పించుచున్నాను. మఱియొకటి. మిగిలిన పండిత మహాశయులకంటె, నాకీపరిషత్తుతోఁ గొంత సంబం

ధము గలుగుటంబట్టియు, నేనీకార్యమునఁ బాలుగొనుటకుఁ బూను కొంటిని. ఈ పరిషత్తు, దేశాభివృద్ధికి మూలమగు భాషాభివృద్ధికిఁ దోడ్పడుటకై యారంభింపఁబడిన దనుట కల్ల మాటగాదు. దీనికి, మహారాజశ్రీ జయంతి రామయ్య పంతులుగారు ప్రేరకులైరి. వారి ప్రోత్సాహమున, శ్రీ శ్రీ శ్రీ పిఠాపురము మహారాజావారు, సకల కార్యభారమును వహించిన మహాశయులును మహోదారులును నై మహాయశ మార్జించిన మహనీయులు. వారిరువురకును నాధన్య వాదములు.

ఇంకొకటి. యీపరిషత్తు ప్రభవించుటకు ముఖ్యకారణ మొకటి. ఆదినములలో వ్యావహారిక భాషతో గ్రంథములు గూడ వ్రాయవచ్చు ననియు, భాషాభివృద్ధి కదియే ముఖ్య సాధన మనియు నొక గాలి దుమారము చెలరేగినది. దాని నణఁచుటకీ పరిషత్తును నెలకొల్పి, మఱియు సన్నయాదులనుండి వ్యవహరింపఁబడుచు వచ్చుచున్న ప్రామాణిక సలక్షణభాషను నిరూపించుటకై తలంచి, యాంధ్రభాషాజననికి స్థిరత్వము గలిగించి భ్రష్టత గలుగకుండఁ జేయుటకు మహోదారులగు శ్రీశ్రీశ్రీ రాజావారు లక్షలకొలంది ధనసాహాయ్య మొసఁగి దీని కను బంధముగా నాంధ్రభాషకు సమగ్రమగు శ్రీ సూర్యనారాయణాంధ్ర నిఘంటువు అను పేర నిఘంటువును గూడ వ్రాయింపించ నారంభించి తత్కార్యమును, మంచి ప్రసిద్ధులైన పండితులను నియోగింపఁ దత్కా ర్యము చక్కఁగ సాగుచుండెను. అప్పటికి నేను, శ్రీ విజయనగరము మహారాజావారి సంస్కృతకళాశాలలోఁ బ్రధానాంధ్రోపాధ్యాయ పదము నుండి విశ్రాంతుఁడనై యుంటిని. అపుడు మఱియొక పండితుఁడు నిఘంటు కార్యములోఁ గావలసి వచ్చెను. ఆమహారచనా ప్రయోగము నందు నన్నొక ఋత్విక్కుగా నిలుపుటకుఁ దలఁచి, నామిత్రులయు శిష్యులయుఁ బ్రేరణమున, నప్పటికిఁ బ్రధానకార్యదర్శులుగా నున్న

బ్రహ్మశ్రీ॥ వేదమూర్తి॥ కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిలవారు, శ్రీరాజావారి యనుమతిపై నన్నాహ్వానించిరి. అప్పుడు నేనా నిఘంటుకార్యమునఁ బనిచేయుట కుత్సహించి యీ కాకినాడకు వచ్చితిని. కొంతకాలము పనిచేసితిని. కావునఁ గొంత నాకీపరిషత్తుతో సంబంధము గల్గుటయు నారాక కవకాశ మున్నది.

కొందఱు మహాశయులు నేఁటికిని, భాషలో స్వేచ్ఛయే, తదభివృద్ధికి నిమిత్తమని తలంచి, యీ మార్గమును బలపఱచుటకై ప్రసంగించుచున్నారు. అభినవ కవులు దానికిఁ దోడ్పడుచు సింహనాదములు సేయుచున్నారు. మఱియుఁ బ్రాచీన కవితామార్గములు తృణావృతములు కావలయుననియు, భాషయందుఁ గూడ నూతనత్వ మేర్పడవలెననియు సభలలో నుద్ఘోషించుచున్నారు. మఱియొక మాట. నేను విశ్రాంతి తీసికొనియున్న కాలములో శ్రీ వావిళ్ళవారు గద్యరచనలో శ్రీ దేవీ భాగవతము వ్రాయుఁడని కోరిరి. వారి కోరికపై వ్రాయుచు, సత్యవతీ పరాశరుల సమాగమ సందర్భమునందుఁ, దద్ఘట్టము పద్యములు వ్రాయ నుత్సాహము గలిగి వ్రాసితిని. ఆనాఁడే విజయనగరమున నొక కవిసమావేశమున నాకాహ్వానము రాఁగా, నప్పుడు వ్రాసిన పద్యములే తత్సభలోఁ జదువఁ దలంచి వెళ్ళితిని. ఆనాటి సమావేశమున నొక యాభానభావకవి, సభాధ్యక్షుఁడై యధ్యక్ష ప్రసంగమున నిట్లు సెలవిచ్చెను. "ప్రాచీన కవితాభవనములన్నియుఁ బునాదులతో నున్మూలితములై యా తావులందు, నూతన కవితాభవనములను నిర్మించినఁ గాని దేశము బాగుపడఁజాలదు". అను వారి ప్రసంగమునకు నాకు వెగటు గలిగి "అ కవితాభవనములు దేవ నిర్మితము లగు దేవాలయముల వంటివి. అవి యేనాఁటికిని జెడవు. అవి దర్శనీయములును, సంభావనీయములునై తమవాతి [illegible] వాద ర్శములుగా నుండక తప్పదనియు నేను సుంయమనా చెప్పె. పిమ్మట నా

10 పద్యములు చదివితిరి. వాని కతఁడొక్కఁడు దక్కఁ దక్కిన సభ్యు లామోదించిరి. కవితామార్గమునఁ బచ్చిదనము గలుగ కుండ భావము లుండునట్లు, వృత్తాదులందును నూతనత్వము వద్దని నేను మనవి చేయను. అట్టి నాయభిప్రాయమున కనుకూలముగఁ బద్యరచన చేయు భావకవి మిత్రులు పలువురు లేకపోలేదు. కాని భాషను భ్రంశము చేయుట మాత్రము నా కిష్టము లేదు. ఆ విషయమున, గ్రామ్యగ్రాంథిక భాషా వాదులకుఁ బరస్పరము పెక్కు యుద్ధములు జరిగినవి. దేవుని విష యము, మత విషయము, భాషావిషయము పెద్ద మార్పులు తెచ్చుట దేశాభివృద్ధికి నిమిత్తము గాదు. అట్లు భాషోద్ధారణకై జనించి, పాటు పడుచున్న యీ పరిషత్తు మిక్కిలి శ్లాఘనీయము. ఇది మఱియు నానాఁటి కభివృద్ధి నొందుఁగాక యని నేను గోరుచున్నాను. దీనికై చేయు, నిమ్మ హోత్సవము ప్రశంసనీయము. ఇట్టి మహోత్కృష్ట కార్యమునకు మూలపురుషులగు శ్రీ పిఠాపురము మహారాజా వారును, వారి కుటుంబ మారోగ్యాద్యభివృద్ధుల నందుఁ గాక యని భగవంతునిఁ బ్రార్థించు చున్నాను.

మఱియు నీ పరిషత్కార్య నిర్వాహకులగు శ్రీ దంటు భాస్కర రావు గారికిని, శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రుల వారికిని, శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రుల వారికిని ధన్యవాదము లర్పించుచు నింతతో ముగించుచున్నాను.

ఓం తత్సత్.

# ఆంధ్ర సాహిత్యము

## అపరాధపరిశోధకనవలల స్థానము.

వి. వెంకటరామమూర్తి.

ఆంధ్రసాహిత్యము నన్నయ కాలమగు పదునొకండవ శతాబ్దము మొదలుకొని నిరంతరముగ నభివృద్ధి పొందుచున్నది. తత్పూర్వమున భాషాసాహిత్యముల రూప మెట్లుండినను వాగనుశాసనుని కాలముననే సుదృఢమగు పునాది భాషా సౌధమునకు నిర్మింపఁబడినది తదనంతరము తిక్కన, ఎఱ్ఱాప్రెగడ, పోతనాది మహాకవీశ్వరుల లేఖకల నుండి ఇతిహాస, పురాణ రూపక అమృతధారలు వెల్లివిరిసినవి. నాచన సోముఁడు, శ్రీనాథుఁడు, పింగళి సూరన, ఆంధ్రభోజుని యాస్థానము నలంకరించిన యష్టదిగ్గజములు మొ॥ ప్రబంధకవుల ధవళయశశ్చంద్రికలు దిగంతవ్యాప్తము లయినవి. పిమ్మట పదునేడవ, పదునెనిమిదవ శతాబ్దములయందు వచనవాఙ్మయము వ్యాపింప నారంభించెను. నాటకములు, కథలు, యక్షగానములు, సంకీర్తనములు, మొదలగునవి భాషానతి కలంకారములై విలసిల్లినవి, అలంకార శాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము మొదలుగాఁగల యనేకశాస్త్రము లాంధ్రభాషలో జనించినవి. పందొమ్మిది, యిరువదియవ శతాబ్దములయందు నాటకములు, కథలు, నవలలు, దేశచరిత్రాదు లనేకములు వెలువడినవి. ఇవ్విధమున ఆంధ్రసాహిత్యము ప్రతి శతాబ్దమునందును ననేకమార్పుల నొందుచు, ఆనాఁటికవి పండిత ప్రజల భిన్నభిన్న రుచుల ననుసరించి వృద్ధినొందినది.

ఏభాషయైనను దేశ, కాల, పరిస్థితుల ననుసరించి యనేక పరిణామములకు గుఱియగుచుండును. ఆనాఁటి రాజకీయపరిస్థితులు, ఆర్థిక సంక్షోభములు, రాజాదరణములు, ప్రజల మనః ప్రవృత్తులు, సాంఘిక స్థితులు మొదలైన హేతువులే యానాఁటి సాహిత్య నిర్మాణమునకు మూలములు. కొన్ని సంవత్సరములు కవులవాంఛ లోకేచ్ఛ పునకు

మొగ్గియుండును. కాలాను గుణముగ వారి హృదయ వాంఛలు విభిన్నవిషయములయందు లీనమగును. ఈ కారణముననే సుమారు పదునేడవ శతాబ్దమువఱకును బద్యకావ్యములయందే కవులదృష్టి యాకర్షింపఁబడి, తదుత్తరభాగమునుండి వచన సాహిత్యాదుల యెడ మరలింపఁబడినది. పెక్కు మార్పుల నొందుచుండిన యాంధ్రసాహిత్యము ఈ యిరువదియవ శతాబ్దమునను మార్పులనొందినది. ఈ నవయుగమున నాంధ్రభాషా సాహిత్యమందుఁ బొడసూపిన పరిణామములలో నపరాధ పరిశోధక నవలల యావిర్భావ మొకటి. ఈ ప్రత్యేక తరగతికిఁ జెందిన నవలల యొక్క చరిత్రము, వాని ప్రస్తుత సాహిత్యమందలి స్థానమును, గుణగణములను విపులీకరించుటయే నా యీ వ్యాసము యొక్క ముఖ్యోద్దేశము.

ఆంధ్రభాషయందు పెక్కు తరగతులకుఁ జెందిన నవలలు వెలువడినవి. అందు చరిత్రాత్మకములు, సాంఘికములు, జానపదములు మొదలగునవి ముఖ్యములు. ఇట్టి నవలా వాఙ్మయమునకుఁ జెందిన అపరాధ పరిశోధకనవలల విమర్శన మాంధ్రులమైన మనయొక్క విధియై యున్నదిగదా! 'నవల' యనునది నిజమునకు మన భాషయందులేదు. ఇది కేవలము అన్యదేశ గృహీత సాహిత్యము. ఇట్లే యీ పరిశోధకనవలల యొక్క జననము కూడ నన్యదేశములకు సంబంధించినదియే! ఆంగ్ల సాహిత్యమునందుఁ గల "డిటెక్టివు" నవలలే వీనికి మూలాధారము. వారి నవలల నాధారముగఁ గొని మనదేశమందు వంగభాషయందునేక యపరాధ పరిశోధక నవలలువెలువడినవి. ఇందుఁ గొన్ని స్వకపోల కల్పిత కథాసన్నివేశములు గలవి. మఱికొన్ని ఆంగ్ల నవలల నాధారముగాఁ గొని రచించినవి. ఆంధ్రమునందు నీ కోవకుఁ జెందిన నవలలను ప్రప్రథమమున, నవలా వాఙ్మయము నత్యున్నత స్థితికిఁ దెచ్చిన వేంకట పార్వతీశ్వర కవులు వంగభాషనుండి

భాషాంతరీకరణముఁ జేసిరి. వీరు ప్రధాన కథను గైకొని భాషాంతరీకరించుట యందు స్వభాషాభిమానమును వ్యక్తపఱచిరి. ఈ నవలల యందు దొంగతనము లేక హత్య లేక మఱియొక నేరమో జరుగును. ఆ నేరముఁ జేసిన దోషిని పట్టుకొనుట కొఱకు పరిశోధకుఁడు లేక పత్తేదారుఁడు (ఆంగ్లమందు "డిటెక్టివ్") ను అతని ప్రజ్ఞాధురంధరతయు, కౌశలమును, విషయజ్ఞానమును వ్యక్తపఱచుచు, అపరాధిని పట్టుకొనుటయే యీ నవలల మూలోద్దేశము. వీనియందు అద్భుత, భీభత్స, భయానకరసములు పోషింపఁబడును. పాఠకుని భయోద్రేకములయందు ముంచి, పరిశోధకుని ప్రజ్ఞను నిరూపింపఁ జేయును. ఈ సాహిత్యము కేవలము పఠితల మనస్సుల కామోదము నిచ్చుటకే నిర్మింపఁబడినవి. ఇఁక నిందలి గుణములను పరిశీలింపవలయును గదా!

వంగభాషనుండి యనువదించిన వేంకట పార్వతీశ్వర కవుల గ్రంథములు చదివిన పాఠకులకు నాయా గ్రంథముల యుత్కృష్టత తెలియక మానదు. నవలయందు వాడిన భాష గ్రాంథికభాష; భాషయందును నిర్మల గంగా ఝరులను మఱపించు కల కల నినాదములతో రసము స్ఫురించుచుండును. పాత్రలను ప్రవేశపెట్టుటయందును, విభిన్న వ్యక్తి తత్త్వములను స్పష్టీకరించుటయందును, ఔచిత్య సంభాషణములను వారి నవలల ప్రత్యేకత. అసహ్యశృంగారము, గ్రామ్యభాషా రచన వీరి నవలలయందు మచ్చునకైనను గానరావు. ఇట్లుద్భవించిన అపరాధ పరిశోధక నవలా వాఙ్మయము వేంకట పార్వతీశ్వర కవుల యనంతరము క్రమక్రమముగ వృద్ధిగాంచినది. కాని వారి రచనలయందలి ప్రత్యేకత తక్కిన నవలలయందుఁ గానరాదు. పాఠకుల మనస్సును హరింపవు. పిమ్మట వాని వ్యాప్తి కూడ తగ్గుముఖము పట్టినది. కాని మరల నీ మధ్య నీ సాహిత్యము తలయెత్త నారంభించినది. అనేక నవల లనేకుల నుండి వెలువడినవి. ఇప్పటి నవలలందు వాడిన

భాష కేవలము గ్రామ్యపదభూయిష్ఠము. గ్రాంథికభాష మృగ్యము. కథాగమనము ఆంగ్ల సంప్రదాయ బద్ధము. భావగాంభీర్యమును, అర్థస్ఫూర్తిని దెల్పుపదము లనంతములుగ నుండ గ్రామ్య భాషాపోషకము లగు పదముల యనుసంధానము ఈ నవలల ప్రత్యేకాకర్షణ. ఇఁక రసస్ఫూర్తి, భావద్యోతనముల విషయమైన నేకొద్ది నవలల యందో తప్ప, మిగిలిన వానియందు యల్పము లేయనవచ్చును. పోషింపవలసిన అద్భుత, భయానక, భీభత్సరసములకు బదులు అసభ్యశృంగారరసములు నిండినవి. ఏ కొలఁది నవలలో తప్ప మిగిలిన వన్నియు ననేకదోషపూర్ణములై భాషానతి క్రగ్గు దెచ్చుచున్నవో యనునట్లున్నవి. వీనియం దుపయోగింపఁ బడిన భాష నాడుకభాష, లేక గ్రామ్యభాష యగుటచే భావమెట్టి వారికైనను సువ్యక్తమగును. తత్కారణమున విద్యార్థుల మనస్సులు వీనియందే లగ్నములై యుండుటచే వాని ప్రభావ మీ విద్యార్థి లోకమున నధికముగ బ్రసరించిన దనవచ్చును. మహాకవి విరచితములగు మహోత్కృష్ట జగత్ప్రసిద్ధ గ్రంథజాలము సాగర సదృశముగ నుండ నీ తెగకుఁ జెందిన నవలలు విద్యార్థుల మనముల కెక్కుట గడు శోచనీయము.

ఏవిషయమున నాలోచించినను నీ గ్రంథముల వలనఁ గల్గు నుపయోగములు, ప్రయోజనముల కంటె నష్టములే లెక్కకు మిక్కిలిగ గోచరించు చున్నవి. ఇట్టి నవలాపఠనము వలన భాషాజ్ఞాన మలవడదు, పూర్వ మహాకవి పండిత ప్రకరముల మృదుమధుర గంభీర భావములు గానరావు. ఇఁక నివి నీతిబోధకములా యనిన నదియుఁ గాదు, ప్రపంచజ్ఞాన మలవడుననిన నదియు స్వల్పము. ఈ నవలలు చోరశిఖామణులకు చింతామణులవంటివి. వారి కృత్యముల కివి యధిక సహాయ మొనర్చును. అయిన నొక సందేహము జనింపవచ్చును. ఈ నవలలు రక్షకభటవర్గమున కధికముగ లాభదాయకము లనిన నివ్వి

పాతముగ విమర్శించిన నదియుఁ గొంత సత్యమే. కాని ఆయా నవలల యందలి వాతావరణము సంభవించుట మిక్కిలి కష్టము. అంతే గాక యందలి యపరాధుల దోషములు (ప్రమాదజనితములు) దెలియుటచే నాయాదోషములు రాకుండ యత్నింపఁ బ్రయత్నించుటకుబదులు అపరాధులకు దోహదమిచ్చును. ఏతత్కారణమున రక్షకభటులనేక క్లిష్టపరిస్థితుల నెదుర్కొనవలసిన యావశ్యకత యేర్పడును.

ఇంతియు గాక దేశకాల పరిస్థితులననుసరించి మెలఁగుట యవశ్యకర్తవ్యము గదా! మన దేశస్థితులను సంపూర్ణముగా, నవగాహన మొనర్చుకొనిన, ఈ సాహిత్యమును ప్రోత్సహించుట యెంత యనావశ్యకమో స్పష్టమగును. మన యాంధ్రదేశములో భాషాపోషకుల సంఖ్య యత్యల్పముగ నున్నది. పూర్వము భాషాభిమానులును, పండితాదరణ నిష్ఠులును నగు మహారాజు లనేకులుండుటచే భాషాకల్పవృక్షము నిరంతర నవశాఖా యుతమై, నయనసుందరమై విరాజిల్లినది. ప్రస్తుత యుగమున నారాజాస్థానములు, ఆదరాభిమానములు నశించినవి. తమయెడఁ గలిగిన యాదరణచే వారు ప్రభువనజ్ఞ గొని యనేక గ్రంథముల రచించిరి. కాని యిప్పుడట్టి సౌకర్యములు లేకపోవుటచే కావ్యనిర్మాణ దక్షులు గాని, సాహిత్యమును బెంపొందింప నానశక్తి గల వారు గాని చాల అరుదుగాఁ గన్పట్టుచుండిరి. కేవలము గీతములు, వ్యాకరణ ఛందోనియమ రహితములగు భావగీతములు మాత్రమే వెలువడుచున్నవి. పూర్వకవుల ప్రజ్ఞా దక్షతలు వీరియం దత్యల్పము. అట్టి మహా సంక్షోభమగు నీ నాఁటి భాషాసాగరమున నిట్టి నవలా ఝంఝూమారుతములు వీచిన యెడల నెట్టిపరిస్థితు లుద్భవించునో యూహాతీతములు.

ఈయుగకాలము ననుసరించి యీ నవలల యాధిక్యత నిర్ణయింప యత్నించిన, నదియుఁ బునరుక్తి దోషమే యగును. జగత్తం

తయు మహాకల్లోలములగు రాజకీయపరిస్థితులయం దల్లల్లాడి పోవుచున్నది. ఈ నాఁటి పరిస్థితి నిన్న లేదు. నిన్నటిపరిస్థితి ఈరోజున లేదు. భవిష్యత్తున మాఱకుండు నను నాశ లేదు. విజ్ఞానశాస్త్రము పుటవధుల దాఁటిపోఁ బ్రయత్నములు జరుగుచున్న యీయుగమున. అణుశక్తిచే ననేక మారణయంత్ర పరిశోధనలు జరుగుచున్నవి. కలియుగ ప్రభావ మిప్పటికే యిట్లున్నచో నిఁక ముందెట్లుండునో గదా! పైఁగా ప్రపంచమందలి నేరస్థుల సంఖ్య పెచ్చు పెరుగుచున్నది. ఆధ్యాత్మిక చింతన, నిర్మలస్వభావము నడకలు నంతరించుచున్నవి. నిరీశ్వరవాదము ప్రబలుచున్నది. ఇట్టి పరిస్థితులయం దీనవలా వాఙ్మయము ప్రజల నిశ్చల స్వభావముల నుండి మరలించి దేశానర్థదాయకములగు కృత్యములకుఁ జేయూఁత నొసఁగఁ జాలియున్నవి.

వివిధానర్థక ప్రదములే యైనను ఈనవలల విశిష్టత వానికున్నది. కాని యట్టి విశిష్టస్థాన మలంకరించు నవల లత్యల్పసంఖ్యాకములు. గ్రాంథికభాషతో భావ రసస్ఫూర్తులు సమ్మేళనముఁ జేయఁబడి మృదు మధుర ద్రాక్షాపాకముచే మేళవింపఁబడినపుడే యుత్కృష్ట నవలలని యెంచఁబడును గదా! ఇటు భాషావాఙ్మయమున కెంతమాత్రమును గొడ్డలిపెట్టు గాక, అటు ప్రజలను శాంతి మార్గముల నుండి మరలించి యుద్ధోన్మార్గగాములను జేయని వాఙ్మయ మెంతయు వాంఛనీయమే గదా! ఏదియెట్లున్నను పైన వివరించినట్లు దేశకాలపరిస్థితులను సమగ్రముగ సమీకరించి, పరిశీలించిన యెడల, ప్రస్తుతయుగమున కావాఙ్మయమంత యావశ్యకముఁ గాదనియే తోఁచుచున్నది. ప్రస్తుత పరిస్థితుల కనుగుణముగ ప్రవర్తింపవలయును గదా!

ఏ నవల గాని, కథగాని, పురాణేతిహాస సంబంధమగు నుపాఖ్యానము గాని చదివినయెడల,తదుత్కృష్టత తత్క్షణమే యెఱుకకు రాదు. ఏ గ్రంథము గాని పఠించిన వెనుక, విశ్రాంతి సమయమునందు తద్గ్రంథ

సంఘటనములు స్మృతిపథమునకు వచ్చి హృదయ కమలమును వికసింపఁ జేసి యానందవారాశి నోలలాడింపఁ జాలినపుడే యాగ్రంథ ప్రాశస్త్య మెల్లర కవగాహన మగుటయే గాక జగద్విఖ్యాతి మగును. కావున నొక గ్రంథము యొక్క శ్రేష్ఠత పఠించునపుడు గాక తదితర సమయములయందందలి సంఘటనలు పాఠకుని మనస్సును రంజింపఁ జేయ గల్గినపుడే తేటపడును. పురాణగాథను గాని, యొక పూర్వ కవికృత పద్యప్రబంధమును గానిఁ జదివిన యెడల విరామకాలమునందు చిత్త శాంతి, నిర్మల మనోభావముఁ బొసఁగుననుట నిర్వివాదాంశము. అప రాధ పరిశోధక నవలలు పాఠకుని మనస్సున కెట్టివిచిత్రా నుభూతులఁ గల్గించునో యించుక పరిశీలింపవలయును. ఆనవలలను జదివి నిద్రించిన యెడల నందలి సంఘటన లొక్కొక్కటి చోరహంతకుల దౌష్ట్యములు స్మృతిపథమున మెదలి యాపాఠకుని వణకించుచు, భయోద్విగ్నమాన సునిఁ జేయును. హృదయ స్థైర్యమును సడలింప యత్నించును. శాంతి యను పదమున కర్థస్థానము లభింపదు. ఎట్టి పాషాణహృదయములకో గాని యట్టి విచిత్రానుభూతులు రాక మానవ హృదయ చాంచల్య మున కాకరములును, చిత్త శాంతిభంగకరములును, భయోత్పాద సంఘటనా పూరితములును నగు నీ నవలాసాహిత్యపురోభివృద్ధి భవిష్యత్కాలమున నెట్లుండునో యూహింప విజ్ఞులే సమర్థులు.

ఏ భాషయందలి యెట్టి సాహిత్యమునకైనను సంపూర్ణాభివృద్ధి, భవిష్యత్తునందు ప్రజాదరణ లభింపవలెననిన, నా గ్రంథములు భాషా యోష కలంకార ప్రాయములై యుండవలెను. మనదేశ సంస్కృతి, నాగరికత, సంప్రదాయ విశేషములను, జూపుచు తద్గ్రంథ ప్రసూన ములచే భాషాసతి నర్చించి సర్వాంగి సౌందర్యాధిదేవతగా నొనర్ప వలయును. పూర్వ కవీశ్వరుల యొక్కయు, మహానిశేఖరుల యొక్కయు వేలాదిగ పద్యగ్రంథములు, ఆధ్యాత్మిక సంకీర్తనలు, వేదాంత ప్రతి

పాదక మహాగ్రంథములు, మనదేశౌన్నత్య నిరూపకములగు వివిధ గ్రంథములు ననేకము లాంధ్రభాషా యువతి కమూల్య భూషణములై తేజోదీప్తి విరాజితములైనవి. ఈ భూషణము లాచంద్రతారార్క పిలసితములై మనజాతి, దేశ, భాషా సంస్కృతులకు చిహ్నములు గనున్నవి ఇట్టి నవ్య ప్రసూన పరిమళ విసరములచే నాంధ్రభాషా సతి నలరింపఁజేయుట మనవిధియని గూడ గ్రహింపవలయును గదా! ఇప్పటి వఱకు నట్టి మహాభోగ మనుభవించు చుండిన సిభాషాసతి కిట్టి కృతిమరత్నము లలంకరించుట కళంక మాపాదించుట యేమో! లేకున్న నామెవదన మట్లు లజ్జాగరిమచేఁ గళారహితముగ నున్న దేమి? ఆమెను సద్గ్రంథ జాలముచే నలంకరింప వలసియుండ నిట్టి తాత్కాలిక సాహిత్యముచే సేవింపఁజూచుట మన విజ్ఞానమునకుఁ గాదు, అజ్ఞానమునకే నిదర్శనములు.

మన పూర్వుల విజ్ఞానమును విసర్జించుట యెంత లజ్జాకరము! ఆంధ్రులమైన మనమే మన చరిత్రను సంస్కృతిఁదెల్పు గ్రంథ ప్రాశస్త్యమును గుర్తింపనపు డితరులకేల! పాశ్చాత్యులు మనదేశమందలి గొప్ప తనమును గ్రహించి పొగడుచుండిరి. ప్రపంచ భాషలలో కెల్ల ననాది యని నిర్ణయించిన సంస్కృత భాషయందలి మహోత్కృష్ట గ్రంథ జాలము వివిధభాషలయందు ననువదింపఁబడినవి. అట్టి సంస్కృత భాషయే యాంధ్రమునకు మూలమై నిలిచినపు డందలి మనోహరతను మనముగాక పర రభినందింతురు? ఆంధ్ర సాహిత్య సమరాంగణ చక్రవర్తి, విజయనగరాధినేత శ్రీకృష్ణదేవరాయల "దేశభాషలందుఁ దెలుగు లెస్స" యను సూక్తియందలి యర్థస్వారస్యమును గ్రహించి సార్థకముఁ జేయవలెను.

ప్రస్తుతకాలమున పూర్వకవితా సామర్థ్యములు ప్రజలయందం తగ గానరావు. ఇట్టి పూర్వకవుల సామర్థ్యములను, కవితారీతు

లను గ్రహించి, వారేర్పఱచిన ధర్మమార్గములఁ బ్రవర్తింపవలెను. అట్లొనర్చుట కొకటేమార్గ మున్నది. పై తరగతికిఁ జెందిన నవలా సాహిత్యమును సాధ్యమయినంత తగ్గింపఁ బ్రయత్నింపవలెను. ఇట్టి వాఙ్మయమభివృద్ధి గాంచి ధర్మోపదేశమును గావించునవియు, భావగాంభీర్యభరితములును నున్నత శ్రేణికిఁ జెందినవియునగు గ్రంధముల కర్తస్థానమిడకుండిన, మన దేశభాషాగౌరవము తేలనిలమను? ప్రజలయందట్టి వాఙ్మయము వృద్ధిగాంచిన నెట్టి పరిణామము లొందవునో వివరింపఁబడినది. ప్రప్రథమమున మన భాషౌన్నత్యమును గ్రహించి, పూర్వ సంస్కృతిని గ్రహించిన పిమ్మట నైన యిట్టి సాహిత్య మభిలషణీయమే; కాని యదియు గ్రాంథికభాషలో విరచింపఁబడి, సాహిత్య లక్షణయుక్తమై, పూర్వగ్రంథములవలె సర్వకాల సమస్త జనపూజనీయమై, ఆచంద్రతారార్కము నుండు నవలలే వాంఛనీయములు, సాహిత్య స్థానమలంకరింపఁ దగినవియుఁ గదా! కాని ప్రస్తుత పరిస్థితుల ననుసరించి చూచిన నీ నవలల యావశ్యకత యంతగఁ దోఁపదు. కావున నీ నవలా సాహిత్య మందలి సత్యాసత్యములను నిష్పక్షపాతముగఁ బరిశీలింప విజ్ఞులగు పండితులే సమర్థులని నేనీ వ్యాసమును ముగించుచున్నాఁడను.

---

# తిక్కన సోమయాజి

వారణాసి సుభద్రమ్మ

నెల్లూరు మండలమును బాలించిన మనుమసిద్ధి భూపాలుని క్ష్మాచక్ర మఱచేతఁ బ్రదీపించిన మంత్రిశిఖామణి మన తిక్కన సోమయాజి. ఈ మహాకవి గౌతమ గోత్రుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు, కొమ్మనామాత్యుని పుత్రుఁడు, భాస్కరమంత్రి పౌత్రుఁడు. ఈ కవివరేణ్యుని జన్మయే షద్వ్రద్వంశము. ఈతఁడు నిర్వచనోత్తర రామాయణమును రచించునాఁటికి సోమయాజి కాలేదు. తన రాజభక్తి ధ్రువతారమై నిల్చునట్లు రాజ్యభ్రష్టుఁడై, బంధితుఁడైయున్న తన మహీపాలుని మరల సింహాసనాలంకృతుని జేయఁబూని తొలుదొల్త యజ్ఞమాచరించెను. అనంతరము భారత రచన చేయ సమకట్టెను. అందు నాదికవివరేణ్యుఁడు వ్రాయఁగా శేషించిన, ఆరణ్యపర్వమును గానక విరాటపర్వమునుండి ప్రారంభించెను. విరాటుని యాశ్రయము చేరుటకుఁ బూర్వము తా మెట్లు మెలంగవలయునో నిశ్చయించుకొని పాంచాలీసహితులయి పాండవులు బయలుదేరిరి.

భీమార్జున నకుల సహదేవులకుఁ దమ యగ్రజుఁడు విరటు నెట్లు గొల్చుచుండఁగలవాఁడని సందియ మొదవెను.

సీ॥ మహనీయమూర్తియు మానవైభవమును
సౌకుమార్యంబును సరళతయును
మార్దవంబుఁ బ్రభుత్వమహిమయు నవగత
కల్మషత్వమ్మును గౌరవంబు
శాంతియు దాంతియుఁ ద్యాగంబు భోగంబు
గారుణ్యమును సత్యసారతయును
ధర్మవయః క్రియా తత్పరత్వంబును
గీర్తి ధనార్జన క్రీడనంబు

గలికి జనుల నేలఁ గాని యెన్నండును,
నొరులఁగొల్చి తిరుగ నెరవు లేని
యట్టి నీవు విరటు నట్టి చందంబున
ననుచరించువాఁడ నధిప! చెపుము.

యని అర్జునుఁడు ధర్మజుని ప్రశ్నించెను. అంత ధర్మనందనుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. సోదరా !

క. శ్రౌత స్మార్త సమిత్త,
జ్యోతిర్విద్యలు వహించి యోగ్య సమయ సం
జాత ప్రాగల్భ్యుఁడవై,
చాతుర్యము మెఱసి మానసం బలరింపన్.

అంతియే కాక,

క. అతనితో నాక్కాకమతిఁ
గౌతూహలవృత్తిం దగం దొడఁగి మ్యాకు
ద్యూతంబున గ్రీడింతుం
జేతోముద మొదవ నక్ష శిల్పప్రౌఢిన్.

ఇందు ధర్మజుఁడు పలికిన పలుకులచే నాశ్రితుఁ డెట్లు మెలఁగవలయునో యెట్లు తన పోషకుని యుల్లమునం దుల్లాసము కలిగింపవలయునో యను విషయములు తెల్లమగుచున్నవి. అనంతరము తమ తమ సామర్థ్యంబులు పురస్కరించుకొని విరాటు మహీపాలుని చిత్తం బుల్లాస మొందునట్లు ప్రవర్తింతమని కూడఁ బలికికొని బయలుదేరిరి.

యుధిష్ఠిరుఁడు కంకభట్టను నామధేయముతోడను, భీమసేనుఁడు వలలుఁడను నభిధానముతోడను, ఇంద్రసూనుఁడు బృహన్నలయను నామముతోడను నకులుఁడు దామగ్రంథియను పేరుతోడను, సహదేవుఁడు తంత్రీపాలుఁడను నామముదాల్చి రాజసభామందిరమునఁ బ్రవేశించి రాజానుమతి వడసి తనకు నందుయు నుచితసేవలఁ జేయఁ బూనుకొ

ని౨. ద్రుపదనందన సైరంధ్రీవేషమున మాలినియను నభిధేయముతో సుదేష్ణం గొలువ నంతఃపురము జొచ్చినది. మాలిని తన వేషమునకుం దగిన సమయోచిత సంభాషణచాతుర్యముం జూపినది. ఆయాఘట్టములందు పాత్రపోషణ నాటకోచితసంభాషణముం జూపుట కవివతంసుని రచనాకౌశలము వెల్లడించుచున్నది. విరాటుని ప్రియమ్ములకు గుఱియైన కీచకుఁడు, అయోనిజయగు ద్రుపదాత్మజను సామదానములచే వశవర్తిని జేసికొనం బూనెను గాని యామెకు మారి దైవకటాక్షమున నీవలంబడి వాయునందనున కీవార్త నెఱిఁగించెను. ఉద్దండుఁడగు నా వృకోదరుఁడు తానే ద్రౌపదివేషము దాల్చి యానాఁటి రేయి సంకేతస్థానమునందు నాఖలుని దునుమాటించెను. వానితోపాటు నుపకీచకులను యమపురి కంపెను. అచట వాయుసుతుని పరాక్రమము వర్ణనాతీతము.

చ॥ వికృతపుఁజావు సంప మది వేమఱువుట్టినఁ గిట్టిపట్టి మ
స్తకమును బీనదీర్ఘ భుజశాఖలుఁ బాదయుగంబు మేనిలో
నికిఁ జొర నుగ్గుగాఁదులిమి సించిన గ్రంతల తిత్తియైన కీ
చకు ధరణీస్థలిం జఱిపి చక్కని ముద్దగఁ జేసె దుష్టుఁడై,

రౌద్రభీభత్స భయానకముల వర్ణించుపట్ల సంస్కృత సమాసములఁ జొప్పించినను అలతి, యలతి తెనుఁగు పదములనే కూర్చి గూఢార్థముల నిముడ్చుట యీ కవి వరేణ్యుని రచనావిశేషము. తిక్కనలోని కవితా గుణము రసాభ్యుచితబంధముగా నెఱింగి వ్యక్తీకరించినవాఁడు శ్రీనాథుడు.

ఇట్లే యుత్తరగోగ్రహణమునం దుత్తరుఁడు కౌరవసేనను గాంచి కంపితగాత్రుఁడై తేరును మరలింపుమని యర్జునుని బ్రతిమాలును. అపుడు పార్థుఁడు వానితో నిట్లనును.

క. తలఁపఁగ రిపులకు నిమ్నగు
కొలఁది గడచి వచ్చితిమి యకుంఠిత బాహా
బలము నెఱపఁ దఱి యయ్యెను
జలింప వల దింక మనకు శత్రులవలనన్.

పార్థుని పలుకులువిని ఆచార్యుని మనమున ఫల్గునుఁడేయని తోఁపనపుడు

శా॥ సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటునై నుండి మా
తంగస్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాస ఖిన్నమతి సన్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.

కుంతీసుతమధ్యముని సింహముతోఁ బోల్చి, ఉపమాలంకారమును గూర్చినాఁడు. సింహమాఁకలిగొని మదగజము కాన్పించినంతనే దానిపై నుఱుకును. అట్లే, అర్జునుఁడు పదుమూఁడు వర్షములు తన బాహుబలము చూపనవకాశము లేక కౌరవసైన్యము గాంచఁగనే దానిపై నుఱికె నని శంకించినాఁడు.

గాంగేయునకుఁ బోరులో జయించుట దుర్లభమని తోఁచి దుర్యోధనునితో నిట్లు పలుకును.

ఉ॥ వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికి నై పెనంగిన బలంబులు రెండును గెల్వ నేర్చు నే
హెచ్చుగుఁ గుందగుం దొడగు టెల్ల విధంబుల గోర్చుటట్లుగా
కిచ్చఁదలంచియొక్కమొయి నిత్తఱిఁబొందగు చేఁతయుం దగున్

వచ్చినవాఁ డర్జునుఁడు. ఇఁకఁ బోరిలో జయించుట యనునది యసంభవము, రాజ్యలక్ష్మికై పోరుసైన్యములు రెండును గెల్చుట జరుగదు కదా! కావున నీవు యుద్ధము చేయుటమాని పాండవులతోఁ బొందొనర్పు మని బోధించును. కాని దుర్వారగర్వాతిశయుండును రాజ్యకాంక్షోన్మాదుఁడునగు దుర్యోధనుని మనమునకు హితోపదేశము

లెక్కనా? తాఁ బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళనినట్లు అతఁడు వృద్ధుల మాటల చెవిఁ జొరనీయఁడు

అజ్ఞాతవాసానంతరము పాండవులు తమయర్ధరాజ్యమును న్యాయ్యముగఁ బొందుతలంపుతోఁ గృష్ణుని కౌరవులకడకు రాయబారిగా నంపిరి. కృష్ణభగవానుఁడు హస్తిపురికిఁ బోవుసమయమున ధర్మరాజు తన నామము సార్థకమగునట్లు ధర్మయుతముగ సంధిచేసికొని రమ్మని పలికినాఁడు. భీమపరాక్రమోపేతుఁడగు వాయునందనుఁడు, అగ్రజునియందుండు గౌరవమున నింతకాలము సహించియుంటిని గాని లేనిచో నింతకుఁ బూర్వమే సుయోధనుని సమూలముగ రూపుమాపి రాజ్యము చేకొని యుందు నని పలికినాఁడు. నీవంతటి వాఁడవేయని కృష్ణుఁ డనునయించి క్రోధము చల్లార్చినాఁడు.

అర్జున నకులు లిరువురు సామాన్యముగ సంధిచేసికొని రమ్మని పలికినను సహదేవుఁడు మాత్రము మనంబున నణఁగియున్న క్రోధము నాఁపుకొనలేక.

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం బేసు వంచించియుం
బదుమూఁడేడులు నీవునుం దిరిగిరాఁ బాలీక పోవచ్చునే
యదిగాదేఁ దెగి బంటవై యఱిమి మాయల్ వన్ను నేర్పింకఁ జె
ల్లదు నూ నీకని యాసుయోధనుని యుల్లం బుచ్చిపో నాడుమీ.

అర్ధరాజ్యమిచ్చినను సరే లేదా వారు మావలె అరణ్యవాస మజ్ఞాతవాసమును నెఱపి రాజ్యము చేకొనినను సరే. లేదా యుద్ధములో జయించుకొన్నను సరియే. కాని మాయలతో రాజ్యముఁ బొందు నేర్పింక చెల్లదుసుమా! యని దుర్యోధనుని మనస్సు నొచ్చునట్లు పలుకుమని చెప్పెను. అంతమున ద్రుపదాత్మజ తాను పడిన భంగపాట్లన్నియు నిట్లు చెప్పఁదొడఁగెను.

ప॥ అంతలు సేసి పోఁడఁచి యక్కట సంజయుచేతఁ జెప్పిపు
త్తెంతురె యిట్టి యూరట మదిం బ్రియ మంది యుధిష్ఠిరుండు దా
నంతిన యూళ్లు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చునొక్కొ యీ
కంత కృపావిహీనమతి నాతఁడు నేమనె యన్నదమ్ములన్.

'అంతలు చేసి' అనఁగాఁ జెప్పఁట కలవిగాని బాధలు పెట్టి యను సర్థము గోచరమగుచున్నది. అటుతరువాత సంజయుచేత నూరడించుటకై రాయబార మంపుట, ఎంత సమంజసము. అంతమాత్రమునకే యుధిష్ఠిరుఁడు సంతసమంది యర్ధరాజ్యమిచ్చునని తలంచెను. అర్ధరాజ్యము కాదు కదా ఐదూళ్లైనను సుయోధను డీయఁడు. వారెన్ని బాధలు పెట్టినను సహించియుండుటకు వారు బ్రాహ్మణులు కారు. ఓడిపోవుదు మనుభయము దుర్యోధనుని మనస్సునందు కొంచెమైనను లేదు. వారు యుద్ధమునకుఁ దలపడినచో వీరు పోరున కిచ్చగింతురో లేక కానలలో నుండుటకుఁ బోదురో.

కృష్ణా! నేను వరము వలనఁ బుట్టినదానను, భరతవంశమును మెట్టిన దానను. జనవంద్యుల బొందినదానను. అన్నివిధముల నేను గౌరవమును బొందియున్న దానను. అంతే కాక అవభృథస్నానమొనర్చి శుచినైయున్న నన్ను గొనివచ్చి నొంచు దుశ్శాసనుని జూచుచుఁ బతులు చేష్టలు దక్కి శ్వాసించుట మాని చిత్రముల యాకృతి నున్న వారు. అట్టి సమయమున నిన్నే స్మరించి యా యాపదను దప్పించు కొంటిని.

ఉ. ఈ వెండ్రుకలు పట్టి యీడ్చిన యాచేయి
దొలుతగాఁబోరిలో దుస్ససేను, తను వింత లింతలు తునియలై
చెదరి రూపఱియున్నఁ గని యుడుకారుఁ గాక
యలుపాలఁ బొనుపడునట్టి ఓచ్చే యిది పెనుగిద ప
ట్టిన భీమసేను బాహు బలంబును బొటింపి, గాండీవమును నొకి విన్నాప

డును సహించు క్షాత్త్ర విక్రమంబు గాల్పనే యిట్లు బన్నములు వడిన ధర్మ నందనుండు నేను రాజరాజు పీఠంబు గన్నారఁ గానఁ బడయనైతి మేని

కృష్ణా !

మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం గట్టినయట్లు పెద్దయును గాలము. నేను వారు పెట్టిన బాధలన్ను రాక్షససహనముతో నోర్చి యుంటిని. ఇఁక సహింపఁజాలను. చిచ్చు నొడిలోఁ గట్టినట్లుగ నా బాధయున్నది. అని ద్రౌపది పలికినది. ద్రుపదనందన పలుకులవలన భంగపడిన స్త్రీ యే విధముగ నుండునో పాఠకులకు దెల్లమగునట్లు కవి చిత్రించినాఁడు. స్త్రీ సహజస్వభావ మిటు గానవచ్చుచున్నది. సామముతో వచ్చు సంపాదన కంటె బాహుబలముతోఁ దెచ్చు రాజ్యమే ఘన మని ద్రౌపది యభిమతము. ఇదియే కృష్ణుని యుద్దేశమగుటచే

ప. ముచ్చిర నేల యేఁ గలుగ ముద్దియ నాకు వృకోదరుండు వి
వ్వచ్చుఁడుఁ దోడుగాఁగ జనవంద్యుఁడు ధర్మసుతుండు పంప నీ
మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెదఁ గాక వేఱొకం
డచ్చుపడంగ నేర్చునె దురాత్ములు కౌరవు లుర్వి యిత్తురే?

కౌరవులెట్లును రాజ్యభాగ మీయరు. వారితో నెట్లును బోరు తప్పదు. నాకు భీమార్జునులు సహాయులు కాఁగా ధర్మసుతుఁడు పంపగా శత్రుసంహార మొనర్చి నీ యాశయము నెఱవేర్చెదను.

కృష్ణపరమాత్మ మానవాతీతుఁడు గాన నాతనికి జయాపజయములు తెలియును. శత్రుక్షయ మీ జన్మమునందే జరిగితీరవలయునను నిశ్చయముకలవాఁడై ద్రౌపది నట్లూరడించెను. తరువాత నతఁడు కౌరవసభ కేతెంచెను. తిక్కన సోమయాజి మంత్రిశిఖామణి గాన తానే కృష్ణుని పాత్రమై ధృతరాష్ట్రుని కిట్లు రాజనీతు లుపదేశించెను.

కం. నరనాథ నీ పునేస్థాపనుఁడ వయినఁ గౌరవులకఁ బాండవులకఁ గా
దారయఁగ భూప్రజకెల్లను దుస్తరం బోనరించినట్లు తొడిఁ జేసెదు సుమీ,

ఆ. పాండవులకుఁ దగిన పాలు మేదినిఁ బంచి యిచ్చుకంటెఁ గార్య
మెద్ది గలదు?
ధర్మమెద్ది సముచితంబగు విధమెద్ది శక్యమెద్ది చెపుడ వాక్యవిదులు?
ఆ. వారి తండ్రిపాలు వారికి నిచ్చి నీ పాలు నీవుఁ బుత్రపౌత్రచయము
ననుభవించి సుఖులరై యుండుఁడిది బంధుమిత్ర సుజనకోటిమెచ్చు
తెఱఁగు.

ఈయుపదేశము లోక న్యాయవేత్త చెప్పునట్లు గాన్పించుచున్నవి. భారతమునందు చతుర్వేదసారమే కాక రాజకీయము లన్నియు నిమిడి యున్నవి. అందులకే దీనికి పంచమవేద మనునామాంతరము వచ్చి యుండుటకుఁ గారణము. ఇట్టి రచనాచమత్కృతి మూలముననే వన్నె దెచ్చుచున్నది.

ఉభయ కవి మిత్రుఁడగు మన కవీశ్వరుఁడు భాషయందేమి, భావము నందేమి శిల్పమునందేమి చిత్రమునందేమి పాత్రపోషణము నందేమి, రసపోషణమునందేమి అలతి, అలతి తెనుఁగు పదముల కూర్పునందేమి రాజకీయ విజ్ఞానము నందేమి హితముపదేశించుటయందేమి తన ప్రజ్ఞా ప్రభావములు చూపినాఁడు. 13 వ శతాబ్ది నాఁటి తెలుఁగుభాషకు మెఱుఁగులు దెచ్చినాఁడు.

పాత్రపోషణమందు వారివారి రూపములఁ దానేదాల్చి పలికినాఁడు. ఈ విధముగ మూలముననే వన్నెదెచ్చు కవులు తమ తమ రచనా కౌశలముచే వాఙ్మయమును బోషించి యుత్తమగ్రంథముల వెలయింతురు గాక.

---

# రావణ తృణీకరణము

వోలేటి అచ్యుతరామచంద్రమూర్తి

ఆ. రుద్రమూర్తి మఱియు రూక్షేక్షణుండునై
తెల్పు రాక్షసేంద్రుఁ డెగువఁ బల్కు
లాలకించి కనుల నశ్రువు ల్దొరఁగఁగాఁ
బతిని దలఁచి మిగుల వగచి వగచి.

ఆ. దీనయగుచు జీర్ణతృణ మంతరముచేసి
రావణుండు వినఁగ రాముపత్ని
వేపమానయగుచు విహితధర్మంబుల
సుస్మితాస్య విమలసూక్తి నుడివె.

క. నాపై నానస్వేదుము
నీపడఁతులఁ బొంది కనుము నిఖిలసుఖంబుల్
ఏపగిది నన్నుఁ బడయుదు
పాపాత్ముఁడు ముక్తిఁగోరి పడయంగలఁడే ?

ఉ. పుట్టితి పూర్వపుణ్యమున భూసుతగా, రవివంశసోము చే
పట్టితి, నేకపత్నినియమంబున రాముఁడు నన్ను నేలు, నే
నొట్టిడి చెప్పుచుంటి వినుమోయి ! విదేహధరాధినాథు మే
ల్పట్టి నకార్యచింతనకుఁ బాల్పడ, నాత్మ విభుత్వమెంచెదన్.

చ. అని పెడమోము వెట్టి మఱి యా దనుజేశ్వరుతోడఁ బల్కె నా
జనకజ, ఓయి రావణనిశాచర ! నేను మహాపతివ్రతన్
ననుఁ బరదారగాఁ గని యనాదివిశేషవిశుద్ధధర్మముం
బనిగొని యాచరించి కనుమా శుభ సంపదలన్ జిరంబుగన్.

క. నీకును నీ కాంతయెటులో
కాకుండునె యట్టు లితరకాంతయుఁ బతికిన్
బ్రాకటముగ నెల్ల సతులు
లోకంబున రక్షణీయులుగ నెఱుఁగపురా !

గీ. స్వీయకాంతలఁ బరితృప్తి చెందలేని
చపలుఁ, జలితేంద్రియున్, సాధుసంగదూరు
పలుచగా నెంత్రునాథదేవత లసిశము
పతితపావహ్ని కెఱుఁగ హితముగొనుము.

క. గద్దించి పలికి చెడు గిది
వద్దని వారించు వారి పలుకులు వినవో!
పెద్దలు లేరో లంకను
బుద్ధులు చెప్పంగ నీవు సుఖపడఁజూడన్.

క. రక్కసి మూకల యార్పది
యక్కజముగ నొక్క మొగిని యంతం బగునో
వెక్కసమై సాధువచన
మక్కట! నీ చెవుల కెక్క దప్రియ మగుచున్.

ఆ. సదుపదేశములను సరకు చేయనిఁజేని
సర్వసంపదలును చనినయట్లు
రాష్ట్రనగర రత్నరాసులతో నొప్పు
లంక నాశమగునురా నిజంబు.

ఆ. దూరదృష్టి లేక దుష్కృత్యములఁ జేయు
పాపి ఘోరపాప ఫలము పఁడి
యతఁడు నాశమంద నఖిల భూప్రజలునున్
బడుగనుచు హాయినుండఁ గలరు.

క. ఎందఱ హింసించితివో
ఎందఱి కాంతలకు నగ్గ లీవు తలంతో
యందఱు నీ నాశమునకుఁ
గందళితానందమతులు గారే తలఁపన్.

క. ధనమిచ్చి కాని మఱి యే
ఘనభూమల నిచ్చి కాని కయికొనఁగలవా
నను, నివకులుసహధర్మిణి
నినుతోడుకొఁ గాంతియట్లు లెనఁగెడిదాంక్.

సీ. ఎవ్వాని యుదయ మయ్యినకులాభ్యుదయంబు
పుడమిపట్టికిఁ బాగ్యపుణ్యఫలము
ఎవ్వాని ముఖబింబ మెల్ల మానసనర
సౌందర్యమున కించు సరసిజంబు
ఎవ్వాని కరదీప్తి యెల్ల రాక్షసకుల
గర్వతమం బూడ్చు కంచు దివ్వె
ఎవ్వాని యాశ్రయం బెల్ల జీవాళి సం
కల్పంబులను దీర్చు కల్పతరువు
ఎవని ప్రాపు వలన నెల్ల తాపసులకు
నాత్మయజ్ఞ రక్ష కనువు గలిగె
నట్టి రాముకరముఁ బట్టిన సతిని నే
పట్టిమూర్ఖ నేల వలతునయ్య.

ఆ. ఆత్మవేది యగుచు నఖిల వేదంబుల
నభ్యసించు బ్రాహ్మణార్యునకును
యోగవిద్య యెట్టు లుచితంబో యట్టుల
తగినదాన నేను దాశరథికి.

తే. అడవి నుక్కడక్కి యంగలార్చు కరిని
చేర్చి యూథము దరిఁ జేర్చునట్లు
దుఃఖజలధి మునిఁగి దురపిల్లు నను రాముఁ
గూర్చెదేని నీకుఁ గుశలమగును.

చ. స్థిరముగ లంక నేలుటకుఁ జిత్తమునఁ దలఁతేని నీవన
శ్వరమగు సౌఖ్యసంపదల సమ్మతితో గననెంచి దేని, దు
ర్భరణపు భీకరాస్య వివరంబునకుస్ జొరనొల్లవేని యా
వరదుని బురుషోత్తమున వక్ర పరాక్రము రాముఁగొల్వుమా.

క. ఆరాముఁడు ధర్మజ్ఞుఁడు
గారవముగ శరణుఁ జొచ్చి కాపాడుమనన్.
మారాడక వత్సలుఁడై
నేరంబుల నెంచకుండ నెఱపును మైత్రిన్.

ఆ. దుష్టబుద్ధి వీడి దురితముల్ మన్నింపు
మనుచు రాము వేడుకొనుచు నన్ను
సతిని కిచ్చి స్నేహమర్థించి యున్నచో
సేమమగును నీకు సిరియు నిలుచు.

ఆ. నీకుహితము గోరి నేఁజెప్పినటుల నీ
వాచరింపు వేని సతిని వలనఁ
గలుగు సుఖము లెన్నొ కాదన్నచో నీవు
మిత్తివాతఁ బడుట సత్తె మగును.

ఉ. వీడిన వీడుఁ గాక నిను వీరసురేశ్వరువజ్రపాతముల్
వీడిన వీడ వచ్చు లయభీకరకాలభటాళిపాశముల్
వీడని కోపముంగ దగిలి బీరముతో రఘురాముఁ డల్గినఁ
వీడక వాని తీవ్రతరవీక్షణ మేర్పద వానలంబునై.

క. సురపతి కడువడి బఱపిన
యురుముల పిడుగులను బోలు నుద్యద్ధ్వనులన్
బరగుచు రాముని భీకర
శరతతి నినుఁ జుట్టి ముట్టి చంపును దనుజా !

ఆ. వివృత భీకరాస్య విషసర్పతుల్యంబు
లంపగములు పర్వి యగ్నిశిఖల
రమ్యపర్వములను రామలక్ష్మణచిహ్న
తములు నగుచు లంక తగులఁబెట్టు.

ఆ. కంకపత్రములను గలుగు రాముని బాణ
చయము పర్వి లంక లయముఁ జేసి
రాక్షసాళిఁ జంప రమణు లేడ్చిన యేడ్పు
లింట నింటఁ జెలగు మింటి నంటి.

ఆ. గరుడజవముగల్గు ఖరనారసంబుల
ధనువునేసి, పర్వతతులఁ జిమ్మి
వైనతేయునట్లు వైళంబ రాముండు
చుట్టి చంపు రాక్షసోరగులను.

ఆ. అసుర రాజ్యలక్ష్మి (లక్ష్మితోడ) నడుగుల మూఁడింట
వశముచేసికొన్న వడుగు రీతి
రామవిభుఁడు నన్ను రావణా నీ నుండి
వేగఁ గొనును బాహు విక్రమమున.

చ. దురమున విక్రమించి ఖరదూషణముఖ్య నరాశనుల్ జితా
మరులగు వారి విక్రమ సమన్వితులన్ హననమ్ముచేసి, తా
గరువము పెంపుసన్ దనుజకాననమున్ సుజనంబొనర్ప నా
నరపతి గెల్వలేక నను నాజికొనిపర్వక తెక్కలించితే.

ఆ. పురుషసింహులైన భూలోకనాథుల
మాయలేడి మిషను మాయచేసి
పర్ణశాల నొంటి పడఁతినిగాఁ జేసి
యబల నన్నుఁ గొనుట యర్హమగునె!

క. పులి వసితలిదిన శునకము
నిలువంగా లేని యట్లు నిల్వోవుదు వే
బలవంతుల రఘువీరుల
కలన నెదిరి పోరనిల్వఁ గలవా? తుఱువా!

ఆ. ఒంటి చేయి వృత్రుఁ డుదితబాహాదర్పుఁ
డింద్రుచేత నెట్టు లీల్గిపడెనొ
యట్టు లన్నదమ్ములగు రామలక్ష్మణ
బాణహతిని నీల్గి పడెద వసుర!

ఆ. అల్పజలము నెట్టు లాదిత్యకిరణాళి
యాహరించుఁ దీవ్రమగుట కతన
నట్లె రామలక్ష్మణార్యుల శరతతి
యల్పుఁడైన నిన్ను హతమొనర్పు.

క. ధనపతి పురమున కేఁగిన
వననిధిఁ జొచ్చినను గూడ వగలవు నిను రా
ము నిశరవరములు పెనుపిడు
గునఁబడు వృక్షంబు నట్లె కూలెద వసురా!

# ఆంధ్రసాహిత్యపరిషత్తు కాకినాడ

## 48 వ వార్షికోత్సవములు 1959—1960

## జూన్ 9, 10, 11, 12, 13 తేదులలో

అధ్యక్షా! ఆర్యమహాశయులారా! నమస్కారములు.

ఆంధ్రసాహిత్య పరిషత్తు యొక్క నలువది యెనిమిదవ వార్షికోత్సవములు జరుపు మహాభాగ్యము మనకుఁ బ్రసాదించిన పరమేశ్వరుని పరిపూర్ణ దయకు కృతజ్ఞతాపూర్వక వందనములను మనయందఱి పక్షమున సమర్పించుచున్నాఁడను.

"సీ॥ నన్నయభట్టుచే నాఁటుకొనంబడి
తిక్కనార్యునిచేత మొక్క మొలిచి
శంభుదాసువలన శాఖ లొగిం దాల్చి
సోమభాస్కరులచే శోభఁ గాంచి
శ్రీనాథ కవిచేఁ బ్రసూనముల్ వికసించి
పోతనామాత్యుచేఁ బూజ లంది
అల కృష్ణదేవరా యాస్థానబుధుఁడైన
పెద్దనగారిచేఁ బేరువడసి"

గీ. "ముక్కు తిమ్మన, సూరన్న, మూర్తి, రామ
కృష్ణుఁ డాదిగాఁగల సుధీ కీరవితతి
యభినుతిం గన్న యాంధ్రభాషాభిధాన
కల్పశాఖికి నా నమస్కార మిదుదు".

ఆంధ్రసాహిత్య పరిషత్తు - అనఁగా ఆంధ్ర గ్రంథముల గుణదోషములను గూర్చి చర్చించి తగిన రీతిని తీర్మానించి ఆతీర్మానమునే ఆంధ్రలోక మందంతటను నిర్వివాదముగా నంగీకరింపఁ జేయఁదగు నంతటి గౌరవస్థానమున నిలువఁదగిన విద్వన్మండలి.

ఆంధ్రభాషను భద్రముగఁ గాపాడి దాని నభివృద్ధికిఁ దెచ్చుట కీ పరిషత్తు వారే తగినవా రని నిరాఘాటముగఁ జెప్పవచ్చును.

ఈ పరిషత్తు కవులతోను, పండితులతోను, విమర్శకులతోను నిండి యుండునది. కావున నాంధ్రభాషకు సంబంధించిన విషయములలోఁ బ్రభుత్వమువా రీపరిషత్తు వారి నడిగి తెలిసికొనుచుండుటయు, సాధారణముగా మంచిపనియని తోఁచినవిషయముల నెల్లను నీ పరిషత్తు వారు ప్రభుత్వమువారికి విన్నవించుచుండుటయు జరుగుచున్నచో సమంజసముగా నుండునని పలువురు ప్రముఖుల యభిప్రాయము.

ఆంధ్రభాషాభివృద్ధి కావలయు ననెడి ప్రతివారును నీ పరిషత్తునకు వారి వారి శక్త్యనుసారము సహాయపడుచుండుట కర్తవ్యము. మఱియును సుకవులను గౌరవించుచు వారి గ్రంథములను గొని పఠించుచు వార లింకను సద్గ్రంథము లనేకములు రచించుటకు ప్రోత్సహించుచు దేశోపకార మొనరింపవలయును.

ఇందులకై యొసఁగఁబడిన ధనమంతయు భాషాభివృద్ధి మూలమునఁ దిరిగి మన ప్రజలకే వినియోగపడును గాని వ్యర్థము కాఁజాలదు.

అముద్రిత గ్రంథరాజము లింకను నచ్చటచ్చటఁ గొన్ని యుండవచ్చును. వానిని గలిగియున్న వారలు చెదల పాలుచేయక పరిషత్తునకొసఁగియో, మఱియెవ్వరిచేతనైన ముద్రింపఁ జేసియో లోకమున కామోద మొనగూర్పవలయును.

కవులు నిర్ధనులగుటవలనఁ దమ తమ గ్రంథములను ముద్రింపించుకొనఁజాలకుండుటయే గాక భుక్తికే యిబ్బంది పడుచున్నారు. కవిని గూర్చి యొక రిట్లు వ్రాసిరి.

"సీ॥ కంపెనీలకు నాటకా లమ్ముకొందువో
కడుపుఁగూటికిఁ గష్టపడఁగ లేక
ముద్రణాలయమున ముద్రాపకత్వమ్ముఁ
గైకొందువో భుక్తి గడువ కునికి

బడిలో నుపాధ్యాయ పదవిఁ జేకొందువో
తిండికి చేటొందు దిక్కు లేక
రచ్చల కెక్కి పురాణముల్ చెప్పెదో
భుక్తి వేఱొకరీతిఁ బొడమ కున్కి"

ఆ॥ వె "కడుపు నిండఁ దిండి గలుగ కుండుటఁ జేసి
యెట్టి పనిని గాని యీసడిలక
చేయుచుందు, వెపుడొ చేసిన కర్మంబు
ననుభవింప వలయు నయ్య సుకవి".

కవుల గ్రంథములను గొనిన యెడలఁ గవులను పోషించినట్లే ప్రజాపోషణము కవులకు ముఖ్యావసరము. ఇతరదేశముల యందున్న కవులకు ప్రజాపోషణ మెక్కువగ జరుగుచున్నది. మనదేశమునకు మాత్ర మట్టి భాగ్యము సిద్ధింపలేదు.

ప్రస్తుతలోకములో, పిన్నలకుఁ, బెద్దలకు గ్రంథావలోకనదీక్ష మెండుగా కలిగియున్నది. కాని, ఆగ్రంథములు చాలవఱకు సరియైన భాషలో వ్రాయఁబడియుండ నందున ఫలిత మేమియుఁ గలుగకున్నది. ధనవ్యయముమాత్ర మెక్కువయే యగుచున్నది.

ఇప్పటి యాంధ్రకవులలో రెండు తెగ లేర్పడియున్నవి. అందొక తెగవారు భావమును, భాషయుఁ బ్రధానములుగాఁ జూచుచున్నారు. రెండవ తెగవారు భావమే ముఖ్యమైనదిగాఁ జూచుచున్నారు. మొదటి తెగవారు గ్రాంథికభాషను, రెండవ తెగవారు వ్యావహారికభాషను తమ తమ కవితారచనలయం దుపయోగించుచున్నారు.

మొదటి తెగవారిలో సామాన్యుల కర్థము గాని గడ్డు గ్రాంథికమున రచనలు కావించువారు కొందఱున్నారు.

పాఠకులకు భాష యెంత తెలియకుండ నున్నఁ గవిత్వ మంత యుత్తమమైనదను విశ్వాసముతో నావిధముగఁ గవితను జెప్పు కవులు

కొందఱున్నారు. ఇట్టివారి కవిత మూలముననే యాంధ్రదేశమున భావకవిత్వ మనుమాట యొకటి బైలుదేరినది.

వ్యావహారిక భాషాభిమానులు, గ్రాంథిక భాషాభిమానులు నేకభావమున నుండుట కిట్టి పరిషత్సభ లెన్ని కావలసియుండునో, యెంత కాలము పట్టునో చెప్పఁజాలము. కాని యీ భిన్నభావముల కైకమత్యము చేకూరువఱకు నాంధ్రకవిత్వమునకు సంపూర్ణ సౌందర్యము సమకూరఁజాలదని చెప్పవచ్చును.

ఆంధ్రపదములను లోకసామాన్యమైన వాడుక ననుసరించి వాడుటయే గాక విదేశభాషాపదములను, వాక్యములను నిరంకుశముగ వాడుట యాంధ్రభాషను బోషించుట యనువాద మొకటి బయలు వెడలినది. ఇది భాషకు నిజమైన పోషణ యగునా కాదా యనుచర్చ భాషాభిమానులు కావించుకొనవలసియున్నది. కావునఁ బండితులెల్లరు నిట్టి పరిషత్తులలోఁ గర్తవ్య మాలోచింపఁదగు.

ఇది గాక పద్యరచనా విషయమునఁ గూడ నభిప్రాయభేదములు బయలు వెడలినవి. శాస్త్రమర్యాదలతో నలరారు పద్యనిర్మాణమార్గమును మెచ్చుకొనుట యిదివఱకు వాడుకయై యున్నది. యతిప్రాసలను ద్రోసివేసి ఛందస్సుల నిచ్చవచ్చినట్లు ద్రుంచివైచి పద్యముల నల్లుట కవిత్వ మనువాద మింకొకటి బయలుదేఱినది. ఈ రెండింటిలో నే మార్గము మంచిదో తేల్చుటకై యిట్టి పరిషత్తు లావశ్యకములు.

ఇప్పుడింటింటను కవులు బయలు వెడలుచున్నారు. పూర్వకవుల వ్రాఁతల ననుసరించి రచనలు కావించు వారి సంఖ్య మాత్రము తక్కువయే.

సీ॥ "కలమెత్తి వ్రాయ సంకల్పించెనా; మేల్మి
బంగారు పద్యముల్ బడఁగవలయు
ఆలోచనల సేయ యత్నించెనా; పొంగి
తమకుఁ దా భావముల్ దెములవలయు

నోరార శబ్దంబు నుడువ నూహించెనా!
పల్కు పల్కునఁ దేనె లొల్కవలయు
మెప్పింపఁ దలఁచెనా; గుప్పించి నవరసాల్
మోదాంబురాశిలో ముంచవలయు"

గీ॥ నంతెగాక, దోషక, నూహ కందఁబోక
సహజముగఁ బుట్టని కవిత్వసరణికొఱకు
తల పగులఁగొట్టుకొని వ్రాయుతలఁపులెల్లఁ
దథ్యముగ గ్రంథముల నిరర్థకము గాదె?

సీ॥ అర్థంబు సరిపోవ నమ్మాయమూల ని
ఘంటుశబ్దాల్ గుమ్మరింపఁబోక
పిలిచిన నోయంచుఁ బలుకని సాహిత్య
బలమునకై శ్రమల్ బడయఁబోక
నిర్జీవమగు భావనిచయంబు నిరికించి
కట్టుకైన పామువోకడలఁ బోక
తొడుగుకంపలవోలె దోషభూయిష్ఠమౌ
విరసప్రయోగముల్ వేయఁబోక"

గీ॥ యతులకొఱకు నిఘంటువుల్ పెదుకఁ బోక
"చెప్పఁ గలవాఁడె కవి యనఁ జెల్లుఁ గాని
యిసుకపై వ్రాఁతల కవిత్వ మెంతయేని
దథ్యముగ గ్రంథముల నిరర్థకము గాదె?"

భాషాపోషణమును గూర్చి యాంధ్రభాషామతల్లి కిని కొందఱు కవులకును నీ క్రింది విధముగా సంభాషణ జరుగుచున్నది.

భాషాదేవి :—

"సీ॥ నామేలు మదిఁగోరి నన్నుఁ బెంచిన జగ
త్పూజనీయుఁడు రాజరాజు లేఁడు
నాకూర్మి సుతుని శ్రీనాథు నేలిన మహా
దాత, యావేమభూనేత లేఁడు

నా కేడుగడయు నై, నను లెస్స యని మెచ్చి
　　　　నట్టి శ్రీకృష్ణరాయండు లేడు
కవుల కేనుఁగుపాడిగా నీవు లిడి నన్ను
　　　　రహిఁ బెంచు రఘునాథరాజు లేఁడు"

గీ॥ "ఎందఱెందరో యాంధ్రభూమీశు లిట్టి
డవనిఁ గల్గియు లేనియ ట్లైరి నాకు
ఒక్కరో యిద్దరో తక్క నుర్వి నాదు
గోల వినువారు లేరౌర! కాలమహిమ"

కవి :—

సీ॥ "విచ్చలవిడి నిట్లు విహరింపఁ గల్గెనే
　　　　అంబరో నీకు నన్నయ్యనాఁడు ?
ఈక్రొత్తనగలు నీవెపుడైనఁ దాల్చితే
　　　　అక్కటా నీవు తిక్కన్ననాఁడు
ఈభావగీతంబు లెపుడేనిఁ గల్గెనే
　　　　అయ్యయో నీకు, నెఱ్ఱన్ననాఁడు
ఈయంద చందంబు లెపుడేని గల్గెనే
　　　　ఔరౌర నీకు సోమన్ననాఁడు"

గీ॥ కలిగె నేఁటికి నీపూర్వ కర్మఫలము
పండి, పరిపక్వదశ నొంది వరగుకతన
హాయిగా, స్వేచ్ఛగా వీని ననుభవింప
కేద్వఁ దొరకొంటి విట్టు లిదేమి తల్లి!

ఆ॥ ప్రాతనగలు మూలఁ బడవైచి చక్కని
క్రొత్తనగలు దాల్చుకొని, ముదమ్ము
దొలఁక, గులుక లేక తొడిబడి వలపోయఁ
దగునె నీకు వెఱ్ఱితల్లి యిట్లు.

భాషాదేవి :—

సీ॥ "కాటుకకన్నీరు గార నేడ్చుడు నన్ను
ఉపలాలనముఁ జేసి యూరడించె
పరసేవకంటు దుంపలు దించు నడవిలో
మనుట శ్రేయం బంచు మదిఁ దలంచె
బహుదరిద్రతను గీడ్పడియు నా సేవకై
తనజీవితంబెల్ల ధారవోసె
సంపదంధులకు సంజనము లేమి యటంచు
నాత్మానుభవము నోరారఁ జాటె"

గీ॥ భాగవతమును బాడినన్ బ్రాథఁ జేసె
అట్టి నాకూర్మి నిరుపేద పట్టివంటి
కొడుకు కొకండైన నేఁడు నాకడుపునందు
పొడమనేనియు నాదుఃఖ మడఁగిపోదె?

ఆ॥ "కట్టులేని పొలఁతికై వడి బాసయున్
కట్టు దప్పనేని పుట్టు హాని
ఇంతెటింగి కాదె; కృతులలో కవులు నన్
నియమవతిని జేసి నిలిపినారు".

కవి :—

సీ॥ "గంటాన కవితను కదను ద్రొక్కించిన
నన్నయభట్టు లీనాఁడు లేరు
కలహాన కంచుఢక్కను మ్రుగ్గు మ్రుగ్గు గా
వించు శ్రీనాథు లీవేళ లేరు
అంకాన వాణి నోదార్చి జోలలుపాడు
పోతనామాత్యు లిప్పొద్దు లేరు
పంతాన ప్రభువుచేఁ బల్లకీనెత్తించు
కొను పెద్దనార్యు లీదినము లేరు"

గీ॥ వాణి నా రాణి యనుచు సవాలు కొట్టు
మాట నెగ్గించు వీరు లీపూట లేరు
తిరిగి యొకమాఱు వెనుకకు మరలి చూచి
దిద్దుకోవమ్మ బిడ్డలం దెనుఁగు తల్లి''

సీ॥ ఇప్పించినావు మహా మహేంద్రులచేత
కోరినచో నగ్రహారములను
గుప్పించినావు సద్గుణ నాయక స్ఫూర్తి
నలరారు కృతిరత్న హారములను
మెప్పించినావు సన్మృదులోక్తి కలన వి
ద్వత్కవి ప్రభు మహాస్థానములను
తప్పించినావు 'విద్వత్సు దారిద్ర్య'మను
సామెత, నీవేలు స్థానములను''

గీ॥ సతము నిన్నుఁ గొల్చెడు పూర్వ సత్కవులకు
నీవొసంగని యభిమతం బేది కలదు ?
తొంటియాపెంపు మగుడఁ బొందుదువు నేఁడు
జాలి నీకేటి కాంధ్రభాషావధూటి!

సీ॥ "ఆంధ్రభాషను మాటలాడుటే కడుదోస
మనిపించినట్టి దుర్దినము లరిగె
ఆంధ్రకావ్యము హస్తమందుఁ బూనుట దూష్య
మనిపించినట్టి దుర్దినము లరిగె
ఆంధ్రంబు బడులలో నభ్యసించుట వ్యర్థ
మనిపించినట్టి దుర్దినము లరిగె
ఆంధ్రుండఁ జూవె నేనని చెప్పికొనుట త
ప్పనిపించినట్టి దుర్దినము లరిగె''

గీ॥ ఇప్పుడిప్పుడు నీదు పెంపెక్కెఁగి తగిన
సేవలం జేయకున్నను చేయవలయుఁ
జేయవలయు నటంచును జెప్పికొందు
మమ్మ నీకు శుభోదర్క మదియ కాదె.

చ॥ ఇలఁగల రాజులం దడవ నేటికి నూటికి నీదుపుత్రికుల్
తలకొకరూక నీ కొఱకు దానము చేసినఁ దీరకున్న యీ
యలజడి పుట్టలేదు ప్రజలం దటు వంటికుబుద్ధి సుమ్మి చిం
తిలకు మదంబ నీ కొఱఁత దీఱెడు కాలము వచ్చుచుండెడిన్.

గీ॥ మెఱుము లఁఱుములు కదు మేరమీఱి తుదకు
జను కొకటిలేని యీ యేటి ఘనములట్లు
సభలఁ బలికి యేమియుఁ జేయఁ జాలకున్న
నిజసుతులఁ గన్న వెతగాదె నీకు మాత !

ఆ॥ కడుపుగట్టికొనుచు కావ్యముల్ రచియించి
నీదు సేవఁ జేయు పేదకవుల
కచ్చుపనులకైన, నప్పు దీరక వెతం
బడఁగవలసె బ్రతుకు మాట లేల ?

గీ॥ సత్కృతులు వ్రాయఁ గల కవీశ్వరులు గలరు
సత్కవులఁ బ్రోవఁగల మహీశ్వరులు గలరు
గ్రంథములు వ్రాయ వ్రాయింపఁ గడఁగుటొకటె
కొదవ అది తీఱినంత నీ కొదవు పెంపు
భాషాదేవి యిట్లాశీర్వదించుచున్నది.

సీ॥ "అజ్ఞానతిమిర సంహారియౌ నిర్బంధ
విద్యావిధానంబు విస్తరిల్లు
సకలవిద్యాజ్ఞాన సంపాదియగు నాంధ్ర
సర్వకళాశాల సంఘటిల్లు

దేశసంఘాభివృద్ధి ప్రదాయకమైన
ప్రత్యేకరాష్ట్రంబు పరిఢవిల్లు
ఔన్నత్యకరమైన యభినవాఖిలశాస్త్ర
వితతార్థ పరివృత్తి యతిశయిల్లు"

గీ॥ నాంధ్ర మహిమయెల్ల నామయంబై వెలుంగ
నెందు నే లోపమును లేక యేపెసంగి
జగతినాపెంపె పెంపుగా నెగడఁగలదు
వలదు సుతులార ! యావంత వంతమీకు.

భాషా దేవి యాశీర్వాదము ఫలోన్ముఖమునకు వచ్చినది. రామాయణమునకు రామాయణము, భారతమునకు భారతము భాగవతమునకు భాగవతము రచించు కవి సార్వభౌము లిప్పుడుకూడ నాంధ్రభూమి నలంకరించియున్నారు.

ఒక యాధునిక కవీంద్రుఁ డిట్లను చున్నాఁడు.

"ఉ॥ఊయెల మంచమున్, రమణియున్, విడెమిచ్చుటయున్ రసజ్ఞుఁడున్
హాయిగ మందమారుతమనంతముగాఁ బ్రసరించు సౌధమున్
బ్రాయము నేల ? యొక్క గుణదాము పదద్వయభక్తి గల్గుచోఁ
వ్రాయఁగఁజాలమే సుజన రంజకముల్ గసవత్ప్రబంధముల్"

16 వ శతాబ్దములోనివాఁడనగు కవికర్ణరసాయన కారుడు సంస్కృతాంధ్ర భాషలను గూర్చి యిట్లు వ్రాసినాఁడు.

"చ॥ జనని సమస్త భాషలకు సంస్కృతభాష ధరాస్థలంబునన్
ఘనలతతార్థ గౌరవ వికాసి తెమం గభిరమ్య మంతకున్
గనఁగొనఁ జాతబీజమునకం బెను గోమల పత్రపుష్ప శో
భన మృదువల్లవాభినవజాలరసాలము సొంపు నింపదే!"

ఒకరు వ్రాసినకథనే తాను వ్రాయుటయు, నొకరు వ్రాసిన విషయమునే వాక్యభేదములతోఁ బునరుక్తిగాఁ దా ననుకరించుటయు,

ననుసరణ దోషములోని ముఖ్యభాగములని కొందఱందురు. కాని యట్లనఁ జనదు.

"నలిన సంభవు వాహనమువారు వంబులు
కులము సాములు మాకుఁ గువలయాక్షి"

అని శ్రీనాథుఁడు వ్రాయఁగా

"చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు"

అని పెద్దన మహాకవి శ్రీనాథుని ననుసరించినాఁడు. గణపవరపు వేంకటకవి భట్టుమూర్తి పద్యములను గైకొనినాఁడు. కాళిదాసు నంతటివాఁడు శ్రీమద్రామాయణమునుండి కొన్ని భావములను, శ్లోకములను గ్రహించియున్నాఁడు. శ్లేషయమక చక్రవర్తియగు వేంకటాధ్వరి మహాకవి నైషధ, భారత చంపువులనుండి యనేక భావములను గ్రహించియున్నాఁడు. మనోహరములని తోఁచిన యట్టి పద్యములవంటి పద్యములను రచించుకొనుట కవులకు స్వభావమే. ఇంతమాత్రముచే గ్రంథచౌర్య మనరాదు. అనవలసిన మాటలింక నెన్నియో కలవు. గాని యవకాశము లేనందున నిక నొండు రెండు వాక్యములు మాత్రమే నేనిప్పుడు వచించెదను.

ఈ పరిషత్తున కిప్పుడు కాకినాడ పురపాలకాధ్యక్షులు, నభినవ భోజులునగు శ్రీ దంటు భాస్కరరావుగారు కార్యదర్శిగను, కళా ప్రపూర్ణులు, కవిసార్వభౌములు, ఆంధ్రాస్థాన కవి వరేణ్యులునగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారధ్యక్షులుగను, కవి కంఠీరవాది బిరుదాంకితులగు శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు గౌరవ సంపాదకులుగను నుండుటచేతను, ఆంధ్రప్రదేశ ప్రభుత్వామాత్యశేఖరులును, మఱియు బలువురు కవులు, పండితులు, విమర్శకులు, భాషాభిమానులు మున్నగువారలాదరాభిమానములను జూపుచున్నందువలనను దినదినాభివృద్ధిఁ గాంచఁ గలదని మనవి చేయుచు నే నింతటితో విరమించుచున్నాఁడను.

జై హింద్ కవికుల భూషణ,
దాసరి లక్ష్మణకవి.

अथाविद्यमानमेव फलं सामग्र्या जन्यत इति चेत्तत्राह—

हेतोश्च प्रत्ययानां च सामग्र्या जायते यदि ।
फलं नास्ति च सामग्र्यां सामग्र्या जायते कथम् ॥२॥

हेतुप्रत्ययसामग्र्या जायमानं फलं यदि सामग्र्यां नास्ति, तर्हि तत्राविद्यमानं फलं कथं तया सामग्र्या जन्यते । अविद्यमानस्य वन्ध्यापुत्रस्येव जनयितुमशक्यत्वादिति भावः ॥२॥

किंचान्यत्—

हेतोश्च प्रत्ययानां च सामग्र्यामस्ति चेत्फलम् ।
गृह्येत न तु सामग्र्यां सामग्र्या च न गृह्यते ॥३॥

हेतुप्रत्ययसामग्र्यां तत्फलमस्तिचेदवश्यं गृह्येत । यद्यत्रास्ति तत्तत्र गृह्यते खलु । ननु विद्यमानमपि सौक्ष्म्यादिना न गृह्यत इति चेत्सत्यम्, यद्विद्यमानं सत्र गृह्यते तत्रेयं कल्पना युज्यते । नत्वविद्यमाने । फलं च सामग्र्यां विद्यमानमेवेति न निश्चितम् । अतोऽगृह्यमाणत्वान्नास्त्येव फलं सामग्र्यां । तत एव सामग्र्या समं न गृह्यते । नन्वेवं सामग्र्यां फलस्यास्तित्वं नास्तित्वं वा न सम्भवतीत्युक्तम् , ततश्च कथमवगन्तव्यमिति चेदुच्यते- सत्त्वाऽसत्त्वान्तद्वयाऽभिनिवेशपरिहारेण मध्यमायां दृष्टौ स्थातव्यमिति ॥३॥

तदेवं सामग्रीतः फलं नोत्पद्यते । तत्र विद्यमानस्य ग्रहणप्रसङ्गादित्युक्तो कश्चिदाह— नास्त्येव सामग्र्यां फलमिति । अत्रोच्यते—

हेतोश्च प्रत्ययानां च सामग्र्यां नास्ति चेत्फलम् ।
हेतवः प्रत्ययाश्च स्युरहेतुप्रत्ययैस्समाः ॥४॥

यथा हि ज्वालाङ्गारादिषु अंकुरो नास्तीति तस्य ते हेतुप्रत्यया न भवन्ति, एवं बीजादिष्वपि यद्यंकुरो नास्ति ततस्तेपि बीजादयो हेतुप्रत्ययत्वेनाऽभिमता अहेतुप्रत्ययैर्ज्वालाङ्गारादिभिस्समा भवेयुः । एवंच स्वभावतः फलवृत्तिर्नास्तीति सिद्धमिति भावः ॥४॥

ननु सामग्र्याः फलोत्पादकत्वे एषा चिन्ता स्यात् । न वयं सामग्र्याः फलोत्पादकत्वं ब्रूमः, किंतर्हि हेतोरेव फलोत्पादनसामर्थ्यमङ्गीक्रियते । साम-

ग्री तु हेतोस्सहकारिमात्रं भवति । तथा च सामग्रीसहकृतो हेतुः फलोत्पादकं हेतुमुत्पाद्य निरुद्ध्यते । स हेतुः फलमुत्पादयतीति चेदत्रोच्यते—

हेतुं फलस्य दत्वा च यदि हेतुर्निरुद्ध्यते ।
यत्कृतं यन्निरुद्धं च हेतोरात्मद्वयं भवेत् ॥५॥

यदि हेतुः फलस्योत्पत्त्यर्थं हेतुमुत्पाद्य निरुद्ध्यत इति कल्प्यते, तदा सामग्रीसहकृत एको हेतुः, तदुत्पादितः फलस्य निष्पादकः अपरो हेतुरिति हेतोरात्मद्वयप्रसङ्गः । तस्मान्नैतद्युक्तमिति भावः ॥५॥

हेतोरात्मद्वयप्रसङ्गपरिहारार्थं फलोत्पादकं हेतुमजनयित्वैव हेतुर्निरुद्ध्यत इति कल्प्यते, तत्राह—

हेतुं फलस्याऽदत्वा च यदि हेतुर्निवर्तते ।
हेतौ निरुद्धे जातं तत्फलमाहेतुकं भवेत् ॥६॥

यदि फलस्य किंचिदकृत्वा स च हेतुर्निरुध्यते, तदा हेतौ निरुद्धे सति यत्फलमुत्पद्यते तत्फलमहेतुकमेव भवेदिति भावः ॥६॥

ननु सामग्रीफलयोस्सहोत्पत्तिरस्तु, इति चेत्तत्राह—

फलं सहैव सामग्र्या यदि प्रादुर्भवेत्पुनः ।
एककालौ प्रसज्येते जनको यश्च जन्यते ॥७॥

यदि फलं सामग्र्या सह जायते तदा जन्यजनकयोरेककालत्वप्रसङ्गः । नहि सव्येतरगोविषाणयोरेककालिकयोर्जन्यजनकभावोऽस्ति । तस्मात्फलसामग्र्योरेककालिकत्वे जन्यजनकभावो न सम्भवतीति भावः ॥७॥

नन्वभूत्वा भावानामुत्पत्तिर्यदि तदा आकस्मिकत्वप्रसङ्गः । तस्माद्धेतुप्रत्ययसामग्रीतः पूर्वमेव तत्फलमनागतावस्थया व्यवस्थितम् । अनागतात्मनस्तस्य हेतुप्रत्ययसामग्र्या वर्तमानावस्था जन्यते । द्रव्यं तु व्यवस्थितमेवेति चेत्तत्राह—

पूर्वमेव च सामग्र्याः फलं प्रादुर्भवेद्यदि ।
हेतुप्रत्ययनिर्मुक्तं फलमाहेतुकं भवेत् ॥८॥

हेतुप्रत्ययसाग्र्याः पूर्वमेव यदि फलं प्रादुर्भवतीत्युच्यते तदा हेतुप्रत्ययरहितं तत्फलं निर्हेतुकं स्यात् । न हि निर्हेतुकं किंचिदस्ति । शशशृङ्गादीनामपि सत्त्वप्रसङ्गात् ॥८॥

अत्र कश्चित्, हेतुरेव फलं जनयति, न सामग्री । नचोक्तदोषप्रसङ्गः, हेतुफलयोरनन्यत्वात् । हेतुरेव निरुद्धः फलात्मना व्यवतिष्ठत इति, अत्रोच्यते—

निरुद्धे चेत्फलं हेतौ हेतोस्संक्रमणं भवेत् ।
पूर्वं जातस्य हेतोश्च पुनर्जन्म प्रसज्यते ॥९॥

यदि निरुद्धे हेतौ फलमुत्पद्यते, तत्फलं हेत्वात्मकमेव, नाऽन्यदित्युच्यते । तदा नटस्य वेषान्तरपरित्यागेन वेषान्तरोपसंक्रमणमिव हेतोस्संक्रमणमात्रं स्यात् । नत्वपूर्वस्य फलस्योत्पादः । ततश्च हेतोः नित्यतैव स्यात् । नच नित्यं नाम किंचिदस्तीति । किंचैवंसति पूर्वं जातस्य हेतोः पुनर्जन्मप्रसङ्गश्च स्यात् । येनैवात्मना विद्यते हेतुर्न तेनैवात्मना जायत इत्यपि न युक्तम्— अवस्थाभेदेन द्रव्यभेदाभावादपरित्यक्तस्वभावस्य हेतुस्वरूपस्यैव फलमिति संज्ञामात्रभेदात् । नाऽतिरिक्तफलसिद्धिरिति भावः ॥९॥

किंचाऽन्यत्— यदि हेतुः फलं जनयति तदा निरुद्धो वा जनयेदनिरुद्धो वा? किंच तत्फलमुत्पन्नं वा जन्यते, उताऽनुत्पन्नं वा? उभयथापि नोपपद्यत इत्याह—

जनयेत्फलमुत्पन्नं निरुद्धोऽस्तंगतः कथम् ।
तिष्ठन्नपि कथं हेतुः फलेन जनयेद्वृतः ॥१०॥

निरुद्धोऽत एवास्तङ्गतो हेतुरविद्यमानत्वादुत्पन्नमत एव विद्यमानं फलं कथं जनयेत् । विद्यमानस्यैव हेतोर्जनकत्वदर्शनात् । अथ तिष्ठन्नपि हेतुः फलेन वृतः, फलसम्बद्धः कथं फलं जनयेत् । फलस्यापि विद्यमानत्वात् ॥१०॥

यदि विद्यमानस्य फलस्य पुनर्जनयितुमशक्यत्वादवृतः फलेनाऽसम्बद्ध एव हेतुः फलं जनयतीत्युच्यते, तत्राह—

अथाऽवृतः फलेनासौ कतमज्जनयेत्फलम् ।
नह्यदृष्टं च दृष्टं च हेतुर्जनयते फलम् ॥११॥

यद्यसौ हेतुः फलेनावृतस्तर्हि फलेनासंबद्धत्वाविशेषात्सर्वमेव फलं जनयेत्सर्वमेव वा न जनयेत् । एतदेवाह—कतमज्जनयेदिति । किमपि किंचिदपि फलं न जनयतीति भावः । किंचान्यत्— यदि हेतुः फलं जनयेत्स दृष्टं वा फलं

जनयेददृष्टं वा? उभयथापि न युज्यत इत्याह—नह्यदृष्टमित्यादिना। यदि हेतुर्दृष्टं फलं जनयतीत्युच्यते तदा दृष्टस्य विद्यमानत्वादेव तन्न जनयति हेतुः। नाप्यदृष्टं जनयति। सर्वस्यापि सर्वस्माद्धेतोरुत्पादप्रसङ्गात्। अदृष्टत्वाविशेषादस्मादेवेदं जायत इति विशिष्य ज्ञातुमशक्यत्वात्। अतश्चैषा कल्पनाऽनुपपन्नेति भावः॥

किंच हेतोः फलस्य च अन्योन्यसङ्कलनलक्षणं सङ्गमनं विना जन्यजनकभावो न सम्भवति। परस्परमसङ्गतयोरालोकान्धकारयोस्तदृदर्शनात्। तथा च हेतुफलयोस्सङ्गतिरवश्यमभ्युपेया। सा च विचार्यमाणा कालत्रयेपि न सम्भवतीत्याह—

नातीतस्य ह्यतीतेन फलस्य सह हेतुना।
नाऽजातेन न जातेन सङ्गतिर्जातु विद्यते॥१२॥

अतीतस्य फलस्यातीतेन हेतुना सह सङ्गतिर्नास्ति। उभयोरप्यविद्यमानत्वात्। नाप्यजातेन हेतुना सह अतीतस्य फलस्य सङ्गतिरस्ति। अविद्यमानत्वेनैवोभयोः। नापि जातेन विद्यमानेन हेतुना सहातीतस्य फलस्य सङ्गतिरस्ति। फलस्यातीतत्वाद्धेतोर्विद्यमानत्वाच्च भिन्नकालिकयोस्सङ्गत्ययोगात्॥

यथैवाऽतीतस्य फलस्य त्रैकालिकेन हेतुना न सङ्गतिरस्ति, एवं वर्तमानस्यापि फलस्य त्रैकालिकेन हेतुना सङ्गतिर्नास्ति। तदेतदाह—

न जातस्य ह्यजातेन फलस्य सह हेतुना।
नाऽतीतेन न जातेन सङ्गतिर्जातु विद्यते॥१३॥

जातस्य फलस्याजातेनातीतेन वा हेतुना सह सङ्गतिर्नास्ति। भिन्नकालत्वात्। नापि वर्तमानस्य फलस्य वर्तमानेनापि हेतुना सङ्गतिस्सम्भवति। वर्तमानत्वेन समयोस्सङ्गतिवैयर्थ्यात्। विद्यमानयोः परस्परनिरपेक्षयोरेव सङ्गत्या प्रयोजनमस्ति। नतु परस्परसापेक्षयोः। तयोरसिद्धत्वादिति भावः॥१३॥

इदानीमनागतस्यापि फलस्य यथातीतेन वर्तमानेन च हेतुना सङ्गतिर्नास्ति तथा प्रतिपादयन्नाह—

नाऽजातस्य हि जातेन फलस्य सह हेतुना।
नाऽजातेन न नष्टेन सङ्गतिर्जातु विद्यते॥१४॥

अजातस्याऽनागतस्य फलस्यातीतेन वर्तमानेन वा हेतुना सह सङ्गति-र्नास्ति । हेतुफलयोर्भिन्नकालत्वात् । नाप्यनागतस्य फलस्यानागतेनापि हेतुना सह सम्बन्धः सम्भवति । उभयोरप्यविद्यमानत्वात् ॥१४॥

यदा चैवं हेतुफलयोस्सर्वथा सम्बन्धो नास्ति तदा—

असत्यां सङ्गतौ हेतुः कथं जनयते फलम् ।
सत्यां वा सङ्गतौ हेतुः कथं जनयते फलम् ॥१५॥

नैव हेतुः फलं जनयति । सङ्गतेरविद्यमानत्वात् । नापि सत्यामपि सङ्गतौ हेतुः फलं जनयति । सङ्गतस्य फलस्य विद्यमानतया पुनर्जन्मवैयर्थ्यात्॥१५

किंच—

हेतुः फलेन शून्यश्चेत्कथं जनयते फलम् ।
हेतुः फलेनाऽशून्यश्चेत्कथं जनयते फलम् ॥१६॥

योऽयं फलस्य हेतुः स तेन फलेन शून्यो वा फलमुत्पादयेदशून्यो वा? तत्र यदि हेतुः फलेन शून्यस्तदा अहेतुतुल्यत्वात्कथं फलमुत्पादयति । यदि च फलेनाशून्यस्तदा फलस्य विद्यमानत्वाद्विद्यमानस्य पुनर्जन्म सम्भवति । वैयर्थ्यं च स्यादिति भावः ॥१६॥

यच्चापि फलमुत्पद्यते तदप्यशून्यं शून्यं वा इति विकल्प्य क्रमेण दूषयितुमाह—

फलमुत्पद्यतेऽशून्यमशून्यं न निरोत्स्यते ।
अनिरुद्धमनुत्पन्नमशून्यं तद्भविष्यति ॥१७॥

अप्रतीत्यसमुत्पन्नं स्वभावव्यवस्थितं च यत्तदशून्यमित्युच्यते, तादृशं यदि फलं तदा नैवोत्पत्स्यते, नैव निरोत्स्यते च, तादृशमुत्पत्तिनिरोधरहितं च फलं नास्ति । तस्मादशून्यं फलमुत्पत्स्यत इति न सम्भवति । फलस्योत्पादनिरोधाऽभ्युपगमात् ॥१७॥

इदानीं शून्यमपि फलं न सम्भवति । अनुदयप्रसङ्गादिति प्रतिपादयन्नाह—

कथमुत्पत्स्यते शून्यं कथं शून्यं निरोत्स्यते ।
शून्यमप्यनिरुद्धं तदनुत्पन्नं प्रसज्यते ॥१८॥

यत्स्वभावेन नास्ति तच्छून्यमित्युच्यते। फलं यदि तादृशं तर्हि कथमुत्पत्स्यते, कथं वा निरोत्स्यते, नहि स्वभावेनाऽविद्यमानस्योकस्येव उदयव्ययौ दृष्टौ। तस्मादिष्यमाणं शून्यं तत्फलमनिरुद्धमनुत्पन्नं च स्यात्। तच्चाऽनिष्टमित्यावेदितं प्रागेव ॥१८॥

किंचान्यत्, यदि हेतुः फलं जनयेत्स चाव्यतिरिक्तो वा जनयेद्व्यतिरिक्तो वा? उभयथापि न युज्यत इत्याह—

**हेतोः फलस्य चैकत्वं न हि जातूपपद्यते।**
**हेतोः फलस्य चान्यत्वं न हि जातूपपद्यते ॥१९॥**
**एकत्वे फलहेत्वोस्स्यादैक्यं जनकजन्ययोः।**
**पृथक्त्वे फलहेत्वोस्स्यात्तुल्यो हेतुरहेतुना ॥२०॥**

यदि हेतुफलयोरेकत्वं स्यात्तदा बीजांकुरयोः पितृपुत्रयोरप्येकत्वं स्यात्। नचैतदिष्टम्, यदि हेतुफलयोः पृथक्त्वं स्यात्तदा परत्र निरपेक्षत्वादित्युक्तदिशा हेतुनिरपेक्षमेव फलं स्यात्। नैतदपीष्टम्। यतश्चैवं विचार्यमाणे हेतुफलयोस्तत्त्वान्यत्वे न सम्भवतः अतो हेतुः फलं जनयतीत्यनुपपन्नमेव ॥२०॥

किंचान्यत्, यदि हेतुः फलं जनयेत्तदा तत्फलं सद्भूतमसद्भूतं वा? उभयथापि नोपपद्यत इत्याह—

**फलं स्वभावसद्भूतं किं हेतुर्जनयिष्यति।**
**फलं स्वभावाऽसद्भूतं किं हेतुर्जनयिष्यति ॥२१॥**

तत्र फलं यदि स्वभावेन सद्भूतं—विद्यमानं चेत्तदा हेतुः फलं न जनयितुं प्रभवति। फलस्य विद्यमानत्वात्। यदि च फलं स्वभावेनाऽविद्यमानं तदा शशविषाणवदविद्यमाने हेतुः किं जनयिष्यति? न किमपि जनयिष्यतीति भावः। ननु प्रतिबिम्बे अनैकान्तिकतेति चेदस्त्वेवम्, तथापि भावानां निःस्वभावत्वमव्याहतमेव। वस्तुतस्तु सस्वभावो न कश्चित्पदार्थोऽस्ति। अतस्तत्प्रतिद्वन्दी निःस्वभावोपि नास्ति। तथा च कुत्रानैकान्तिकता। नह्यस्माकं प्रतिबिम्बं सस्वभावं, निःस्वभावं वा। तस्मान्न किंचिदेतत्। पूर्वं 'फलं नोत्पद्यत' इत्यादिना श्लोकद्वयेन फलस्योत्पत्तिक्रियाकर्तृत्वं प्रतिषिद्धम्। अत्र तु हेतोरुत्पत्तिक्रियायां प्रयोजकत्वं प्रतिषिद्धमिति वेदितव्यम् ॥२१॥

यद्यपि हेतोरुत्पत्तिक्रियाप्रयोजकत्वं प्रतिषिद्धम् । तथापि हेतुः स्वभावतोऽस्ति । न चासति फले हेतुत्वमुपपद्यते । तस्मादस्ति फलमपीति चेदत्रोच्यते—

न चाजनयमानस्य हेतुत्वमुपपद्यते ।
हेतुत्वानुपपत्तौ च फलं कस्य भविष्यति ॥२२॥

येन यज्जन्यते तस्य तद्धेतुत्वं सिद्ध्यति । अजनयमानस्य तु क्वापि हेतुत्वं नास्ति । एवं हेतुत्वस्यानुपपत्तौ सत्यां कस्य फलं भविष्यति, फलमपि नास्तीति भावः ॥२२॥

ननु केवलस्य हेतोः फलोत्पादकत्वं नास्ति । किं तु हेतुप्रत्ययसामग्री फलमुत्पादयतीति चेन्न । प्रागेव दूषितत्वात् । किं च येयं सामग्री फलमुत्पादयतीत्युच्यते, सा स्वयमात्मानं जनयति? उत न जनयति? उभयथापि न सम्भवतीत्याह—

न च प्रत्ययहेतूनामियमात्मानमात्मना ।
या सामग्री जनयते कथं जनयतात्फलम् ॥२३॥

येयं प्रत्ययहेतूनां सामग्री, सा तावत्स्वात्मानं स्वात्मना जनयितुं न प्रभवति- स्वात्मनि क्रियाविरोधात्, उत्पन्नस्य पुनरुत्पादवैयर्थ्याच्च । एवं स्वात्मानमेव जनयितुमसमर्था सा सामग्री कथं फलं जनयेत्, न जनयतीति भावः ॥

एवम्—

न सामग्रीकृतं फलं नाऽसामग्रीकृतं फलम् ।
अस्ति प्रत्ययसामग्री कुत एव फलं विना ॥२४॥

एवं तावत्सामग्रीकृतं फलं नास्ति । असामग्रीकृतमपि फलं नास्ति । तथासति फलस्य नित्यत्वप्रसङ्गात् । यदि फलं नास्ति, तदा फलमन्तरा प्रत्ययसामग्र्यपि नास्तीति बोध्यम् ॥२४॥

इति सुबोधिनीव्याख्यासहित माध्यमिककारिकासु
सामग्रीपरीक्षानाम विंशतितमं प्रकरणम् ।

सुबोधिनीव्याख्यासहित-

# माध्यमिककारिकासु,

## सम्भवविभवपरीक्षानामैकविंशतितमं प्रकरणम् ।

इह कश्चित्कालविशेषमपेक्ष्यांकुरादीनामुत्पादो भवति । कश्चित्कालविशेषमपेक्ष्य विनाशः । अतस्सम्भवविभवसद्भावादस्ति तद्धेतुः काल इति चेत्तत्राह—

विना वा सह वा नास्ति विभवस्सम्भवेन वै ।
विना वा सह वा नास्ति सम्भवो विभवेन वै ॥१॥

इह सम्भवविभवावन्योन्यं सहभावेन वा स्यातां, उताऽसहभावेन वा? उभयथापि न सम्भवतः । कथम्? उच्यते ॥१॥

तत्र विभवस्सम्भवेन विना यथा न सम्भवति तथा आह—

भविष्यति कथं नाम विभवस्सम्भवं विना ।
विनैव जन्म मरणं विभवो नोद्भवं विना ॥२॥

सम्भवमुत्पत्तिं विना विभवो विनाशः कथं नाम भविष्यति । कथं नामेति प्रसिद्धमसम्भवं दर्शयति । नैवैतत्सम्भवतीति भावः । यदि सम्भवं विना विभवस्स्यात्तर्हि विनैव जन्म मरणमपि स्यादिति प्रतिकूलतर्कप्रदर्शनम् । नह्यजातस्य मरणं क्वापि दृष्टमतो नेष्टापत्तिरिति न शक्यते वक्तुमिति भावः । तथा च अत्राद्येन श्लोकार्थेन प्रतिज्ञा दर्शिता । तृतीयेन श्लोकपादेन प्रतिकूलतर्कोद्भावनम्, चतुर्थेन निगमनमिति विवेकः ॥२॥

एवं सम्भवेन विना विभवो न सम्भवतीत्यभिधाय इदानीं विभवस्सम्भवेन सहापि न सम्भवतीत्याह—

सम्भवेनैव विभवः कथं सह भविष्यति ।
न जन्म मरणं चैव तुल्यकालं हि विद्यते ॥३॥

यदि सम्भवेन सह युगपद्विभवस्स्यात्तदा जन्ममरणे युगपत्स्यातां । आलोकान्धकारवत्परस्परविरुद्धे जन्ममरणे तुल्यकालं न स्तः । तस्मात्सहापि सम्भवेन विभवस्य सिद्धिरिति भावः ॥३॥

यथा चैवं सम्भवेन सह वा विना वा विभवस्य नास्ति सिद्धिरेवं सम्भवस्यापि विभवेन सह वा विना वा नास्ति सिद्धिरित्याह—

भविष्यति कथं नाम सम्भवो विभवं विना ।
अनित्यता हि भावेषु न कदाचिन्न विद्यते ॥४॥

यस्मादनित्यता भावेषु भवनधर्मेषु न कदाचिन्न विद्यते सर्वदा विद्यते, तस्माद्विभवं विना सम्भवो न सम्भवतीत्यर्थः ॥४॥

इदानीं विभवेन सह सम्भवस्य सिद्धिर्नास्तीत्याह—

सम्भवो विभवेनैव कथं सह भविष्यति ।
न जरा मरणं चैव तुल्यकालं हि विद्यते ॥५॥

यदि सम्भवो विभवेनैव सह स्यात्तदा जरामरणयोः तुल्यकालता स्यात् । नचैवं सम्भवति । तस्मात्सहभावेनापि सम्भवविभवयोः नास्ति सिद्धिरिति भावः॥

अपि च—

सहाऽन्योन्येन वा सिद्धिर्विनाऽन्योन्येन वा ययोः ।
न विद्यते तयोस्सिद्धिः कथं नु खलु विद्यते ॥६॥

सहभावाऽसहभावरहितं पक्षान्तरं नास्ति यतस्सम्भवविभवयोस्सिद्धिस्स्यात् । नन्ववाच्यतया सिद्धिर्भविष्यतीति चेत्केयमवाच्यता नाम? यदि मिश्रीभावस्तदाऽनुपपत्तिः । पृथक्पृथक्सिद्धयोर्मिश्रीभावस्याऽभावात् ॥६॥

किंचाऽन्यत् , इह परिकल्प्यमानौ सम्भवविभवौ क्षयधर्मिणो वा भावस्य परिकल्प्येते? अक्षयधर्मिणो वा? उभयथापि न सम्भवतीति प्रतिपादयन्नाह—

क्षयस्य सम्भवो नास्ति नाऽक्षयस्यास्ति सम्भवः ।
क्षयस्य विभवो नास्ति विभवो नाऽक्षयस्य च ॥७॥

क्षयलक्षणस्य भावस्य सम्भवो नास्ति, सम्भवविरुद्धेन क्षयधर्मेणाक्रान्तत्वात् । अक्षयस्यापि भावस्य सम्भवो नास्ति, अक्षयस्य भावस्य खरविषाणवदविद्यमानत्वात् । एवं क्षयस्य भावस्य विभवोऽपि नास्ति । क्षयभावस्याऽसत्त्वेन निराश्रयस्य विभवस्यावस्थानाऽयोगात् । भावाभावविलक्षणस्याऽत एवाविद्यमानस्याक्षयस्यापि विभवो नास्ति । एवं सम्भवविभवौ, क्षयस्याक्षयस्य वा न सम्भवतः । तस्मात्तौ सम्भवविभवौ न स्तः ॥७॥

ननु सम्भवविभवयोराश्रयस्य भावस्यासत्त्वात्तावपि विद्येते इत्याशङ्क्य तदाश्रयं भावं निराकरोति—

सम्भवो विभवश्चैव विना भावं न विद्यते ।
सम्भवं विभवं चैव विना भावो न विद्यते ॥८॥

भावस्य लक्षणभूतौ सम्भवविभवौ न स्त इति प्रतिपादितं प्राक् । यदा तावप्रसिद्धौ तदा लक्षणाभावाद्विलक्षणो भावोपि नास्ति । भावंविना सम्भवविभवावपि न तिष्ठत आश्रयाभावादिति भावः ॥८॥

किंचेह परिकल्प्यमानौ सम्भवविभवौ शून्यस्य वा भावस्य परिकल्प्येते? अशून्यस्य वा? उभयथापि नोपपद्यत इति प्रतिपादयन्नाह—

सम्भवो विभवश्चैव न शून्यस्योपपद्यते ।
सम्भवो विभवश्चैव नाऽशून्यस्योपपद्यते ॥९॥

शून्यस्य शून्यत्वादेव अविद्यमानाश्रयावाकाशकुसुमवन्नोपपद्येते । अशून्यस्याप्यभावात्तस्यापि सम्भवविभवौ न स्तः । तस्मादाश्रयाभावात्सम्भवविभवौ न स्त इति भावः ॥९॥

किंच यदि सम्भवविभवौ स्यातां तावेकत्वेन वा स्यातामुताऽन्यत्वेन वा? उभयथापि दोषमाह—

सम्भवो विभवश्चैव नैक इत्युपपद्यते ।
सम्भवो विभवश्चैव न नानेत्युपपद्यते ॥१०॥

परस्परविरुद्धस्वभावत्वादालोकान्धकारयोरिव नैकत्वमनयोः । नापि नानात्वमनयोः परस्परमुभयोरव्यभिचारात् । नहि सम्भवं विना विभवो विभवं विना सम्भवो वास्ति । तस्मादव्यभिचारान्न नानात्वमप्यनयोरुपपद्यत इति भावः ॥१०॥

ननु रागोपहतात्मा पुरुषः सम्भवं विभवं च पश्यति । नह्यविद्यमानस्य दर्शनं सम्भवति । तस्मात्सम्भवविभवौ सिद्ध्यत इति चेदत्रोच्यते—

दृश्यते सम्भवश्चैव विभवश्चैव ते भवेत् ।
दृश्यते सम्भवश्चैव मोहाद्विभव एव च ॥११॥

रागोपहतात्मना दृश्यमानत्वात्सम्भवविभवौ स्यातामिति यदुक्तं भवता तदयुक्तम्—अनैकान्तिकत्वात् । गोपालाङ्गनादिको जनो गन्धर्वनगरादिकं पश्यति।

न तावता गन्धर्वनगरादिकं सिद्धयति । एवमिमावपि सम्भवविभवावसन्तावेव मोहात्पश्यति । न तावता तयोस्सिद्धिरिति भावः।

ननु कथमेतदेवं निश्चीयते— अविद्यमानावेव सम्भवविभवौ मोहात्पश्यतीति । उच्यते, इह यदि कश्चिद्भावो नाम भवेत्स किं भावाद्वा भवेदभावाद्वा? एवमभाव इत्युच्यते कश्चित्सोऽपि भावाद्वा जायते, अभावाद्वा? उभयथाप्युभयोरप्यसम्भवः । तस्मान्निश्चीयते मोहात्पश्यतीति ॥११॥

यथाचाऽसम्भवस्तथा प्रतिपादयन्नाह—

न भावाज्जायते भावो भावोऽभावान्न जायते ।
नाऽभावाज्जायतेऽभावोऽभावो भावान्न जायते ॥१२॥

न भावाद्भावो जायते, कार्यकारणयोर्यौगपद्याभावात् । नाप्यभावाद्भावो जायते । अभावो हि भावस्य विरोधी शून्यः । कथं तस्माद्भावविरोधिनो भाव उत्पद्यते? एवमभावादप्यभावो नोत्पद्यते-द्वयोरपि शून्यत्वाविशेषात् । नहि खरविषाणात्खपुष्पमुत्पद्यते । नापि भावादप्यभावो जायते । उभयोर्मिथो विरुद्धत्वात् । यतश्चैवं सम्भवविभवौ न स्तः अतो मोहात्पश्यतीति युक्तमुक्तम् ॥१२॥

अपि च यदि कश्चिद्भावो यदि स्यात्तदा तस्यायव्ययशालित्वेन सम्भवविभवौ स्यातां, स एव नास्तीत्याह—

न स्वतो जायते भावः परतो नैव जायते ।
न स्वतः परतश्चैव जायते जायते कुतः ॥१६॥

यथा च भावः स्वतः परतो वा न जायते तथा आदावेव प्रथमप्रकरणे निरूपितम् । तस्मान्नात्र निरूप्यते । यस्स्वतः परतो वा न जायते स कस्मादपि न जायते । तस्माद्भावस्योत्पादो नास्ति । भावोपि नास्तीति भावः ॥१३॥

अवश्यं चैतदेवमभ्युपगन्तव्यम् , एवमनङ्गीकारे दोषमाह—

भावमभ्युपपन्नस्य शाश्वतोच्छेददर्शनम् ।
प्रसज्यते स भावो हि नित्योऽनित्योऽथ वा भवेत् ॥१४॥

यो हि यथोपवर्णितपदार्थव्यवस्थामुल्लङ्घ्य भावसद्भावदर्शनमभ्युपैति तस्य शाश्वतदर्शनप्रसङ्गः, उच्छेददर्शनप्रसङ्गो वा अपरिहरणीयस्स्यात् । कथम् ? स

परिकल्प्यमानो भावः यदि नित्यः परिकल्प्यते तदा शाश्वतवादप्रसङ्गः । यद्यनित्यः परिकल्प्यते तदोच्छेदवादप्रसङ्गः । उभयमप्येतद्बौद्धमतविरुद्धमिति भावः ॥

अत्राह पूर्ववादी—

भावमभ्युपपन्नस्य नैवोच्छेदो न शाश्वतम् ।
उदयव्ययसन्तानः फलहेत्वोर्भवस्स हि ॥१५॥

यो हि फलहेत्वोरुदयव्ययसन्तानः स एव भवस्संसारः, स चेष्यतेऽस्माभिः । यदि हेतुर्निरुध्यते तदा तद्धेतुकं फलं न स्यात् । अत उच्छेददर्शनप्रसङ्गो नास्ति । यदि च हेतुर्न निरुध्यते तदा अनिरुद्धस्यासत्त्वात्फलाभावस्स्यात् । तस्माच्छाश्वतदर्शनप्रसंगोपि नास्ति । संस्काराणामुत्पादव्ययसन्तानाभ्युपगमान्न शाश्वतोच्छेददर्शनप्रसङ्गयोरापत्तिरिति भावः ॥१५॥

सिद्धान्ती प्रतिक्षिपति—

उदयव्ययसन्तानः फलहेत्वोर्भवस्स चेत् ।
व्ययस्यापुनरुत्पत्तौ हेतूच्छेदः प्रसज्यते ॥१६॥

फलहेत्वोर्य उदयव्ययसन्तानः स एव भव इत्यंगीकारेपि यो हि हेतुः फलमुत्पाद्य निरुद्ध्यते तस्य निरुद्धस्य हेतोः पुनरनुत्पादादुच्छेददर्शप्रसङ्गो दुर्वार एव ॥१६॥

एवमुच्छेददर्शनप्रसङ्गमुक्त्वाऽधुना शाश्वतदर्शनप्रसङ्गमुद्भावयति—

सद्भावश्च स्वभावेन नाऽसद्भावश्च युज्यते ।
निर्वाणकाले चोच्छेदः प्रशमाद्भवसन्ततेः ॥१७॥

यदि स्वभावतो हेतोस्सद्भावस्स्यात्तस्य पश्चादप्यसद्भावस्सम्भवति । स्वभावस्यानपायित्वात् । ततश्च शाश्वतदर्शनप्रसङ्गस्तदवस्थ एवेति । यद्यपि हेतुफलयोस्सन्तानप्रवृत्त्यङ्गीकारेण शश्वतोच्छेददर्शनप्रसङ्गपरिहारः प्रागुक्तः, तथापि यदा अस्य सन्तानस्य पुनरप्रवृत्तिस्तत्र निर्वाणे भवसन्ततेरत्यन्तप्रशमादुच्छेददर्शनप्रसङ्गो दुर्वारः । उच्छेददर्शनं च प्रहातव्यमित्युक्तं भगवता ॥१७॥

यत्तूक्तम्— 'उदयव्ययसन्तानः फलहेत्वोर्भवस्सहि' इति, तदपि नोपपद्यते। कथं? इह गतिनिवृत्तिलक्षणो चरमो भावः, गतिसन्धिलक्षणः प्रथमो भावः। तत्र निरुध्यमानो चरमभावो हेतुत्वेनावतिष्ठते, उत्पद्यमानस्तु प्रथमो भावः फलत्वेन। अत्र विचार्यते। य एष प्रथमो भावः फलरूपत्वेन व्यवस्थाप्यते स किं चरमभावे निरुद्धे उपजायते, उतानिरुद्धे, उत निरुध्यमाने वा? सर्वथापि न सम्भवतीति प्रतिपादयन्नाह—

**चरमे न निरुद्धे च प्रथमो युज्यते भवः।**
**चरमे नाऽनिरुद्धे च प्रथमो युज्यते भवः ॥१८॥**

तत्र चरमे हेतुभूते भवे, भावे निरुद्धे सति प्रथमः फलरूपो भव उत्पद्यत इति न युज्यते, फलस्य निर्हेतुकत्वप्रसङ्गात्। नहि दग्धाद्बीजादंकुरोत्पत्तिः भवति। अनिरुद्धे च चरमे भवे प्रथमो भव उत्पद्यत इत्यपि न युज्यते, अविकृतात्कारणात्कार्योत्पादासम्भवात्। एकस्यैव भावस्य द्विरूपता च स्यात्। अपूर्वस्योत्पादप्रसङ्गश्च स्यात्। चरमस्य भावस्य नित्यताप्रसङ्गश्च स्यात्। तस्मादनिरुद्धे भावे भावोत्पत्तिरप्ययुक्तैवेति भावः ॥१८॥

इदानीं निरुध्यमानेपि चरमे भावे यथा प्रथमो भावः नोपपद्यते तथा प्रतिपादयन्नाह—

**निरुध्यमाने चरमे प्रथमो जायते यदि।**
**निरुध्यमान एकस्स्याज्जायमानोऽपरो भवेत् ॥१९॥**

निरुध्यमान इति वर्तमानार्थकप्रत्ययान्तशब्दवाच्यत्वान्निरुध्यमानो वर्तते, जायत इत्यपि वर्तमानार्थकप्रत्ययान्तशब्दवाच्यत्वाज्जायमानोपि वर्तते, अथ वा निरुध्यमानो निरोधक्रियाकारकः, जायत इति जनिक्रियाकारकः। तावुभौ यदि निरुध्यमाने चरमे प्रथमो जायते, तदा युगपत्सजातीयभावद्वयाङ्गीकारप्रसङ्गः। स चायुक्त इति भावः ॥१९॥

किं चान्यत्—

**न वा निरुध्यमानश्च जायमानश्च युज्यते।**
**सार्धं च म्रियते येषु तेषु स्कन्धेषु जायते ॥२०॥**

यतो निरुद्धे, अनिरुद्धे, निरुध्यमाने वा चरमे भावे प्रथमो भावो जायत इति न युज्यते, अतो निरुध्यमानो जायमानश्च भावो न युज्यते। किं च येष्वेव स्कन्धेषु भावो म्रियते, तेष्वेव स्कन्धेषु पुनः स एव भावो जायत इत्यप्यसङ्गतमेव। म्रियमाणस्य भावस्य जननाभावादिति भावः ॥२०॥

एवं च—

त्रिषु कालेषु या नास्ति सा कथं भवसन्ततिः।
उदयव्ययसन्तानः फलहेत्वोर्भवस्स हि ॥२१॥

यस्माच्चरमभावे निरुद्धे, अनिरुद्धे, निरुध्यमाने वा प्रथमभवो नास्ति तस्मात्सा भवसन्ततिः कथं सिद्ध्यति। अतः 'उदयव्ययसन्तानः फलहेत्वोर्भवस्स हि' इति यदुक्तं भवता तदत्यन्तमसङ्गतमिति भावः ॥२१॥

इति सुबोधिनीव्याख्यासहित माध्यमिककारिकासु
सम्भवविभवपरीक्षानामैकविंशतितमं प्रकरणम्।

---

सुबोधिनीव्याख्यासहित-

# माध्यमिककारिकासु,

## तथागतपरीक्षानाम द्वाविंशतितमं प्रकरणम्।

ननु भगवान् यथैव धर्माणां तत्त्वं व्यवस्थितं तथैव जगाद। अत एव स सर्वज्ञ इति, बुद्ध इति, तथागत इति चोच्यते। यदि भवसन्ततिः न स्यात्तदा तथागतोपि न स्यात्। नह्येकेन जन्मना तथागततत्वमनुप्राप्तुं शक्यम्। अतस्तथागतसद्भावाद्विद्यत एव भवसन्ततिरिति चेदत्रोच्यते। यदि तथागतोनाम कश्चित्स्वभावतः स्यात्तदा भवसन्ततिरपि स्यात्। नहि कश्चित्तथागतो नाम

कश्चिद्भावस्वभावः स्वभावतोऽस्ति । किं त्वविद्यातिमिरोपहतनयनतया भवान् द्विचन्द्रमिव मिथ्यातथागतमेव स्वभावत उपलभते । यथा च तथागतो नास्ति भावस्वभावस्तथा प्रतिपादयन्नाह—

स्कन्धो न नान्यः स्कन्धेभ्यो नास्मिन् स्कन्धा न तेषु सः ।
तथागतः स्कन्धवान्न कतमोऽत्र तथागतः ॥१॥

यदि तथागतो नाम कश्चित्पदार्थः स्यात्स किं स्कन्धस्वभावो वा भवेत्, स्कन्धव्यतिरिक्तो वा । तत्रापि स्कन्धाः तथागते वा स्युः, स्कन्धेषु वा तथागतः स्यात् । अथवा तथागतः स्कन्धवान्वा स्यात् । सर्वथा च न सम्भवति । रूपसंज्ञाविज्ञानसंस्कारवेदनाख्याः पञ्च स्कन्धाः । तथागतः न स्कन्धस्वरूपः— 'यदिन्धनं स चे दग्नि'रिति अग्नीन्धनपरीक्षायामुक्तदिशा कर्तृकर्मणोरेकत्वप्रसङ्गात् । तथा— 'आत्मा स्कन्धो यदि भवे' दित्यात्मपरीक्षोक्तदिशा उदयव्यय प्रसङ्गाच्च । नाप्यन्यः तथागतः स्कन्धेभ्य इति शक्यते वक्तुम् । 'अन्यश्चेदिन्धनादग्नि' रित्युक्तदिशा 'बुद्धोऽन्यश्चेदुपादानं विनापि स भवे'दिति अहेतुकत्वप्रसङ्गात् । 'स्कन्धेष्वात्मा विद्यते नैव, चामी सन्ति स्कन्धा नात्मनि' इत्यारभ्य 'स्वेभ्योन्यत्वे स्यादियं कल्पना नैतच्चान्यत्वं नास्त्यतः कल्पनैषा' इत्यादिना माध्यमिकावतारे पक्षद्वयस्य निराकृतत्वात् स्कन्धेषु तथागतः, तथागते वा स्कन्धा इति पक्षद्वयमनुपपन्नम् । एवं स्कन्धवानपि तथागतो न भवति । 'इष्टो नात्मा रूपवानस्ति यस्मान्मत्वर्थीयस्योपयोगोऽस्ति नातः' इत्यादिना तत्रैव दूषितत्वात् । यश्चैवं विचार्यमाणो नास्ति तथागतः स स्वभावतस्सर्वदैव नास्तीत्याशयेनोक्तं, कतमोत्र तथागत इति । नास्त्येव तथागतः । तदभावाद्भवसन्ततिरपि नास्तीति भावः ॥१॥

ननु न ब्रूमो वयं पूर्वोक्तं कल्पपञ्चकं, किं तु मलान् स्कन्धानुपादाय तत्त्वान्यत्वाभ्यामवक्तव्यमेव तथागतं व्यवस्थापयाम इति चेत्तत्राह—

बुद्धः स्कन्धानुपादाय यदि नास्ति स्वभावतः ।
स्वभावतश्च यो नास्ति कुतस्स परभावतः ॥२॥

यदि बुद्धो भगवानमलःस्कन्धानुपादाय तत्त्वान्यत्वाभ्यामवक्तव्यः स्वभावतो

